శ్రీ ర స్తు.

వేదాంతతత్త్వప్రకరణం బగు

# వి వే క సిం ధు వు

కొండనార్యప్రణీతము.








చె న్న పు రి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

1 9 3 0.

శ్రీరస్తు.

వేదాంతతత్త్వప్రకరణం బగు

# వివేకసింధువు

కొండనార్యప్రణీతము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే.

ప్రకటితము.

1930.



ఓమ్ సద్గురుపరబ్రహ్మణే నమః.

# వివేకసింధువు



## పీఠిక.

కైవల్యరమాకటాక్షవిలస
చ్ఛృంగారభావప్రసూ
నాకీర్ణాంఘ్రిసరోజుఁడై తదనుభూ
త్యానందసంధానస
త్సైకానందలసచ్చిదాహ్వయవధూ
సేవారతిం జొక్కు వి
ద్యాకల్పోన్నతుఁడైనసద్గురుని ద
త్తాత్రేయునిం గొల్చెదన్. 1

చ. హరినిగురించి ఘోరతప మత్రిమునీంద్రుఁడుసేయమెచ్చినీ
వరుదుగవేఁడుమిత్తు వరమన్నను పుత్త్రతనొందుమన్న సా
దరమున సమ్మతించి యిదె దత్తుఁడనైతినటంచు వారిమం
దిరమున బుట్టినట్టి మమదేశికు దత్తుని నాశ్రయించెదన్. 2

మ. వరయోగీంద్రులహర్నిశంబు నియతిన్ వైరాగ్యసంయు
క్తులై, పరమానందమరందకందళిత హృత్పంకేజసత్కర్ణి

కాం, తరమందుఁ వసియింపఁజేసి మహీతాంతర్లక్ష్యసం ధానతత్పరులై మోక్షముగాంతురాగురుపరబ్రహ్మంబు జిం తించెదన్.

సీ. ఘనశేముషీదర్పకవ్యూహసౌజ్ఞాఖ్య
భరతుండు ధవళాతపత్ర మిడ న
హమ్మనోసంకర్షణానిరుద్ధవ్యూహ
సౌజ్ఞసౌమిత్రు లెచ్చరికసేయ
నుభయపార్శ్వంబుల యోగబోధాస్త్రీలు
రమణీయవింజామరములు వీవ
నీవారశూకవత్తైౖలవల్యకామినీ
సౌజ్ఞభూపుత్రి ముచ్చటలునెరప
తే. సుప్రభాబద్ధశృంగాటకప్రసిద్ధ
యుగదళస్నిగ్ధమండలత్రయవిశుద్ధ
వజ్రసింహాసనాసీను వాసుదేవుఁ
దారకబ్రహ్మరామభూధవునిఁ దలఁతు. 4

ఉ. రాముఁడు దైత్యదుర్మదవిరాముఁడు గౌస్తుభరత్నమౌక్తికా
ధాముఁడుజానకీహృదయధాముఁడు నిర్మలనీలనీరద
శ్యాముఁడు దిగ్విలిప్తరుచిసాంద్రయశశ్శరదిందుచంద్రికా
ధాముఁడు సర్వలోకభవతారక నాముఁడునన్నుబ్రోవుతన్.

సీ. పెసరకాయలఁబోలు మిసిమికెంజడలు శృం
గారమై ఫాలభాగమున దూఁగ
వెలిదమ్మితళుకురేకులఁ బోలుకనుదోయి
కడల కారుణ్యశీకరము లొలయ

సంతతాంతర్లక్ష్యసంధానసుఖకళా
మోఘ మై శాంభవీముద్ర యొప్ప
శుద్ధసాత్త్వికగుణ స్ఫురణవేల్లోచిన
గతి శుభ్రభసితాంగ కాంతి వెలుఁగ
తే. గరిమ భక్తులరక్షించువెరవు లరసి
పడిలపరచిన నిజమనోభావమలర
నట్టి వీరాసనాసీనుఁ డగుచు నాదు
హృష్ణమునఁ దోఁచుమద్గురుస్వామిఁ దలఁతు. 6
క. ఘనసంసారాబ్ధినిమ
గ్నుని నను వెసలంగఁ దిగిచి గురుబోధకు పా
వనపక్షుఁ జేసి తత్త్వ
జ్ఞునిగా నొనరించు చెంచు శుభగురు దలఁతున్. 7
చ. సరసిరుహాసనుంబొగడి శార్జ్ఞశరాసను సన్నుతించి శం
కరుఁ గొనియాడి వాక్సతికిగౌరవమొప్పఁగ మ్రొక్కిభార్గవి
న్నరమర లేక నెంచి తుహినాద్రిసుతన్భజియించిమత్తసిం
ధురముఖుఁ గొల్చి వారికృప నూతనసత్కృతి నేరచించెదన్.
సీ. వాల్మీకి వినుతించి వ్యాసుల వర్ణించి
కాళిదాసమయూరఘనులఁ బొగడి
భవభూతి శివభద్రుఁ బాణులఁ గీర్తించి
దండి భారవులఁ జిత్తమున నిలిపి
మహిని బిల్హణ మాఘు మల్హణుఁ గొనియాడి
కలిగిన గీర్వాణకవులఁ దలఁచి
నన్నయభట్టు శ్రీనాథు తిక్కనసోమ
యాజి బమ్మెరపోతనార్య సోము

తే. భాస్కరుని రంగనాథులఁ బ్రస్తుతించి
భావికవులకుఁ బ్రియములు పలికి ప్రీతి
నాంధ్రకవితాచమత్కృతి నాగమాంత
సరణిఁ గృతిసేయఁదలఁచితి సభికులెంచ. 9

మ. అవివేకానుగతప్రభావముల మిథ్యాభిజ్ఞులై మించి స
త్కవులర్థిన్ సమకూర్చుసత్కృతుల సార్థంబు న్నిరర్థంబుగా
వివరింపం దొరకొంద్రు హీనమతులై వెయ్యేల వీక్షింపఁగా
కవులీచందముగాక యున్న సుకవుల్ గారే మహీమండలిన్.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును శ్రీగురుసమారాధనంబును బురాతనసత్కవిజనసన్మానంబును గుకవినిరసనంబునుం గావించి సమంచితభవాబ్ధితరణంబులైన వేదాంతప్రకరణంబులు సదానందసాంద్రుం డగుముకుందమునీంద్రుండు నాంధ్రభాషను రచియించిన వచనకావ్యంబైన వివేకసింధువు నిరవద్యగద్యపద్యాత్మకంబుగాఁ బ్రబంధంబుఁ జేయ సమకట్టితి నా మనంబున. 11

మ. వినుతింపం భవరోగవైద్య మగునీవేదాంతశాస్త్రంబు పా
వనమైయుండఁ బ్రవీణతన్ వచనకావ్యం బొప్పఁగాఁ జేసి స
జ్జనులం బ్రోచిన పుణ్యమూర్తి విమలస్వాంతుండు విజ్ఞానశా
సనుఁడైనట్టిముకుందమౌనికి నమస్కారంబుగావించెదన్.

షష్ఠ్యంతములు.

క. శ్రీమన్ముక్తివధూహృ
త్కామున కధ్యాత్మయోగఘటనాఘటనో
ద్దామునకు కోటిభాస్కర
ధామునకున్ మేచకాంబుదశ్యామునకున్. 13

క. సూరిజనోదారమనో
సారమనోహరసరోజపట్స్ఫురణునకున్
చారుదమాపూరశమా
చారసమాధానచిత్తసంచరణునకున్. 14

క. కర్బురధాతుస్ఫురితాం
తర్బహిరంగప్రకాండతారామయునకున్
నిర్బిందుకళాత్మునకున్
కర్బురగర్భాండభాండఘటనాఢ్యునకున్. 15

క. కల్పితసువిచారునకున్
కల్పద్రుసమానదానఘటనాఢ్యునకున్
కల్పాకల్పానల్పవి
రహితునకును నిత్యనిర్వికారాత్మునకున్. 16

క. భావాంతర్గతభావిత
భావబ్రహ్మప్రకాశపరిణామునకున్
భావాభావాతీతశు
భావహామహితప్రభావభవ్యాత్మునకున్. 17

క. వృత్తిజయోద్దామునకున్
సత్తామాత్రావశిష్టసద్భావునకు
న్నుత్తమచారిత్రునకున్
దత్తాత్రేయునకు మౌనిజనహృదయునకున్. 18

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన వివేకసింధు వనుమహా
ప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన. 19

తే. ఘోరసంసారజలధిలోఁ గూడి మునిఁగి
పారమెఱుఁగక వెలవెలఁ బాఱుకొనుచు
నున్న ప్రియశిష్యుఁ డొక్కఁ డాపన్నుఁ డగుచు
వచ్చి కారణగురుపాదవనరుహములు. 5

తే. కాంచి ప్రణమిల్లి కరపుటఘటితనిటలుఁ
డగుచు మెల్లనఁ జేరి యి ట్లనియెఁ బ్రీతి
పరమకరుణాంతరంగ దుర్భవవిభంగ
యార్తజనపోష నిత్యసంయమమనీష. 6

వ. అని వినుతించి మఱియు ని ట్లనియె. 7

ఉ. పారములేని భీకరవిపజ్జలజంతుచయావికీర్ణసం
సారపయోధిలో మునిఁగి చాలభ్రమించెడినన్ను సత్కృపా
పారతరంగితేక్షణదృశం బనునావను నుద్ధరించి వే
తీరముఁ జేర్పవయ్య యను దేశిక దీనశరణ్య మ్రొక్కెదన్. 8

చ. సతులు సుతుల్ పితుల్ దుహితృసంఘము బంధుజనంబు
నర్థసం,చితము పశువ్రజంబును విశిష్టగృహాద్యఖిలైకవస్తు
సం,తతులు నిరర్థకంబు లని తథ్యముగా మది రోసి తావ
కాం,చితపదపంకజాతములు చేరితి ముక్తుని జేసి బ్రోవవే. 9

చ. కడువడి కర్మమార్గమను కాఱడవిన్ బడి విభ్రమించుచున్
జడమతి నింద్రియార్థఫలసంచితతిక్తకషాయసారముల్
దడఁబడఁ గ్రోలి దుర్వ్యసనదాహమునన్ వెగడొంది స్రు
క్కి మీ,యడుగులు గాంచితిన్ నను గృపామృతమానఁగ
నిచ్చి బ్రోవవే. 10

వ. అంత శ్రీగురుండు. 11

చ. జనని కుమారునింగనినచందముదోఁప గురుండు శిష్యునిన్
మనమలరన్ దలంచెజలమధ్యములోఁగమఠంబుపోల్కిఁజూ
చెను దయమీనముల్ వలెను జెన్నుఁగ బక్షిసమానరీతిచే
తను దడవెన్ గరాబ్జముల దగ్గఱఁజేర్చుక నిట్లనెన్ దగన్.

ఉ. కోరి సమస్తకర్మము లకుంఠితవృత్తి నొనర్చిన న్ మహో
దారసుఖావహప్రకటధర్మఫలం బగుముక్తిఁ గల్గదె
వ్వారికిఁగాన మోక్షపదవాంఛ మదిన్ గలదేని సద్గురుం
జేరి చతుర్విధార్చనలు జేసి రహస్యమెఱుంగఁ గాఁదగున్.

క. కావున గురుసేవారతి
గావించి ముముక్షుధర్మకలితాత్ముఁడ వై
ప్రావీణ్యంబున సాత్త్విక
భావమునన్ వేఁడు టది శుభంబగు నీకున్. 14

శా. అన్నా! శిష్యవరేణ్య! చెప్పెదను వేదాంతార్థసారంబు మేల్
విన్నాణంబున వీనులన్వీను మదిన్ వీక్షించినం బంధవి
చ్ఛిన్నంబై తుదిముక్తిఁ జేరుటయ సంసిద్ధంబు శ్రద్ధాసము
త్పన్నప్రాభవమొప్పఁగాఁ దెలియుముద్యచ్ఛేముషీసంపదన్.



మ. విను పూర్వార్థముమున్ను జెప్పెదము భావింపన్విరాడ్రూపవ
ర్తనవిశ్వాకృతిఁబోల్చునీశ్వరు విశుద్ధబ్రహ్మమున్ సద్వివే
కనిరూఢిన్నెరయన్ బ్రపంచరచనాకారంబుగా బుద్ధిలోఁ
గనుటొప్పున్ విశదంబగాథమది సాకారంబుచింతింపఁగన్.

తే. అరయ నీచిక్కు దెంతపర్యంతమునకుఁ
దెలియవచ్చునో యందాక తెలియవశమె
పరమ కేవల నిష్కళబ్రహ్మపదము
గాన విను ముత్తరార్థసంధానపటిమ. 17

వ. అని చెప్పి పూర్వార్థంబు ప్రపంచరచనాకారం బది యెంత పర్యంతంబు దెలియ దంతపర్యంతంబును కేవలబ్రహ్మ సాక్షాత్కారంబు గానేరదింక నుత్తరార్థంబు వినుమని యిట్లనియె. 18

తే. దీని శబ్దార్థమాత్రలోఁ దెలిసిరేని
ఘోరభవరోగతాపనివారణంబు
భూరిబంధవినిర్ముక్తకారణంబు
దారుణాటోపసంసారతారణంబు. 19

వ. ఇది యధ్యాత్మికప్రశ్నోపచారం బగుటం జేసి త్రిపదమహా వాక్యవ్యాఖ్యానంబునందు జీవేశ్వరుల నైక్యంబుఁ జెప్పెద వినుమని యిట్లనియె. 20

క. పదఁపడి తత్పదమని త్వం
పదమని యసిపద మనంగ బరఁగుమహావా
క్యాదిత త్రిపదంబులు నవి
పదములపదసద్వివేకపరణిఁ దెలంగున్. 21

తే. తత్పదార్థంబు పరమాత్మ త్వంపదార్థ
మరయ జీవాత్మ యసిపదం బైక్యమగును
తత్పదార్థంబు త్వంపదార్థంబు రెండు
విధములై యుండుఁ జెప్పెద వినుము యదియు. 22

ఆ. అరయ శబలతత్పదార్థంబు శుద్ధత
త్పదము నీశ్వరునకుఁ బరఁగు వెల్లు
పరవి జీవునకు సుశబలత్వ పదమును
శుద్ధత్వంపదంబు సాక్షి వెల్లు. 23

క. పరఁగ మహాశక్తికి నీ
శ్వరుఁ డధిపతియై చెలంగ వరసృష్ట్యాది
స్థిరభూతావలికెల్లను
బరికింపఁగఁ గర్తయగును బరమాత్ముఁ డిలన్. 24

ఆ. అరయశబల తత్పదార్థమా పరమేశ్వ
రుండు మాయ నొందుగకుండెనేని
నిత్యనిర్వికారనిష్కళబ్రహ్మమై
యనఘ శుద్ధతత్పదార్థ మలరు. 25

క. తాపత్రయసంతప్తుఁడు
రూపతనుత్రయవికారరూఢుఁ డవిద్యా
రోపితకర్మపరీత
వ్యాపారుఁడు శబల త్వంపదార్థము సుమ్మీ! 26

వ. శరీరత్రయంబునకు నతీతుండై యవిద్యాకామకర్మవిముక్తుం
డైనవాఁడు ప్రత్యక్చైతనుం డైనశుద్ధత్వంపదార్థం బని
చెప్పి మఱియు నిట్లనియె. 27

క. క్రమమున శబలము వాచ్యా
ర్థము శుద్ధము లక్షితార్థతాత్పర్యము వే
గమె శబల మనెడిమాలి
న్యము విడచిన శుద్ధలక్షితార్థము నిలుచున్. 28

తే. వరుస నీగతి తత్పదత్వంపదములు
వేగ శోధించి శబలంబు విడిచి శుద్ధ
మలరఁ గైకొని జీవేశ్వరులకు నైక్య
మరయ సిద్ధించు తనుదానె యనఘచరిత. 29

సీ. పాలుపొంద ఘటపటంబులు రెండు నాశన
మైన కేవలనభ మైనయట్లు
రహితశుద్ధ తత్పదార్థమున నైక్యంబైన
కేవలబ్రహ్మమై శివి జెలఁగు
నదియఖండైక్యంబు నారోపణంబు నీ
స్వానుభవంబున సరవిఁ జూడు
మది యఖండాకారమని మహావాక్యంబు
శ్రుతిసమ్మతిని జెప్పు విదితముగను
తే. స్వానుభవమున జూడ నిశ్చయ మఖండ
మగుట యది లెస్స బరికించు మాత్రలోన
నిది మహావాక్యశోధనం బీప్రకార
మెలమి గనుముక్తి కరతలామలకముగను. 30

వ. అని చెప్పి యిట్లనియె. 31

క. మును త్వంపదార్థమే విను
మని జీవుఁ డవిద్యతోడ ననుగతుఁడై యీ
తనువే నేనని యుండును
తను దా నెఱుఁగంగలేక తా జడమతియై. 32

వ. అట్టియధికారం బెఱింగి శ్రీగురుం డిట్లనియె. 33

ఉ. ఓయికుమార! స్థూలతనువు౯ వివరింపఁగ నీవుగావు యీ
కాయ మెఱుంగువాడ వదిగావున నీదగు స్వానుభూతియం
దాయతబుద్ధితోఁ గనుము యతులు వేరు ఘటంబు వేరు నీ
వేయెడ నాఘటంబగుదు వీవు గనుంగొను మెల్ల వేరగున్. 34

క. అదిగావున స్థూలాంగము
వదలి విలక్షణమునైనవాఁడ ననుచు లో

పదపడి యిది నే గా దని
యడి నీస్వానుభవమందు నరయుము వత్సా! 35

వ. అనిన శిష్యుం డిట్లనియె. 36

ఆ. ఘటము వేరు చూచుకన్నులు వే రని
యానతిస్తి రిందు కాత్మలోన
దెలిసి చెప్పచూడ దృష్టాంతమునకును
వాక్కునకును దెలియవశముగాదు. 37

క. పంబిన దేహవ్యతిరి
క్తంబై వెలుఁగొందు నాత్మ తగఁ గనఁబడ దు
ల్లంబున నది యెటువలెఁ గా
నంబడు వివరించి తెలుపు నాకది యనుఁడున్. 38

వ. అని యడిగిన శ్రీగురుం డిట్లనియె. 39

మ. అదిదృష్టాంతముఖంబునం దెలియదయ్యా! నిన్ను నీవే వివే
కదశన్ వేడ్క నెఱుంగఁగావలయు వీకందారువందగ్ని యు
న్నదియాగావున గానరాదు యదివిన్నాణంబునం దర్చినన్
విదితంబై వెలిదోఁచి గానఁబడియుర్విన్ వ్యాపకంబౌగదా.

క. విను మది యాత్మవిలక్షణ
మనఁగాఁబడె నదియు గాన కాయము దృశ్యం
బును నాత్మలోపలనె యుం
డినదగుటన్ వేరెయగుచు ఠీవిఁజెలంగున్. 41

వ. అది యగుటకుఁ బ్రయాసంబు లేదు మఱియును. 42

క. కాయము షడ్భావవికా
రాయతమై దృశ్యమై లయంబగునిత్యం

బై యాత్మనిర్వికారం
బై యానందస్వరూపమై వెలుఁగొందున్. 43

క. ఇది నిద్రాకాలం బని
యిది మరణావసరమనుచు నెఱిఁగెడివానిం
బదపడి యాత్మనవచ్చును
యది దెలియుట కెరుక లేని దగు జడ మరయన్. 44

క. వెలయఁగ నిద్రామరణం
బులు రెండును నాత్మయెరుఁగు పూనిస్వయంబో
ధలసత్స్వరూపముల నిం
దులకే దేహాత్మ మని దోసగెఱుఁగవలెన్. 45

తే. పుట్టినప్పుడు పుట్టితి పూని పెరుగు
నపుడు పెరిగితి మరణంబునందు మరణ
మనుచు నేలాగు నెఱుఁగును నరయ దృశ్య
రూపమును ద్రష్టయై యొందు రూఢిగాంచె. 46

తే. ద్రష్టయెన్నఁడు దృశ్యమై తనరియుండ
నిట్టివిభ్రాంతి విడువుము యిచ్చలోన
స్థూలతను వాత్మయని తనుజూచువారు
యెరుక లేనట్టి చార్వాకు లిద్ధచరిత. 47

వ. వారలు కాయకులు నీయుభయమతంబు భ్రాంతి యని
తెలిసిన యుభయమతంబులం గెలిచితి విఁక వినుమని యి
ట్లనియె. 48

శా. కాయంబాత్మ మహీజలాగ్ని మరుదాకాశంబులే తత్త్వముల్
ఛాయాభర్త శశాంకులాదిగను నక్షత్రంబులే వేలుపుల్

వేయున్నేటికి దండనీతియెదఁగఁ విద్యావిలాసంబునీ, చాయ
స్ఫచ్ఛుటమోక్షమందు రెపుడుఁ జార్వాకులూహింపఁగన్.

సీ. అదిగాక వేదశాస్త్రాగమంబులు పద్మ
భవవిష్ణురుద్రులు పాకశాస
నాదిదేవతలు బ్రహ్మస్థాన వైకుంఠ
కైలాసనాకలోకములు నరక
మును జతుర్దశలోకములు మేరువేదుదీ
వులు సముద్రమ్ములు పూర్వకర్మ
సంచయంబులు స్వర్గసౌఖ్యంబునరకదుఃఖ
ఖంబులు మొదలుగాఁ గలుగుశాస్త్ర

తే. జన్యబోధోక్తు లెల్ల నిశ్చయముసేయఁ
దగదు మిథ్యాపవాదముల్ దడవిజూడ
నరయఁ బ్రత్యక్షమే ప్రమాణం బటంచుఁ
బలుకుచుందురు చార్వాకు లెలమి నెపుడు. 50

క. కాన వివేకవిహీనులు
మానక తలపోయు దుష్టమతపాషండా
నూనతరోక్తులు శ్రుతిశా
స్త్రానీకములకు విరోధమై గనుపట్టున్. 51

తే. స్థూలతనువాత్మ యని మదిఁ జూచుచుంద
రట్టిదేహంబు గావలె ననుచు కర్మ
మెవ్వ రైనను జేసిరే యీధరిత్రిఁ
గాన యీస్థూలతనువాత్మ గాదు తలఁప. 52

క. అరయఁగ దేహాంతంబున
వరుసఁ సుఖదుఃఖములును స్వర్గనరకముల్

బరువడి నెవ్వరు భోగిం
తురుగావున తనువు వేరు తూకొని తెలియన్. 53

వ. అట్టి స్థూలదేహం బెటువలె నిర్మాణంబాయె ననిన పంచ
మహాభూతపంచీకృతాంశల నిర్మింపంబడియె నది యె ట్లనిన.

సీ. అకృతాస్థిచర్మమాంసాంత్రరోమంబులు
నవనిలో భూతాంశ లైదునమరు
రమణ మేదోమూత్రరక్తశుక్లస్వేద
ములు నయిదంశ లప్పులను గలుగు
సక్షుద్రుజాలస్యసంగమనిద్రలు
నగ్నిలో భూతాంశ లైదునమరు
నాగి నిరోధభ్రమణోర్ధ్వతిర్యగ్గిసతుల్
మారుతోద్భవము లై మలయు నైదు
తే. కణంగి భీర్మోహములు క్రోధకామలోభ
ములును నాకాశమం దైదు నెలమి నలరు
నిట్టి భూతాంశ లిరువదియేను గలిగి
స్థూల తనువయ్యె నీలోనఁ జూడు మనఘ. 55

తే. పరగ నిట్టి జడస్వరూపంబు నైన
స్థూలదేహంబు సర్వదా చూడ నాత్మ
గాదు యిది నీవు గావు యీఘటము నీవు
గా వట యవస్థజాగ్రతగావు నీవు. 56

చ. మలసి శరీరమందు నభిమానమునన్ వసియించి బాహ్యచం
చలవిషయంబులన్ దొడరిజ్ఞానవ్యాపీకములన్నెరుంగుటల్
సలలితదేహముం దదను జాగ్రదవస్థయు నాది ని ట్లవ

స్థూలకభిమాని విశ్వుఁడివి సర్వము గావని మ్రోయు వేద
ముల్. 57

వ. కావున నిదిమొదలైనవి యాత్మగావని యనంతముఖం
బుల వేదశాస్త్రంబులుఁ బ్రతిపాదించుట సిద్ధంబు. 58

ఆ. సరవి స్థూలతనువు జాగ్రదవస్థవి
శ్వాభిమాని తత్క్రియానుశక్తి
నెరి రజోగుణములు నేత్రంబులును యుక్త
భోగ మిదియు దృశ్యములు దలంప. 59

క. ఇది యాత్మ సర్వదా గా
దవిరళముగ స్థూలదేహ మవలంబన భూ
తవికారసృష్టికిని వి
వివరింపఁగ సాక్షివనుచు వేదాంతములన్. 60

వ. చెప్పుచున్నవని మఱియు నిట్లనియె. 61

చ. అమరిన యేకతత్త్వమని యజ్ఞులకు న్వెలయించి దేహమ
ధ్యమునను నొక్కలక్ష్యము పదంపడి చూపుదురే మెఱుం
గక్, క్రమమున మూఢులై పిదప ఖండవివేకులుగాన
వారినేమముల గ్రహింపఁగాఁ దగదు మాన్య వివేకులకున్
గుణోత్తమా. 62

శా. ఆధారంబు చతుర్దళంబులును వాసాంతంబు భూముద్ర
యుం, మేధాధిరవినాయకున్ రుచిరమౌ మేల్పచ్చయౌ
వర్ణమున్, శోధింపందగు మంత్రపీఠమును నై శోభిల్లు
చక్రంబు దు,ర్బోధన్ జూతురు కొంద ఱాత్మలను సంపూర్ణ
ప్రభావంబునన్. 63

శా. లింగస్థానము షడ్దళంబులును నాలీకాసనుఁ శ్వేతవ
ర్ణాంగంబుఁ జలతత్వముద్రయును బాలాంత్యక్షరాకీర్ణమ
ర్థింగల్యాణవిలాససుందరము స్వాధిష్ఠానచక్రంబు ని [న్.
స్సంగప్రక్రియఁ జూతురాత్మలను నిస్సందేహులై కొందఱు

చ. అలరు దళంబులుఁ బదిడఫాంతములో హితకాంతినాభి
కా, స్థలమును విష్ణుదేవుఁడు కృశానుమయంబగు భూత
ముద్ర నిర్మలమును నైన దివ్యమహిమం బని యామణి
పూరచక్రముఁ, జెలఁగుచుఁ గొందఱు న్మదిని జింతనసేతు
రు నిశ్చలస్థితిన్. 65

మ. హృదయస్థానమనాహతంబున కపర్దిద్వాదశారంబు నిం,
పొదవన్ బచ్చనికాంతి వాయువు మహాభూతంబు సన్ముద్రసు,
ప్రదముఁ జూడకఠాంతముఁ గలిగి శుంభద్దివ్యధామం
బు న్నా,సదవిఁ గొందఱు భక్తితోడుత మదిఁ ధ్యానింతు
రుద్యన్మతిన్. 66

మ. సమతన్ షోడశపత్రముల్ గళము సుస్థానంబు మాణిక్యవ,
ర్ణము వీక్షింపఁగ షోడశస్వరమునున్నాకంబగు న్ముద్ర జీ
వమహారాజ విశుద్ధచక్రమును భావంబందుఁ గీలించి నే,
ర్పమరం గొందఱు సంతతంబు నియతిన్ ధ్యానింతు రాక్కు
మ్మడిన్. 67

మ. ద్విదళంబుఁ గురుమూర్తిహంసములు నర్థిన్ పీతవర్ణంబు
చా, పదముల్ గూడిన ఠావుభ్రూయుగళశుంభన్మధ్యమ
స్థానముఁ, సదసజ్జ్ఞేయము మండలత్రయము నాజ్ఞాచక్ర
ముం గొందఱిం,పొదవన్ ధ్యానము సేతురాత్మలను దర్పో
ద్యుక్తు లై నిచ్చలున్. 68

మ అలఘుస్ఫూర్తిని నీషడబ్జములపై నానంద సంయుక్తమై
వెలుఁగున్నట్టి సహస్రపత్రయుతమై వేవేలు సూర్య
ప్రకాశలతో నేఁబదియక్షరంబులను నెంచఁగా జిత్రవర్ణం
బులఁగా, గలసాహస్రము జూతు రాత్మలను వేడ్కన్ లక్ష్మీర
సద్భక్తితోన్. 69

క. ఈరీతి సప్తచక్రము
లారాధిన్నెమ్మనముల ననిశంబును ని
స్సారవివేకులు ధ్యానము
గోరి యొనర్తురు విచారగుణశూన్యులు నై. 70

వ. అదియునుంగాక కొందఱు బిందువును ధ్యానంబు సేయు
దురు. మఱికొందఱు బిందుదర్శననాసికాగ్రపర్యంతంబు
ధ్యానింతురు. 71

సీ. ఆసనస్థైర్యులై యలరు మూలాధార
మూదిబంధంబుల నలసుషుప్తి
కుండలి మేల్కొల్పి గురుపవనాభ్యాస
పారీణులై గ్రంథి పగలఁజేసి
బ్రహ్మరంధ్రమునకు పవనునిఁ గొంపోయి
యచ్చటఁ గల యనాహతనినాద
మాలకింపుచు ఘనవ్యాకోశచిత్తులై
యంగంబు మఱచి యభ్యాసమునను

తే. మనసు సమరసమై పరమప్రకాశ
మగు స్వయంజ్యోతిఁ గని హృదయానిలముల
గ్రాస మొనరించి యానందకలితు లగుదు
రట్టివారలు పరతత్త్వ మరయలేరు. 72

సీ. మూలబంధోడ్యాణ జాలంధ్రబంధముల్
లాలితేడాపింగళల్ సుషుమ్న
నాడికాత్రయమును వేడుకతోఁ పూర్ణ
గిరి యివి మొదలైన పరమయోగ
పరికరంబుల నొడఁబడి రచించెడువారు
వరుసఖండజ్ఞాను లరసిచూడఁ
బలుత్రికూటాచలభ్రమరణోవాటాదు
లచట గ్రంథిత్రయం బచట మిగుల
తే. నలరు శ్రీహఠమాది నీవరయగావు
లీలతోఁ బాడి తాళియంగాళిబిందు
నాదళి మొదల్ హఠనామయోగ
మార్గముల నెల్ల విడువుము మమతఁగొనక. 73
తే. కోరి రేచకపూరకకుంభకములు
త్రాటక భుజంగకము లాది రచనలెల్లఁ
బరగ నీచేతఁ జేయంగఁబడినవెల్ల
నీవు నేలాగు నగుదువు నెమ్మిచూడ. 74
వ. అదియునుం గాక మంత్రధ్యానానుష్ఠానసమాధియోగం
బులు సకలంబును నీవు గావు. 75
క. వెనుపొంద నీప్రకారం
బున ఖండించకను ముక్తి బొందుమనెడివా
రనయము మూఢులు సకలం
బును ఖండజ్ఞానములును బొరిఁబొరిఁ దలఁపన్. 76
ఆ. అరయ నీవు శబ్దజ్ఞాని వదియు నీవు
గావు దేహంబు సత్యంబు గాదు నిజము

యిందులోపల లయమగు నీవిధములు
నెట్లు సత్యంబు లై నిల్చు నిద్ధచరిత. 77

క. ఇవి సకలము మిథ్య లగు
న్నివి ఖండజ్ఞానములును నివి మనమెఱుఁగు
న్నివి నీవు గావు తెలియఁగ
వివరింపుము నాత్మలోన విమలవిచారా. 78

వ. మనోగోచరదృష్టిగోచరశ్రవణగోచరంబు లైనపదార్థంబు లన్నియు నీవు గా వది గావున సకలదృశ్యపదార్థంబులు విడచి స్వానుభవపరతత్త్వమందు నిలుపు మని యిట్లనియె.

క. పరతత్త్వ మెఱిఁగినను నీ
వరయఁగ ధన్యుఁడవు దేహమాదిప్రపంచ
స్ఫురణలు సతతము విడువుము
బరువడి మిథ్యాస్వరూపభావము లనుచున్. 80

ఉ. కావున ధ్యానలక్షణముఁ గాంచి తలంప వికారకల్పనల్
నీవు స్వయంప్రకాశుఁడవు నేర్పునఁజూడుముయంగకంబుప
డ్భావవికారముం దెలియ పన్నుగ నీవును నిర్వికారతే
జోవిమలస్వరూపుఁడవు సూవెకనుంగొనుమాత్మలోపలన్.

ఆ. రూఢి జాతకర్మరూపనామక్రియా
వర్ణరహిత నిత్యపూర్ణరుచివి
గాన నిన్ను నెటుల కల్పనసేయంగ
వచ్చు ప్రకృతికవలివాఁడ వీవు. 82

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున స్థూలదేహనిరసనమను ప్రథమప్రకరణము.

## ద్వితీయ ప్రకరణము.



ఉ. శ్రీగురుపాదపద్మములు శిష్యశిరోమణి గాంచి మ్రొక్కి యో
భాగవతాగ్రగణ్య నిజభక్తగృహాంగణపారిజాత వి
ద్యాగమమర్మశోధన బుధస్తుత నన్గరుణించి నామనో [న్.
రోగము మాన్పి బ్రోచితిరి రూఢిగృతార్థుఁడనైతి నెంతయు

క. స్థూలశరీరం బనునా
భీలనిబంధనము లెస్స భేదించి ననున్
జాలిఁగ రక్షించితిరా
లోలకృపన్ దీనవత్సలుఁడవై పేర్మిన్. 2

క. తలకొని భార్యలు శృంఖల
ములు శిశువులు చీలకట్లు మొక్కలికాండ్రున్
బలగంబులు సంసారము
బలువిడి చెఱసాలగాదె పరికింపంగన్. 3

వ. కావున సంసారమూలంబగు స్థూలదేహం బను జెఱసాల విడి
పించి సాక్షిస్వరూపునిం జేసి కృతకృత్యునిం గావించి
కరుణాప్రసాదంబువలన రక్షించితి రనిన శిష్యునిం గనుం
గొని శ్రీగురుం డిట్లనియె. 4

ఉ. లింగశరీరవర్ణమున లీనము నైననిజస్వరూపమున్
సంగతిగానరాదు ననిశంబును లేని యహంబుచేత నా
త్మం గర మొప్పు గానఁబడు తథ్యము నా ఘటవజ్వియత్తలం
బుంగడు సర్వదిక్కులకుఁ బోవుచు వచ్చుచు నుండునట్లుగాన్.

ఆ. కాన లింగదేహగత మైనయాత్మను
నెఱుఁగలేక స్వర్గనరకములకు
హేతువగుచు సుఖము లేపారదుఃఖంబు
లనుభవించుచుండు రాత్మలోన. 6

క. జలములలో బింబించిన
జలజాప్తుఁ డభంగభంగచయవశుఁ డై చం
చలమొందునటుల నాత్మం
డలలింగశరీరవర్తుఁ డై నిత్యంబున్. 7

వ. సుఖదుఃఖంబు లనుభవింపుచు లోహయుక్తం బైనవహ్ని
తాడనంబునకు లోనైనయ ట్లాత్మలింగ దేహావర్ణంబున
నుండి జననమరణంబులకు హేతువగుచు శుభాశుభకర్మ
చేష్టితుం డై చౌరాశీతిలక్షయోనులం దిరుగుచుండు లింగ
దేహం బెంతపర్యంతంబు భంగంబుగా దంతపర్యంతంబు
మోక్షంబు లే దని మఱియు ని ట్లనియె. 8

క. ఆలింగదేహవివరము
లోలిం బూర్వార్ధమందు నొప్పుగ నీకుఁ
జాల సవిస్తారముగా
మేలుగఁ జెప్పితిమి గాదె మేథాభరణా. 9

సీ. అదిగాన లింగదేహాతీతమైన నీ
స్వస్వరూపము ప్రకాశమున వెల్గు
ననువొంద సూక్ష్మదేహప్రపంచము మహా
భూతపంచీకృతఖ్యాతి నలరు
వాసనామయము నై భాసిల్లులింగదే
హము నిర్వికల్పకం బగుచు మెరయు

మలయుచు నది ప్రథమస్ఫురణం బని
మును నీకుఁ జెప్పితి మోదమునను

తే. యదియ కాదె యంతఃకర ణని యెఱుంగు
మందుకును సాక్షి వీవగు టరయ నిజము
మొనసి సంకల్పమును వికల్పము నొనర్చు
మనమునకు నాది చైతన్య మొనరనీవు. 10

తే. ఆమనోవృత్తి నీవుగా వరసిచూడ
నిశ్చలస్వస్వరూపంబు నిశ్చయంబు
చేయనేరక దృశ్యమే చేయు నిజము
నట్టిబుద్ధికి సాక్షివీ వనఘచరిత. 11

క. చెలఁగుచు తమమతముల బౌ
ద్ధులు బుద్ధినినాత్మయనుచు దుర్మార్గవచో
కలితులు నై బోధింతురు
తలఁకొని తమశిష్యులకు ముదం బలరారన్. 12

తే. అట్టిబుద్ధికి సాక్షి వీవైతి విప్పు
డాత్మ గెలిచితి వింక నీకలవి లేదు
కేవలబ్రహ్మచైతన్య మీవుగావె
యనుచు బోధించి మఱియు ని ట్లనియెఁ బ్రీతి. 13

క. నెట్టుకొని యనుభవించిన
యట్టిపదార్థములయందు ననుసంధానం
బుట్టిపడఁ జేయ నది విను
గట్టిగ చిత్తంబుగాదె గణుతింపంగన్. 14

వ. అట్టి చిత్తంబునకు నీవే యాత్మస్వరూపుఁడ వని మఱియు
ని ట్లనియె. 15

చ. తనువున నాయహంబెపుడు దా ననుచున్న దురాభిమా
నవ, ర్తనముల కెల్ల సాక్షివి తిరంబుగ నే సుఖదుఃఖినే
నటం, చును నహముం జనించి యిరవొందుచు నాత్మస
మీపవ ర్తియై, గనుపడు నాయహంబునకు కారణమీవు
నెఱుంగు మింతయున్. 16

తే. అరయగా నిట్టి లింగదేహస్వభావ
మునకు నీవుఁ బ్ర కాశమై మొనసి యుందు
వది వినాశన హేతు వై నట్టికాల
మెఱుఁగువాఁడవు నీవని యెఱుఁగు మిపుడు. 17

వ. పుష్పంబులలోన బరిమళంబు లుండియు నవి వేత్రై నయ
టుల నహంకారంబునకు సాక్షిస్వరూపం బై నచై తన్యంబు
వేఱని యెఱుంగుము. 18

తే. ఆయహంకారమే యాత్మ యనుచు చాల
నెలమి మన్నించువారల నేమి జెప్ప
నట్టివార లనేకసిద్ధాంతులరయ
కాన సాక్షివి నాయహంకారమునకు. 19

వ. అది యెఱుంగువాఁడ వీవుగదా లోకంబున నెవ్వారైన నహం
కారంబున నుండినవారలకు నాత్మప్రకాశింపఁ దనుట
సిద్ధంబు. 20

ఉ. ఆరయ దృశ్యరూపమగునట్టిపదార్థము ద్రష్టరూపునన్
వారకఁ జూప వేదమ్ప్రవ ర్తిలు చి త్తమనోసుధీయహం
కారము లాదినాల్గిఁటికి కారణమొప్పఁగ ద్రష్టరూపమై
కూరిమి సాక్షి వౌట నిదిగో యని నీవు నెఱుంగుదింతయున్.

వ. ఇట్లంతఃకరణచతుష్టయనిరసనం బొనరించి ప్రాణపంచకనిర
సనక్రమంబు వినుమని యిట్లనియె. 22

క. తనువునకుఁ బ్రాణమే జీ
వనమై పొందు తనువు వరలెడిసమయం
బున వీడిపోవు ప్రాణ
మ్మనయము నిట్లగుట బ్రాణమాత్మ నరు బుధుల్. 23

మ. మమతం బ్రాణము నాత్మటంచుమదిలో మన్నించు వారెం
తమూఢమతుల్ బ్రాణము దృశ్య మీవెపుడు ద్రష్ట
స్వామి వీయాత్మ ప్రాణమటంచున్ హాఠమందుఁ జెప్పఁ
దుదు నెన్నన్ రాజయోగీంద్రు లాక్రమముం జూచి విచా
రమందుదురు వేడ్కన్ జూడు చిత్తంబునన్. 24

తే. ప్రాణమే యాత్మయైన నిద్రావసరము
నందు చోరులు పైఁబడి యఖిలభూష
ణములు గొంపోవ నేల ప్రాణం బెఱుంగఁ
జాల కూరకయుండు నిశ్చయము జెపుమ. 25

చ. సతతము ప్రాణవాయువులు జాగ్రతయందును స్వప్నమం
దును, న్నతినితలారు లై తిరిగిన న్దముదా వెలుఁగొంద నేర
వా, తలవిపు లేంద్రియార్థ సహితంబగుచున్ దనరారుచు
న్ననీ, త్రితయము నౌ నవస్థలను ద్రిమ్మరుచుండును నిల్వ
కెప్పుడున్. 26

క. పూని యిడాపింగళికముల
లోనను విహరించుచుండి లోలత నిందు
న్నానని యెన్నఁడు జెప్పెను
గాన యడియు తమ్మఁ డాము కనలే వరయన్.. 27

వ. కావున బ్రాణం బాత్మ యనగూడదు. 28

చ. సమకొని ప్రాణముల్ హృదయసంగతి నుండునపానముర్
గుద,స్థమును నుదానముర్ గళయుతంబు సమానము నాభి
నుండు వ్యా,నము సకలాంగకంబుల ననారతము న్వసియిం
చు నైదుప్రా, ణములకు నాత్మవే రగుచు నవ్వవికాసత
వెల్గునెప్పుడున్. 29

క. తాన నవస్థాత్రయసం
థానమునకు ప్రాణపవనదశకంబునకున్
మానుగ సాక్షివి యగుటను
ప్రాణంబులు నీవు గావు భావింపు మదిన్. 30

వ. అని ప్రాణనిరసనంబు గావించి యింద్రియనిరసనక్రమంబు
విను మని యి ట్లనియె. 31

క. నయమొప్పఁగ శ్రోత్రత్వ
గ్నయనరసననాసికములనన్ యింద్రియసం
చయమగు తద్విషయము లా
రయ శబ్దస్పర్శరూపరసగంధంబుల్. 32

వ. ఇవి నీవు గా వనుట యె ట్లంటేని. 33

మ. తెలియన్ శబ్దగుణోన్ముఖస్ఫురణజ్ఞాతృత్వప్రవృత్త్యైగుణం
బలరన్ శ్రోత్రహృషీకమున్నెఱుఁగఁ దృశ్యంబాహృషీకంబు
వెం, పొలయన్ ద్రష్టవు నీవు నింతటికి నేర్పొప్పన్ విచా
రించినన్, దలఁపన్ సాక్షివిగావె నీవు నివి సిద్ధం బాత్మలోఁ
జూడుమీ. 34.

మ. చెలఁగున్ స్పర్శగుణోన్ముఖస్ఫురణ వీక్షింపన్ మనోవృత్తి
ని, చ్చలు తద్వృత్తి త్వగింద్రియం బెఱుఁగు దృశ్యం బా

హృషీకంబు కేవలముగ ద్రష్టవు నీవు యిట్లగుట భావం
బందు తర్కింపుమా, వెలయ నీవది గావు నిశ్చయము
నీవె చూడు చిత్తంబునన్. 35

చ. పరువడి బుద్ధివృత్తియును పన్నుగ జూడఁగ నిశ్వయోన్ముఖ
స్ఫురణ తదీయవృత్తి తలపోయ నెంఱుగును చక్షురింద్రి
యం, బరుదుగ దృశ్యమే యగును నారయ ద్రష్టవు నీవు
గాన యీ, వెరవున లోఁ గనుంగొనుము వేయును నేటికి
నిశ్చలస్థితిన్. 36

చ. వితతరసోన్ముఖస్ఫురణ వేమరుజూడఁగ చిత్తవృత్తి త, ద్గతి
రసనేంద్రియం బెఱుఁగు గల్గినషడ్రసముల్ తదింద్రియం
బతిశయ మొప్ప దృశ్యము నయంబునజూడఁగ ద్రష్టవీవు నీ
వతులితసాక్షివౌట విమలాత్మక నీ వదిగావు జూడఁగన్.

ఉ. గంధగుణోన్ముఖస్ఫురణ ఘ్రాణమెఱుంగు న హమ్మనేటిసం
బంధము వృత్తితద్విషయభావము దృశ్యము నీవు ద్రష్టవీ
బంధుర నాసికేంద్రియవిభాసితవృత్తులకెల్ల సాక్షి యో
సింధుగభీర నీ వది వచింపఁగఁ గావు తలంచిచూడఁగన్.38

క. కావున నీపంచేంద్రియ
భావంబులు విషయములును పరికింపంగా
నీ వది గావందులకును
భావింపఁగ సాక్షి వీవు భవ్యచరిత్రా. 39

వ. నీవు నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య పరమానందస్వరూ
పుండవు నీవెఱుంగుము. 40

క. తలకొని కర్మేంద్రియవృ
త్తులు విశదముగాఁగ నీకు తూఁకొని చెప్పెద

గలయంత జెప్పెదను ని
ర్మలచి త్తుఁడ వగుచు వినుము మహితవిచారా. 41

క. ధ్వనివాగింద్రియమున బలు
కును నది జ్ఞాతృత్వవృత్తి గొనకొని నీవుఁ
విను వాగాతీతుండవు
యనయము నది నీవుగావు యార్యస్తుత్యా. 42

వ. కావున క్రియారహితుండ వైన యాత్మస్వరూపుండవు ఆవాగింద్రియంబునకుం గల ఆదివరిషడ్విచారపశ్యంతులు మాత్రుకాక్షరద్వయ మధ్యమతాలోష్ఠజిహ్వా మొదలగు వైఖరులు నీవు గావు యావైఖరీసమేతం బైనచతుర్విధ వాక్యంబులు నీవు గావు జ్ఞాతృత్వవృత్తివల్లను నాదరూపం బైనసకలవాక్యంబులు జనియించి మనంబునకు నాదరూపం బైనయాధారంబుచేతను ధ్వనిరూపంబుననుండి పశ్యంతి స్ఫురించును.అది నిర్వహించెడివాఁడవు నీవు గావు జీవాత్మకు ప్రథమస్ఫురణ వే రని మునుపు నీకుఁ జెప్పితిమి. ఆపరావాక్యం బంతఃకరణం బని యెఱుంగుము.ఈచతుర్విధవాక్యంబులకు ప్రకాశం బైయుండువాటి కతీతుం డైయున్నవాఁడవు నీవే నని మఱియు నిట్లనియె. 43

తే. ఘనమనోవృత్తి యంకురంబున వసించి
స్పర్శతోఁ గూడి విహరించు పాణివిషయ
మునకు సాక్షివి యెఱఁగెడిఘనుడ వీవు
గాన నది నీవు గావు విజ్ఞానధుర్య. 44

క. అనువొంద బుద్ధినిశ్చయ
మున పాదేంద్రియము చలనముఁ గొని నడుచుఁ

విను మయ్యింద్రియమును గా
వను వొందఁగ ద్రష్ట నీవు యవిదృశ్య మగున్. 45

క. ఆరూఢ చిత్తవృత్తివి
కారంబున గుహ్యవిషయగతి సురతవ్యా
పారం బది దృశ్యము నీ
వారయ ద్రష్టవు వికార మది గావు సుమీ. 46

తే. కరము విలసిల్లు నాయహంకారవృత్తి
పాయు రింద్రియ సహితమై మలవిసర్జ
నంబుగావించు నదియు దృశ్యంబు నీవు
గావు ద్రష్టవు సాక్షివి గాన యదియు. 47

వ. కావున నిది మొదలగు పంచవింశత్యంశ లవయవరూపంబై లింగదేహంబు వర్తించునదియు నాభాసరై దృశ్యమై యుండు నీవు ద్రష్టరూపంబైనలింగదేహాతీతుండ వగుటం జేసి యది నీవు గావనుట సిద్ధంబు. 48

క. దక్షత స్వప్నావస్థవి
లక్షణ మెఱిఁగింతు వినుము లాలితమతితో
వీక్షించి యెఱిఁగితేనియు
మోక్షం బగులింగదేహమ్ముఁ వదలితగన్. 49

సీ. వినుము జాగ్రదవస్థ మనము భోగించి త
ద్వాసనల్ మనమున వరుసఁబట్టి
యావాసనాధ్యానమందుల ప్రతిఫలిం
చినది స్వప్నావస్థ యనగఁ బరఁగు
మమతదృష్టిస్వరూపము కన్న విన్న ది
యాసకలధ్యానవాసనలును

యీ రెండు సత్యమై చేరిక గనుపించు
తోఁటివాసన కుండనంటినట్లు
తే. నరయ కర్పూరపూరితం బగుక రాట
మందు కర్పూరమును లేనియపుడు జూడ
నట్టివాసన బరణియం దంటినట్లు
స్వప్న మక్కాలమునకును సత్యమగును. 50

వ. అది యనిర్వాచ్యమని యెఱుంగుము. 51

శా. నిద్రాకాలమునందు బుద్ధి తలపై నేర్పొప్పఁగూర్చున్నని
ర్నిద్రస్వాంతము స్వప్నరూపమయమై నిత్యంబువర్తించునీ
క్షుద్రస్వప్నమనేయవస్థగను సంశుద్ధుండవున్నీవు నీ
భద్రంబై తగులింగదేహము తలంప న్నీవుగా వారయన్.

క. పాలింపఁగ నది దృశ్యం
బాలోలత నీవు ద్రష్ట వదిచూడఁగ నీ
వేలాగయ్యెద వందుకు
లాలితముగ నీవు వేరు లక్షింపు తగన్. 53

ఆ. స్వప్నమునకును సూక్ష్మశరీరమునకు
బూని తైజసాభిమానిభోక్త
గుణము సాత్త్వికంబు గణుతింప నిందుకు
సాక్షి వీవు వేరు సరవిఁజూడ. 54

క. మానుగ నిచ్ఛాశక్తియు
స్థానముగళ మక్షరంబు దగును నుకారం
బౌ నవి స్వేచ్ఛాభోగను
ధీనుత యవి నీవు గావు తెలియుము నాత్మన్ 55

తే. యోగికరతలమునై పరయుక్తమగుచు
భోగ మొసరించుచుండును రాగమలర
పరగ సాత్వికకార్యపంచకమునకును
నరయ సాక్షి వతీతుఁడ వందు కీవు. 56

వ. ప్రసిద్ధంబైనలోహంబున యనలంబు వ్యాపకంబై ప్రకా
శించు విధంబున. 57

సీ. అనఘ శ్రోత్రేంద్రియంబున నుండి శబ్దంబు
వివరించి లెస్సఁగా వినఁగ నేర్చు
నొనర త్వగింద్రియంబుననుండి సంస్పర్శ
మించి లాలించి భోగించనేర్చు
ఘన చక్షురింద్రియంబుననుండి రూపంబు
నొలవక లెస్సఁగా జూడనేర్చు
పూని జిహ్వేంద్రియంబున నుండి షడ్రుచుల్
గురుతెఱుంగుచు జుఱ్ఱుకొనఁగ నేర్చు
తే. నింది ఘ్రాణేంద్రియంబుననుండి ప్రాప్తి
కలితగంధసుగంధముల్ దెలియనేర్చు
సమత నివి నీదుసన్నిధానముననుండు
గాన యవి నీవు గావు సుజ్ఞాని వగుట. 58

సీ. వాగింద్రియంబున వర్తించుచుండి సు
వ్యక్తంబుగా మాటలాడుటలును
పాణీంద్రియంబున భాసిల్లుచుండియు
నిచ్చుచుఁ బుచ్చుకో నెఱుఁగుటలును
పాదేంద్రియంబునఁ బరిణమించుచునుండి
గమనాగమనములు గాంచుటలును

గుహ్యేంద్రియంబునఁ గోమరొప్పగానుండి
మించిన సుఖ మనుభవించుటలును
తే. పాయురింద్రియమున నెడబాయకుండి
చెలఁగి మలవిసర్జనంబు సేయుటలును
నిన్నియును నీసన్నిధి నెలమినుండు
గాన యవి నీవు గావు చక్కంగఁజూడు. 59

వ. కావున సకలేంద్రియవ్యాపారంబుల కతీతుండవు కర్తృత్వ
రహితుండవు సర్వసాక్షివగుట యెఱుంగుము. 60

తే. తగ నహంకార మరయ కర్తవ్యమునకుఁ
దనరు చిత్తంబు తదనుసంధానమునకు
బుద్ధినిశ్చయమునకు నాభూరిమనము
తెలియ సంకల్పవికల్పములకు నెలవు. 61

వ. అంతఃకరణప్రథమస్ఫురణకుం దగియుండు నందులకు నీవ
కర్త విదియాత్మసన్నిధి ప్రతిఫలించి కానంబడు నెంతపర్యం
తంబు స్వస్వరూపనిర్ధారణంబు లేదంతపర్యంతంబును యిం
ద్రియవ్యాపారంబునకు శుభాశుభకర్మచేష్టితం బైన
సంసారంబునం దగిలి తంతుకీటన్యాయంబున స్వయంకృత
కర్మంబులం గట్టువడి సంసారి నని యారోపణంబు జేసుకొని
ద్రష్టరూపంబుననుండియు నిన్ను నీవెఱుంగకుండితి వని
మఱియు ని ట్లనియె. 62

క. తనరిన దేహద్వయబం
ధనముల నిరసించి తింక తగ మాయావి
ద్యను తెలిసి కంటి విక నీ
వనుమానము లేక గెలిచితయ్య యవిద్యన్. 63

వ. అది యనాదియైన యవిద్య మిథ్యయై పోయె నని నీకుఁ దెలిపితిమికదా తత్కార్యం బై యనిత్యం బైనదాని విచారింపం బనిలేదు స్వప్నంబు లోనం జేసినపాపంబుకుం మేలుకొన్న వెనుక ప్రాయశ్చిత్తంబు సేయం బనిలేనిభంగి నీదేహద్వయంబునం జేసినసత్కర్మంబులు లక్షణంబున దత్సాక్షియైనమాత్రంబున భస్మంబై పోవు గావున. 64

క. అగణితమతి విస్తారం
బగులింగశరీరభంగమాయను దగ నీ
కాగి స్వర్గనరకములకును
దగులుడిగెను దూరమాయెఁ దత్తద్గతులున్. 65

సీ. అరయనాభాసమౌ నాశరీరద్వయం
బునకు సతీతుండ వనఁగఁ బరఁగి
ఘనశుభాశుభకర్మమునకు దృశ్యమునకు
సాక్షివిలక్షణస్వానుభవము
విలసిల్లు నేకాంగ వీరుండ వీవని
దెలిపి యీగతి లింగదేహ మెవరు
నిరసింతు రట్టివారరిమురి గర్భవా
సనలెల్ల ఖండించి సంభ్రమంబు

తే. నొంది యాత్మస్వరూప మై యురుతరప్ర
కాశు లై మించి నిత్యసౌఖ్యమున బొదలి
పరఁగ నానందరూపసంభావ్యు లగుచు
నెలమి నుందురు భవభయం బిచ్చఁగొనక. 66

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున సూక్ష్మదేహనిరసనమను ద్వితీయప్రకరణము.



# తృతీయ ప్రకరణము.

---

క. రావోయి శిష్యరాయా
నీవు శరీరద్వయంబు నెరిగావు మదిన్
భావింపుము తత్తనువుల
కీవెప్పుడు సాక్షి వగుట నెల్లవిధములన్. 1

క. మానుగ తత్సంబంధం
బైనట్టి నిరస్తసౌఖ్య మగువిపరీత
జ్ఞానంబు నీవు గావని
మానుగ బోధించి పిదప మఱి యిట్లనియెన్. 2

చ. అలరు తనుద్వయంబుఁ గని యాతనువు న్మరి నే నటంచు ని
చ్చలు నిను నీవెఱుంగక విచారము సేయక నుండితిట్లు ను
త్తలమున లోపలం గలుగుదబ్బర తెల్విని గెల్చి తింక న
వ్వలగల తత్కృతంబులగువాటిని గెల్వవలెన్ వివేకతన్.

వ. అవి యెయ్యవి యనిన. 4

క. అలరఁగ నిచ్ఛాద్వేషం
బులు సుఖదుఃఖములు మరియు బుద్ధిప్రయత్నం
బులు పుణ్యపాపములు నటు
తొలుత పరిష్కార మనఁగ తొమ్మిదిగుణముల్. 5

వ. ఈగుణంబుల నెఱింగి నిరసించవలయు నని యిట్లనియె. 6

క. ఇది భవగుణనాశము మో
క్షద మని పలుకును విశేషికస్ఫుటమతియం

దీని తనయజ్ఞానము నన
యది యెఱుఁగు డనంగు గల్గు నపరోక్షంబున్. 7

క. నయమున నాత్మకు దేహ
ద్వయసంబంధంబునకును దగ నజ్ఞాన
క్రియ మూలకారణం బది
జయమునసే గాని మోక్ష సంగతి గలదే. 8

వ. అంతఃపర్యంతం బజ్ఞానంబు నివృత్తిగానేరదు గావున సంసారంబు నాశంబునొందక విపరీతజ్ఞానాంతరంబులు జనియించు నాత్మగతం బైనయజ్ఞానంబు స్వస్వరూపజ్ఞానంబునం గాని నాశంబునొందదు, అజ్ఞానం బెటువలెఁ గనుంగొనంగ నగునని యొక్క ప్రసంగంబు వినుము. 9

మ. నిను నే నొక్కటి వేఁడెదన్ దెలుపుమా నీవీశరీరద్వయం
బునకున్ నిత్యవిలక్షణుండ వగుటన్ బుద్ధిన్విలోకించి చ
య్యన నిన్నున్నరి నీవ నెవ్వఁడవు తదీయస్థూలసూక్ష్మప్రవ
ర్తనమారూపమెఱుంగువాఁడవుచు నీవేగదా జూడఁగన్.

వ. అనిన శిష్యుండు డోలాయమానమానసుండై యిట్లనియె.

క. అనయము నీదేహద్వయ
మునకు విలక్షణమనైన బోధాత్ముఁడ నే
కనుఁగొన నెవ్వండను నని
మొనయు పృథివ్యాదిభూతములు గావరయన్. 12

క. అలరిన యాభూతంబులు
వెలయఁగ నీభూతపంచవింశతియంశల్
నలియగదె విదృశ్యంబులు
వలద్రష్టను నేనుగాన నవిజూడంగన్. 13

క. విదితంబుగ వీక్షించిన
బొదలిన సూక్ష్మప్రపంచభూతసమూహం
బిది లింగదేహకృత్యం
బిది దృశ్యము ద్రష్ట నేను యదిగాను సుమీ. 14

క. వెనుపొందఁ బ్రాణపంచక
మును తద్విషయములు దృశ్యములు నే ద్రష్టన్
గనుఁగొనఁగ నవియు నేగా
ననయము నవి నాకు లేవు నాత్మన్ దెలియన్. 15

క. జ్ఞానేంద్రియపంచకమును
మానుగ కర్మేంద్రియములు మఱి దృశ్యములున్
నే నరయఁగ ద్రష్టను నవి
గాను వివేకమున దెలియఁగా నెల్లపుడున్. 16

క. పెనగొన నంతఃకరణం
బును దృశ్యము ద్రష్ట నేను బోరి పరికింపన్
వినుతింప దాని కిప్పుడు
మొనయఁగనె ప్రకాశరూపముగ వీక్షింతున్. 17

సీ. రూపింపఁగా మనోవ్యాపారమును బుద్ధి
నిర్ధారణంబును నెరయఁ జిత్త
మును విచారము నహమ్ముననహంకారంబు
వృత్తులై వెలయు సద్వృత్తిఁజూడ
నవి నేను గాను నే నవి యొఱింగెడివాఁడ
నవిదృశ్యములు ద్రష్ట నెలమి నేను
ధృతిభిన్నమహా స్థూలదేహసాకారంబు
లీల నాభాసమహా లింగదేహ

తే. మీా శరీరద్వయంబును నెఱుఁగువాఁడ
నేను యవి నేను గా నింక దీనఁగల్గు
యన్యథా జ్ఞానమును మిథ్యయై నటించు
జ్ఞానమును గాను సాకారమేనుగాను. 18

వ. ఆభాసమునుంగాను. ఈ దేహద్వయంబునకు సాక్షిని దే
హద్వయాతీతుండను. ఇటువంటివాఁడను నేనెవ్వండనో
యని యీప్రకారంబు తనలోఁ దాను విచారంబుచేసు
కొని యనంతరం బా శ్రీగురుపాదపద్మంబులకు నమస్కా
రంబుచేసి స్వామిా నన్ను నేనెఱుంగకుంటిని నన్ను
నాకుఁ జూపవలయు నీసకలంబును నేనెఱుంగుదును నన్ను
నేనెఱుంగ నది నాకుఁ దెలుపు మనిన శ్రీగురుం డిట్లనియె.

క. రావోయి వత్స యీతను
భావంబులు రెండు నీదు భావములోనన్
వావిరి యెఱుఁగుదు వటువలె
నీ వీ యజ్ఞానమెడలనేరవు తెలివిన్. 20

వ. అది గావున నీవెఱింగియు నెఱుంగ ననుచున్నాఁడవు. 21

క. ప్రోదిగ నజ్ఞానమునకు
నీదేహద్వయగుణంబు లీగతి సుమ్మీా
పాదుగ నజ్ఞానము తల
మీాదన్ మోసుకొనియున్న మేటివి పుత్రా. 22

తే. లేని యజ్ఞానమున నిన్ను పూని నీవు
ఎఱిఁగి యెఱుఁగక యజ్ఞాని నేనటంచుఁ
బలుకుచున్నాఁడ వజ్ఞాన భ్రాంతికరయు
నీ వధిష్ఠానకర్తవు నెమ్మిచూడ. 23

ఉ. కావున నిందుకీవరయగమ్యుఁడ వీ వది నీకులేదు స
ద్భావమున న్నెఱింగి కొను పన్నుగ నీవు స్వయంప్రకాశ స
ద్భావుఁడ వాయవిద్యకు పదంపడికర్తవు దోఁచునయ్యెడ
న్నావృతమైనభ్రాంతికిని యాశ్రయమైదగువాఁడవీవొగిన్.

చ. అరయ నచేతనం బనుచు నల్లన దీని నెఱుంగువాఁడ వీ
వరుదుగ త్రాడుపాముసకు నాశ్రయమై నదిమిథ్యయైనపా
మురువడితాటికాశ్రయము నొప్పదు గాన నసత్యరూపమై
బరఁగు నవిద్య సత్యమనబట్టి నిజంబని తోఁచు నంతయున్.

చ. అనయము నన్ను నేనెఱుఁగనంచు ననేది యవిద్యయాగదా
తనరి జడస్వరూప మగుదానిని బద్ధి యనంగ రాదుగా
విను మటుగావునం దెలియ విస్ఫుటమైన నిజస్వరూపమం
దనుపమమౌ యవిద్యయు నహర్నిశముఁ దగ నాశ్ర
యించెడిన్. 26

సీ. సమకొని స్థూలసూక్ష్మప్రపంచం బెల్ల
నిరసించి ద్రష్టవై నెగడుచున్న
నిన్ను నీవు నెఱుంగ నేర ననేదేమి
నీవు వర్ణవ్యక్తభావరహిత
మైన నిరాలంబ మదిచూచి భ్రమసితి
వారూఢి సకలవికారములకు
ననయంబు నీవు వేత్తైనవాఁడవు నీవు
లేని యజ్ఞానంబు పూనికలుపు
తే. కొన్నవాఁడవు నగుచు నే నన్ను నెఱుఁగ
ననెడి యజ్ఞాన మెఱుఁగుదు వనఘ నీవు

యిట్టి దాని నెఱింగి నేనెఱుఁగననెడి
వాఁడు యెవ్వఁడు చెప్పుమా వేడుకలర. 27

సీ. జలములోపల నాచు జనియించి పిమ్మట
జలములపైఁ గప్పి బలసినట్లు
పరఁగ నీస్వస్వరూపమునకు లేని య
జ్ఞానంబు గప్పియున్నది తలంప
స్థూలసూక్ష్మములు నందులగల్గు నన్యథా
జ్ఞానంబు విపరీత మైనయట్టి
జ్ఞానంబులును దీని జఠరంబునందుల
జనియించుఁగాన నజ్ఞానమరయ
తే. దీనికారణతను వని తెలియఁబడెను
గాన నజ్ఞాన మనియెడి కారణాంగ
మీవు గా విట్టి తనువు నీ కెటులనున్న
దటుల సాక్షివి యజ్ఞానపటలమునకు. 28

వ. సాక్షివై తనువ్యుండవు పరమాత్మస్వరూపుండవు గాన నన్ను
నెఱుంగననుట సార్థకంబుగా దది పరిహరించి యాయె
ఱుకయె నీవై యెఱుఁగననుటయె యజ్ఞానం బది మిథ్యా
రూపం బని తెలిసి విడిచిపెట్టుమని మఱియు నిట్లనియె. 29

క. ఎఱుకే జ్ఞానం బెప్పటి
కరయంగా మఱచు నదియె యజ్ఞానమగుఁగా
గురి యైనజ్ఞానదేహం
బిరవుగ నీవగుచు నుండు మిద్ధచరిత్రా 30

వ. వ్యర్థం బైనయజ్ఞానం బనునలంకారంబున జోడుదోడుగు కున్నాఁడవు. అదియునుంగాక, యజ్ఞానప్రసంగం బైన యన్యథాజ్ఞానంబును విపరీతజ్ఞానంబును ననువీఁటిచేత కార్యం బైనస్థూలసూక్ష్మంబు లైనదేహద్వయంబును ఇవి మిథ్యారూపం బని యెఱుంగుము. ఈకారణదేహంబును నజ్ఞానంబును సుషుప్త్యవస్థయు నివి మొదలుగాగలవాట్ల నెఱుఁగువాఁడవు నీ వని చెప్పి సుషుప్తిలక్షణంబులు వివరించెద నని యిట్లనియె. 31

సీ. మొనసి జాగ్రత్స్వప్నములుగల యీ రెండు
తనువులలో నవస్థలను బొంది
యనయంబు నింద్రియవ్యాపారములచేత
నలసిన మనము తా నైనజీవుఁ
డజ్ఞానమున మగ్నమైనను సకలేంద్రి
యములు సంహారమై యణఁగెనేని
యది సుషుప్త్యనజను నాదశేంద్రియములు
నంతఃకరణచతుష్టాహ్వయములు
తే. నన్య మగుతెల్వి విపరీత మైన తెల్వి
యన్నియును గూడ నజ్ఞానమందు లీన
మైన యదియె సుషుప్తియు నై చెలంగు
నాసుషుప్తి యెఱుంగువాఁ డరయ నీవు. 32

ఉ. పూనిన మూఁడవస్థలకు బుద్ధికినిం దఁగఁజూడ బీజమై చొప్పె
నెఱికారణాంగము సుషుప్తి యవస్థయు రెంటికారయన్,

మానుగ చూడ ప్రాజ్ఞుఁడభిమానియు నిన్ని యెఱుంగువాఁ డవుగ, ధీనుత నీవు నిన్నిఁటికి తెల్విగ సాక్షివి చూడు మేర్పడన్. 33

తే. అందు హృదయంబు స్థాన మానందభోగ
మీగుణంబులు దెలియ తమోగుణములు
గాన యవి నీవు సర్వథాగావు జూడు
మెన్ని విధముల నైనను నెలమితోడ. 34

వ. ఈస్థూలసూక్ష్మకారణదేహంబులను తనుత్రయంబును జాగ్రత్స్వప్నసుషుప్తులను నవస్థాత్రయంబును విశ్వతైజసప్రాజ్ఞలను నభిమానత్రయంబును యుక్తపర్యక్తానందంబును భోగత్రయంబును నేత్రకంఠహృదయంబులను స్థానత్రయంబును రాజససాత్త్వికతామసంబు లనుగుణత్రయంబులును క్రియాశక్తి యిచ్ఛాశక్తి జ్ఞానశక్తి యనుశక్తి త్రయంబులును నివి యన్నియు నెఱుంగువాఁడ వీ వని మఱియు గురుం డిట్లనియె. 35

తే. ఈయవిద్యాప్రపంచంబు నెఱుఁగుచుండు
నట్టి యజ్ఞాన మెప్పుడు నీయాశ్రయమున
నిలిచి గుణములతోఁ గూడి నెరిప్రపంచ
రచన గావించుచుండును రమణతోడ. 36

వ. దీని నెఱింగినంగాని జననమరణకారణం బైనసంసృతిదప్పదు ఇప్పుడు యీసకల మలినములును నివారణంబు జేసుకొంటివి నీకు శుద్ధతత్త్వంబు లభించెను గుణత్రయబంధంబు

దెగెను సర్వసాక్షివై సర్వవ్యాపకుండవై సర్వంబు నీవు
గాక నిరాభాసమైన నిర్వికారం బెఱింగితి వని చెప్పి శ్రీ
గురుండు శిష్యునిం గనుంగొని యన్నా ధన్యుండవైతి
వని మన్నించిన శిష్యుం డనుతదనంతరబోధాక్రమం బెఱిం
గింపు మని యడిగిన. 37

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున
కారణదేహనిరసనమను తృతీయ ప్రకరణము.



ఆ శ్వా సాం త ము.

నాగబంధము:—

అలఘుతపోవిశాలభువనావనము క్తిరమావిలాసని
ర్మలజపశీలలోలఘునమానసగమ్యవికాసశేముషీ
కలితవివేకపాలవరగౌరవనిశ్చలవీతరాగకో
మలసుశరీరలాలితక్రమక్రమసత్యకలాపధీనిధీ 38

గిరిబంధము:—

శ్రీ సగుణమూర్తిరుచిరద
యాసదనకటాక్షకేవలాత్మాత్మసుఖ
వ్యాసంగ కణ్వ మైత్రే
యాసితముఖనుతకమలనయన మునితిలకా. 39

మాలినీ:—

సకలవిషయదూరా సాధుచేతోవిహారా
సుకవినుతపవిత్రా శోభితాజాండసూత్రా

ప్రకటరుచివిలాసా బ్రహ్మవిద్యావిలాసా
వికసితగుణశీలా వేదవేదాంతలోలా. 40

గద్య. ఇది శ్రీగురుదత్తాత్రేయకృపాలబ్ధకవితాచిత్ర శ్రీవత్స గోత్ర వేగినాటివంశపారావారనిశాకళత్ర నాగయామాత్య పుత్త్ర సరసగుణధుర్య కొండనార్యప్రణీతం బైన వివేక సింధువను మహాప్రబంధంబునందు స్థూలదేహనిరసనంబును సూక్ష్మదేహనిరసనంబును కారణదేహనిరసనంబునుం గల ప్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

## చతుర్థప్రకరణము.

శ్రీకరమునిజనహృదయ
వశీకరచిన్మయశరీర శివయోగజ్ఞా
నాకరవేదశిఖావి
ద్యాకలితసుధీసహాయ దత్తాత్రేయా! 1

తే. అవధరింపుము సకలశాస్త్రార్థతత్త్వ
వేది యైనట్టి శ్రీగురుం డాదరమున
నిజపదాంబుజసద్భక్తి నివ్వటిల్లు
నట్టి శిష్యునితోడ ని ట్లానతిచ్చె. 2

ఉ. శ్రీరమణీయమూర్తి గురుసింహుఁడు శిష్యునిజూచి యీ
మహా, కారణదేహముం దెలియఁగా వివరించెద సావ
ధానచేతోరసికుండ వై వినుము తుర్యము దాని యవస్థ
ప్రత్యగాత్మారయ కర్త యీవిధము లన్నియు నీకు
నెఱుంగఁజెప్పెదన్. 3

సీ. రావయ్య నీవు నిర్మలనిరాకారని
ర్గుణసాక్షిచైతన్య ఘనుఁడ వగుట
నే పట్ల నీస్వస్వరూపానుసంధాన
మగువృత్తి నీవు గా నరసిచూడ

రూపింప నీస్వస్వరూపానుసంధాన
మదియె మహాకారణాంగ మగును
అందుకు ద్రష్ట వీవంటిమహాకార
ణాంగంబునకును తుర్యం బవస్థ
తే. యలరు నభిమాని ప్రత్యగాత్మనఁగ నిట్లు
గలుగు నీదేహగుణముల క్రమములెల్ల
యెఱిఁగి లెస్సఁగఁ బరికించు మిదియ నీవు
గావు దృశ్యంబు లివి వివేకప్రవీణ. 4

వ. తనుత్రయావస్థాత్రయాభిమానత్రయ గుణత్రయ శక్తి
త్రయ స్థానత్రయ భోగత్రయంబులు మొదలైన యీ
సకలంబునకు సాక్షివై యెఱుంగుము. 5

తే. అరసిచూడంగ నీయవిద్యాగుణప్ర
పంచమునకును సాక్షివై పరమ మగుచు
నుండి తుర్యం బనునవస్థ నొప్పఁగాను
యెఱుఁగుచుండును యది నీవు యెఱుఁగు దెపుడు. 6

వ. కావున నిందు కీలెఱుఁగుట సిద్ధంబు ఈమహాకారణ మహా
దేహంబునకు పంచభూతోత్పత్తి హేతువు లగుసద్యో
జాత వామదేవ అఘోర తత్పురుష ఈశాను లనందగు
పంచబ్రహ్మలు పంచభూతంబులు నివృత్తిప్రతిష్ఠావిద్యా
శాంతిశాంత్యాతీతకళలు పంచవిషయంబులు పరాశక్తి
ఆదిశక్తి జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి క్రియాశక్తు లనుపంచ
శక్తులు ప్రేరేపణంబు లగుపంచప్రాణంబులు పంచాక్షరియే
పంచేంద్రియంబులు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులు పంచ
కర్తలు అంతఃకరణంబులు ఇట్లిరువదేనుతత్త్వంబులుంగూడి

మహాకారణశరీరం బగు నిందు కవస్థతుర్యంబు అభిమాని
ప్రత్యగాత్మ జ్ఞానశక్తికి శుద్ధసత్వగుణంబు మూర్ధ్ని
స్థానంబు ఆనందావభాసభోగంబు ఓంకారంబు మాతృక
పీఠియందులవ్యాపకం బగునాత్మనిర్మలాత్మకూటస్థ చైత
న్యం బగునిందు నోంకారంబుండుటంజేసి యదియె
మూలప్రకృతి ఈపది సంజ్ఞలంగలది మహాకారణదేహం
బగు దీనివిధంబు వినుము. 7

ఉ. సారవివేకులైనబుధసత్తను లెవ్వరు నాత్మలో మహా
కారణదేహము న్వేరవుగాఁ బరికించి తదీయవృత్తివి
స్తారములన్నియుం గడచి స్వానుభవంబున స్వస్వరూపతే
జోరుచిరాత్ములౌదు రదిచూవె కనుంగొను నిశ్చలస్థితిన్. 8

వ. అని చెప్పి శ్రీగురుండు శిష్యునింజూచి యీకారణదేహం
బునకుం గలిగిన తుర్యావస్థ ప్రత్యగాత్మాభిమాని ఇవి నిర
సించిన సకలంబును నిరసనం బగు నది వినుము. 9

క. మాయ యనంగ నవిద్యా
ప్రాయమన ప్రపంచ మనఁగఁ బరఁగును నజ్ఞా
నాయతరూపమునకు పే
ర్లీయన్నిఁటికెల్ల ద్రష్ట వీవు నిజముగాన్. 10

క. కాన ప్రపంచంబును నే
గాను యనిర్వాచ్యమైన ఘననిర్మలని
త్యానూననిష్కళంకం
బైన మహాత్ముఁడనటంచు నరయుము నాత్మన్. 11

సీ. రూపింప నీస్వస్వరూపంబునకు ప్రత్య
గాత్మయా నభిమాని యరసిచూడ

పరంగ నానందావభాసభోగంబును
యలరు మూర్ధ్నిస్థానమందులకును
శుద్ధసత్వగుణంబు సొరిది తుర్యావస్థ
యాదియౌ యీ సమూహ ప్రపంచ
మంతయుఁ దగనవిద్యాస్వరూపం బది
దృశ్యమై కనుపించుఁ దెలిసిచూడ

తే. నీవు ద్రష్టవు యిన్నియు నీవు గావు
సత్యనిత్యస్వయంప్రకాశస్వరూపుఁ
డవు ప్రపంచమునకు పరుండవు నిరంజ
నుఁడవు సాక్షివి గాదె యొక్కఁడవు నీవు. 12

తే. నెరి నిరాకారనిర్గుణ నిర్వికార
మైన యాత్మకు పారమింతైన గలదె
యట్టి తుర్యస్వరూపమై యలరు స్వస్వ
రూపమే నీవు తెలియుము రూఢిగాను. 13

వ. అది శూన్యమే యాత్మ యని ప్రతిపాదించును. 14

క. క్షపణకమతసిద్ధాంతము
నిపుణతతో గెల్చితీవు నీస్వానుభవం
బుపమింప శక్యమే యిది
యపరోక్షస్ఫురణ లెస్స నరయుము వత్సా. 15

తే. తెలిసి యిదియేవిధంబున గెలువఁగంటి
నంటివా విను క్షపణులనాత్మలోన
నన్యథాభోగమనుట శూన్యస్వభావ
మనుచుఁ బలుకుదు రట్టివాక్యములు మిథ్య. 16

వ. అది యెట్లంటేని. 17

సీ. అది యఖండజ్ఞాన మైనరూపము శూన్య
మని పలుకు టెకదా యందువలన
యాత్మ ప్రకాశించు నదిశూన్య మేలాగు
ననవచ్చునయ్యా నం దరయ నేమి
లేనిది శూన్యమా లేదనే వస్తువు
రూఢిచే వస్తువు రూపమగుచు
సార్వకాలము నిత్యసత్యుం డై యుండును
ఆశూన్యమే సత్యమై చెలంగు
తే. నైన యదిశూన్య మనరాదు యందు నేమి
లేనిదే శూన్య మదిగాన లిలంజూడ
శూన్య మదిగాదు యిది యాత్మచూచు వెరవు
తాను తనువెల్ల వెలుంగొందు తథ్య మిదియు. 18

వ. నీస్వానుభవంబున జూడు మని యిట్లనియె. 19

ఉ. తూకొని నీకు నీతనుచతుష్టయముం వివరింతు నీవు నీ
వింక సమస్తదేహముల వెల్పలలోపల వెల్గుచుండి యా
లోకన మాచరింతువు విలోలత జీవుని నాల్గు దేహముల్
శ్రీకరమైన జ్ఞానమయశిష్టము లైననిజస్వరూపులన్. 20

వ. నీవు తుర్యాతీతుండవు శుద్ధచైతన్యస్వరూపకుండవు అప్ర
మేయుండ వైననీవు తత్తనుచతుష్టయం బెలా గయ్యెద
వీయవస్థాచతుష్టయంబు విచారించి యెఱుంగువాఁడ వీ
వని యిట్లనియె. 21

చ. ఎనయ సమస్త జీవులకు నీగతి యంచు నెఱుంగువాఁడ నీ
వనయము నీయెడంగలుగు నాయభిమానము వాలె
యంద రం,దును గల దంచుభోగములు తూకొని నాలుగు

సర్వజీవులం,దును గలవంచు నిశ్చయముతో గనుసాక్షివి
నీవు చూడఁగన్. 22

క. మానుగ నీగతి తత్త్వని
ధానముఁ జేయుటకు నీవె దగసాక్షివి నీ
లోన నివి యెఱిఁగియున్నా
వానెంతయు ద్రష్టవగుచు నార్యస్తుత్యా. 23

చ. సమకొనిస్వప్రకాశమున చాలవెలుంగుదు విట్లు స్థానమా
నములను సర్వదృశ్యము లనారతముఁ భవదీయ నిర్విక
ల్పమున వెలుంగు నాయెఱుకపట్టుననుండి యెఱుంగు
వాఁడవీ, వమరఁగఁ జూచి స్వానుభవమందు నెఱుంగుఁ
మటంచు దెల్పియున్. 24

తే. తన్ను నీగతి సర్వభూతములలోన
వ్యాపకం బైనసకలేంద్రియములకెల్ల
నరయ నీవు నధిష్ఠాన మగుస్వయంప్ర
కాశుఁడవు గాక వేఱొండు గలదె చెప్పుమ. 25

వ. అనిన శిష్యుం డిట్లనియె. 26

సీ. వినుము శ్రీగురునాథ విన్నవించెద నాదు
సందేహమెల్లను సడలఁజేయు
మన్నిటియందున్న యాత్మ యేకమటన్న
మాటకు నెద్ది ప్రమాణ మరయ
సూచింప నితరుల సుఖదుఃఖములు నాకు
నెందుకు నెఱుగరా దెంచిచూడ
సకలదృశ్యములకు సాక్షి నే ననుమాట
యుపమాత్రమే చెల్లు నింతెగాని

తే. నాకు సకలేంద్రియాభిమానమును నాత్మ
యేక మనుమాట చెల్లదు ఎంచిచూడ
క్రమత నితరస్థలముల లక్షణములెల్ల
నెలమి నాకేల యెఱుఁగరాదేమి చెప్పుమ. 27

వ. అనిన శ్రీ గురుం డిట్లనియె. 28

మ. వినుతాత్మా విను మాత్మయొక్కటిసుమీ వెయ్యేలనందు
న్నుపాధినిమిత్తంబున బెక్కుభేదముల నర్థిఁబట్టి యారో
పణంబును ప్రాప్తించును నొక్కటైన గగనంబుఁ బెక్కు
లౌనట్టుగా, గనుపించు న్నటువస్త్రభేదముల వేడ్కఁ
జూడు మిట్లాగదా. 29

మ. వెలుచుఁ సూర్యుఁడొకం డశేషనదివాపీకూపరత్నాకరో
జ్జ్వలకాసారతటాకపూరితపయోవారంబులం దోఁచి పె
క్కులు నూరుల్ గనుపించి తజ్జలచరత్కూలంకషస్ఫూ
ర్తిచం, చలతం బొంది యనేకబింబములు నైజవ్యాఁడు
చంచద్గతిన్. 30

క. ఆముఖ్యమైన సూర్యుఁడు
ప్రేమ న్నిశ్చలుఁడు నై యభిన్నుం డగుచుఁ
వ్యోమస్థానంబున నొకఁ
డై మహనీయప్రకాశుఁ డై వెలుఁగొందున్. 31

క. అతనికి నటచంచలసం
గతిగలిగిన సకలతోయగతబింబము లు
ద్గతిగదలు టదినిమిత్తము
మతిదెలియ నుపాధిధర్మమహిమఁ దలంపన్. 32

క. ఇటువలె మాయావిద్యా
నటనలు నవయవసులక్షణములై జీవ
స్ఫుటభావంబున వివిధో
త్కటవితతారోపణములు గా గనుపించెన్. 33

క. మానుగ కర్మవశంబున
నూనిన సుఖదుఃఖములును నొగి లింగశరీ
రానకు గాక తదీయా
మానోపాధులును నీకు మఱి లేవు సుమీ. 34

వ. అది యారోపణమాత్రమే తలఁప లింగాంగంబు స్థూలాంగకా, స్పదమై నిత్యవిధోచితక్రియలచే సత్కర్మదుష్కర్మముల్, యొదుగఁ మిక్కిలి గూర్చి జీవుఁడు తదీయోపాధిచే దుగఖసౌ,ఖ్యదభావంబుల నొందు స్వర్గనరకవ్యాప్తస్థితిఁ నిచ్చలున్. 35

తే. అదియు నటుగాన దెలియుము నాత్మలోన
నొకరి సుఖదుఃఖములు వేరె నొక్క రనుభ
వించుటయు లేదు తాఁ జేయు విపులకర్మ
వశమునను బంధమోక్షముల్ వరుసఁ బడయు. 36

వ. అని మఱియు ని ట్లనియె. 37

తే. అఖిలభూతాత్మ యొక్కఁడె ట్లౌనటంచు
మఱియు నొకయాత్మనిర్ధార మెఱుఁగ నాకు
నలవి గా నిది యేమని యడిగితీవు
అది యొఱింగింతు వినుము సంశయముఁ దొలఁగ. 38

సీ. తలపులు మరపులు తలపోయచిత్తాను
సంధానములుగాని నరసిఁజూడ

నాత్మసంధానంబు లవి గావు బుద్ధికా
ధీనంబు లాగుణమానసములు
నవి లింగదేహమౌ నని మును నీకును
జెప్పితిగాదె యీజీవులకును
నాత్మభిన్నము దాని కరయకార్యము నైన
లింగదేహంబును నెఱుఁగ లేరు
తే. వేరగుచునుండు స్థూలశరీరములును
ప్రతిశరీరంబులకు గల్గి బహువిధముల
నలరు గావున నీయవస్థాభిధాన
ములును చిత్తానుసంధానమున జరించు. 39
తే. ఎలమి నాచిత్త మెఱుకచే నెఱుఁగుచుండు
నాయుపాధి విచారించు మాత్మలోన
మున్ను జాగ్రదవస్థలో నున్న తెలివి
స్వప్నమున లేని దగుట నిశ్చయముగాదె 40
క. వెలయఁగ జాగ్రత్స్వప్నం
బులలో వర్తించు తెలివి మొనయసుషుప్తిఁ
బెనుపొంద లేదు గావున
నెలమి నితరచిత్తవృత్తి నెఱుఁగఁగ వశమె. 41
క. పనుపడి యథవా యెఱిఁగెద
ననిన విపర్యాసమరయ నది యెఱిఁగినచో
వినుము సకలప్రపంచం
బును గెలుచుట లాదిమహిమలును గలుగుతగన్. 42
వ. అదియునుం గాక భూతభవిష్యద్వర్తమానవేది యగునట్టి
విశేషంబులు చిత్తానుసంధానం బని చెప్పుదు రిది ప్రపంచ

జ్ఞానంబుగాని యిందువలన భవమోచనంబు గానేరదు ఆ చిత్తానుసంధానంబు బహుకాలంబులు జేయనైనగు గాకున్నం గాకపోవును అవ్విధంబుగాదు సకలేంద్రియంబులకుం బ్రకాశించియున్న నిజప్రకాశంబు నీయింద్రియాతీతజ్ఞానంబునను క్రమంబున నెఱుంగుట జ్ఞానంబో గాక యజ్ఞానంబో విచారించుకొనుఁడు ఇది సత్యం బని మఱియు నిట్లనియె. 43

తే. అన్యథాజ్ఞాన మది యని యనెడువారు
జడులు నదిగాన నాత్మ ద్రష్టత్వ మెఱుఁగు
టకు మనశ్శ్రుతు రాద్యనుష్ఠానపటిమ
యచట వలవదు తెలియుము ఆత్మలోన. 44

సీ. గాన వారలకెల్ల జ్ఞానానుసంధాన
మున వస్తుసన్నిధి నెనసియుండి
పనిబూని యాత్మకు భావంబులోనను
క్రమమున నది దిరుగంగవలెను
ననుట యెన్నఁడు లేదు నది యెఱింగితి నన్న
మాట మొదలే లేదు మఱియు వినుము
తనయాత్మ మఱియొకతావున నున్నది
యది చూడవలె నను టరయ లేదు
తే. చెలఁగి సకలంబు నెఱుఁగుట చిత్తవృత్తి
ధర్మ మదిగాన యట్టిచిత్తం బెఱుంగు
పరమసుజ్ఞాన విమలస్వభావమూర్తి
వైన నీవొక్కఁడవె కాని యనఘచరిత. 45

క. మొనసి మహాహంకారం
బును లేకయె సూర్యుఁ డఖిలభూతంబులలో
చనములకు ప్రకాశముచే
యును సకలపదార్థములను నొగి వెలిఁగించున్. 46

క. అటువలె సర్వేంద్రియముల
పటుగతి వెలుఁగొందఁజేయు పరమగురువుచే
నటియించు వారి కెక్కడి
సటలి విహంకారమనుట సరిగాదు సుమీ. 47

వ. కావున తన నిజస్వరూపంబుచేత ప్రకాశింపుచుండును. 48

క. డంబుగ పాషాణము నిక
టంబున నున్నట్టియా జడం బన దగులో
హం బెలాగున మెలఁగును
పంబి యటుల నాత్మవిషయపంక్తుల మెలఁగున్. 49

సీ. వినుతింపఁ దన కెన్నఁడును చంచలము లేదు
ఆత్మ చేష్టించువాఁ డరయ గాఁడు
చేష్టకుండును గాఁడు జేయువాఁడును గాఁడు
వరుసతో జేయించువాఁడుగాఁడు
బోధ్యుండు గాఁడు సుబోధకుండునుగాఁడు
అఖిలేంద్రియాతీతుఁ డనఁగ నొప్పు
దనరనట్టిన సత్తామాత్రమున సర్వ
విషయముల్ జేష్టించు వినుము సత్య
తే. మందుకరయ స్వతంత్ర మింపొంద లేదు
కార్యకారణకర్తృత్వఘటనమునకు

తనకు నిజవ్యాప్తిచేత సంతతము నిజము
కారణంబును నై యుండు ఘనుఁడ వినుము. 50

వ. ప్రకృతిసుఖదుఃఖంబులుఁ బ్రకృతిసంబంధమునకే గాని నీవు సకలోపాధివినిర్ముక్తుండవు కేవలపరతత్త్వచైతన్య స్వరూపుండవు నీకు సుఖదుఃఖంబు లెన్నఁడును లే దయినను సత్తామాత్రంబు లేక యింద్రియంబులు చేష్టింప సమర్థంబులుఁ గావు. 51

తే. పరవి నీమీఁద లేని ద్రష్టత్వ మదియు
తెలియ నారోపణముచేసి దృశ్యరూప
మరయ కనుపించఁగా ద్రష్ట యనఁగ నీకు
నెరయ నారోపణమువచ్చె నిర్మలాత్మ. 52

వ. అదృశ్యరూపం బనెడిముఖంబున నిరసనంబుచేసిన బరమ నిర్వాణం బై నశుద్ధబుద్ధుం డగు. 53

తే. ద్రష్టృదర్శనదృశ్యముల్ దనరమూఁడు
నీవు గావు సత్తామాత్ర నిర్మలుఁడవు
పరమమైన తత్త్వజ్ఞప్తిగురునిరంజ
నస్వరూపుఁడ వగుదువు నయచరిత్ర. 54

సీ. తలపంగ నఖిలయుక్తులును జీవవిచార
మును త్వంపదార్థశోధనమునందు
మిగిలిన పరమార్థ మగుసాక్షిరూపంబు
స్వయమగు నీవు నీపరణిఁజూడు
సమతత్త్వపదము శోధనసేయఁగాను జీ
వత్వంబు నల్లన వదలిపోయె

పరవి నాత్మజ్ఞానసమ్యక్ప్రకాశంబు
ప్రకటమా నపరోక్షభావమునను

తే. మొనసి పాషాణములు నగ్నిముఖమునందు
కరిగి బంగారువడసినక్రమము దోఁసి
సద్గురుస్వామి తత్వ విస్తారమెల్ల
తనర నిరసించి పరమతత్వంబు జూపె. 55

వ. దృశ్యం బనెడి మలినంబు జ్ఞానం బనుపుటంబునం గడిగి ప్రకాశంబైనబంగారం బనువస్తువు గైకొన్నవిధంబున నీస్వస్వరూపంబు గంటివి వివేకం బనుజలంబున ప్రపంచం బనుపంకంబు గడిగి దేహం బనుగవిశనగడఁబెట్టి స్వయం ప్రకాశం బైనయాత్మనుగనుగొంటివి కదళీఫలంబువోలిచి చర్మంబుబారవైచి తత్సారం బనుభవించినచందంబున మాయాకంచుకశరీరంబు పరిహరించి నీస్వస్వరూపం బనుఫలం బనుభవించితి వని చెప్పి మఱియు నిట్లనియె. 56

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమును గురుశిష్యసంవాదమున మహాకారణదేహనిరసనమను చతుర్థప్రకరణము.

—◦—

## పంచమప్రకరణము.

క. విను జీవతనుచతుష్టయ
మును నెఱిఁగించితిమి నీకు ముదమొప్పఁగ నిం
కను నీశతనుచతుష్టయ
మును పంచప్రళయరూపనులు నెఱిఁగింతున్. 1

వ. నీవు సావధానాయత్తచిత్తుండ వై వినుమని యిట్లనియె.

సీ. వలనొప్పనీయుక్తివాదంబునను నెంత
దడవు నీశ్వరుని భేదం బెఱుంగఁ
డంతట వనక విద్యాద్వైతమైన వా
సనలు నాశముగావు సరవిఁజూడ
నవి గాన తత్వదార్థానుశోధనమున
జెప్పెద వినవయ్య యొప్పుగాను
నవి సచ్చిదానందమైన నిర్మలపర
బ్రహ్మసాక్షాత్కారపటిమఁ జేయు
తే. ఘనత జీవాత్మకును భూరితనుచతుష్ట
యంబు నెటువలె గలుగు నెయ్యంబుమీర
నటుల నీశ్వరునకుఁగల వవి హరింపఁ
దగును నాతత్వదార్థశోధనమువలన. 3

మ. అనువొంద న్నీను జెప్పెద న్ఘనత మోహాంకారమం దుద్భ
విం, చిన పంచీకృతభూతపంచకము చేఁ జెల్వొందు చుండు
న్వి రాట్టనఁగా నాతని స్థూలదేహము నజాండాకార మం
చుం దగ, న్మను నేఁ జెప్పితి గా దె తద్విధము నాత్ముం డౌనె
భావింపుమా. 4

తే. అదియుఁ దగదృశ్యరూపంబు నగువికార
మదియు నీశ్వరుఁ డేలాగు నగును జెపుమ
కమలజాండంబు దేహంబు ఘనయవస్థ
సృష్టి యది యాత్మ గాదు చర్చించిచూడ. 5

ఆ. అవికారరూపమైన బ్రహ్మాండంబు
నెఱుఁగువాఁడ వీవు ఇద్ధచరిత

యదియు నేవిధమున నీశ్వరుఁ డగునయ్య
కాఁడు నిజము లెస్సఁ గా తలంచు. 6

క. దేహము బ్రహ్మాండం బగు
నూహింప నవస్థ సృష్టి యొగి బ్రహ్మతదీ
యాహంకృతాభిమాని స
మూహము లివి యాత్మగాదు మునినుతచరితా. 7

క. చేరి పరాధీనుండై
యారూఢిగ బ్రహ్మ రాజసాహంకారో
దారత సృష్ట్యాదివ్యా
పారము లీశ్వరునిచెంత బరఁగ రచించున్. 8

వ. అని చెప్పి యీశ్వరుని సూక్ష్మశరీరప్రకారంబు విను మని
యి ట్లనియె. 9

సీ. సూచింప నీశ్వరు సూక్ష్మశరీరంబు
వివరింతు వినవయ్య విమలచరిత
యవియ పంచీకృతం బగుమహాభూతాంశ
లందుకు నీశ్వరు నంతరంగ
మంతయు విష్ణుండు స్వాంతంబు చంద్రుండు
తగుబుద్ధి బ్రహ్మచిత్తంబుఁ దెలియ
నారాయణుం డహంకారంబు రుద్రుండు
నివి కరణము లైదు నీశ్వరునకు

తే. నఖిల దిక్కులు శ్రోత్రేంద్రియంబు పవనుఁ
డరయ త్వక్కును సూర్యుఁడే యక్షియుగము
వరుణుఁడే జిహ్వ యశ్వినుల్ వరుస ఘ్రాణ
మిదియె జ్ఞానేంద్రియము లైదు నెంచి చూడ. 10

సీ. వాగింద్రియం బగ్ని పాణీంద్రియం బింద్రుఁ
డంఘ్రివామనుఁడు గుహ్యంబు దెలియ
వల ప్రజాపతి గుదంబామృత్యు వీరైదు
నెలమి నీశ్వరుని కర్మేంద్రియములు
ప్రాణమపానముదానసమానముల్
వ్యానము లివి ప్రాణవాయువులును
తన్మాత్రలైదు మొదల్ పంచవింశతి
తత్త్వాంశలెల్లను దనర నీశ్వ

తే. రునకుఁ గల లింగదేహంబు రూఢిగాను
యింతయును దృశ్యమును ద్రష్ట నీవు నగుట
నెలమి నీ వవి గా వవి యెఱుఁగునట్టి
స్వప్రకాశాత్ముఁడగు నిరంజనుఁడ వీవు. 11

చ. అరుదుగ మూఁడహంకృతులయందు జనించిన పంచవింశ
తుల్, స్ఫురదఖిలాంశలుం దెలిసి చూడఁగ దృశ్యములుం
జడంబులుఁ, బరువడి నీవు నీవిషయభావప్రకాశుఁడవైన
ద్రష్టవుఁ, గర మటుగాన లింగతను కార్యము లెల్లను
నీవుగావిలన్. 12

క. వితతమగు లింగదేహము
మతిదలఁపఁగ నీవు గావు మఱియు నవస్థా
స్థితుఁ డెటువలె నీవగుదువు
ప్రతిదేహాతీతుఁడవును పరమాత్ముఁడవున్. 13

ఆ. స్థితి యవస్థ సూక్ష్మదేహంబు నభిమాని
పరఁగ విష్ణు సర్వపాలకత్వ

మును హిరణ్యగర్భమును సాత్వికాహంకృ
తియును నీవు గావు తెలిసిచూడ. 14

క. తలకొని యుత్పత్తిస్థితి
విలయంబు లొనర్చు బ్రహ్మ విష్ణు మహేశా
ఖ్యలు గల పురుషులు గావున
నల విష్ణుం డాత్మయానె యరయుము వత్సా. 15

వ. కావున విష్ణుండు స్థితికర్త యగుటంజేసి నిర్వికారుం డైన
పరమాత్మ కాఁడని యిట్లనియె. 16

క. సమకొని యవ్యాకృతదే
హము కారణతనువు యాత్మయును గా దది దృ
శ్యము ద్రష్ట వీవు సవికా
రము యది నీవును వికారరహితుఁడ వరయన్. 17

వ. అది తామసాహంకారం బై వర్తించునట్టి మాయాగర్భం
బున బ్రహ్మ విష్ణు రుద్రు లడంగియుండుదురు వారల
నాత్మ యని యేలా గనవచ్చును. 18

క. అనయంబు బ్రహ్మ నే నని
మునుకొని బ్రహ్మాభిమానమున నుండు నటం
చును వేదశాస్త్రములుఁ జె
ప్పును నెఱుఁగుదు గాదె నీవు పుణ్యచరిత్రా. 19

క. క్రమమున నవ్యాకృతదే
హము ప్రళయావస్థ తామసాహంకార
త్వము సర్వభూత సంహా
రము రుద్రుఁడు కర్త యిదియు రహి గావు సుమీ. 20

సీ. తలపోయ రుద్రుఁడు తామసాహంకార
కలితుఁడై విశ్వంబు కణఁగి మ్రింగు
నతనికి సృష్టిసంస్థితికాలపాలన
క్రమములకెల్ల కారణము లేదు
అది గాన నిట్టి యవ్యాకృతదేహంబు
దృశ్యంబు ద్రష్టయు తెలియ నీవు
యల బ్రహ్మ విష్ణు రుద్రులకును కర్తయై
తివిరిమాయాగుణాతీతుఁ డగుచు

తే. నలరి వెలుఁగొందు పరమాత్మ యదియు నీవు
గా నదృశ్యంబు లన్నియు కడకు ద్రోఁచి
నిర్వికల్పానుభూతిచే సర్వసాక్షి
వగుచు వర్తించవయ్య నీ వనఘచరిత. 21

క. ఈతనువులు మూఁటికి మరి
నాతతముగ సాక్షి యగుచు నలరివసింపఁ
బ్రీతిగ నది పంచమహా
భూతంబులకెల్ల హేతుభూతం బగుచున్. 22

వ. అదియె మూలప్రకృతిశరీరం బని యెఱుంగుము. 23

క. అదియె యనాహతనామము
నది పంచ బ్రహ్మమును మహాగోప్యము నీ
కది వివరించెద నెంతయు
సదసద్విదితముగ వినుము సాధుచరిత్రా. 24

వ. ఇట్టి మూలప్రకృతిశరీరంబునకు నవస్థ సర్వసాక్షి యీశ్వ
రుం డభిమాని శుద్ధసాత్త్వికాహంకారంబు జ్ఞానశక్తి బ్రహ్మాం
డాతీతస్థానంబును సర్వకర్తృత్వ సర్వపాలకత్వ సర్వసం

హారకత్వసర్వనియంతృత్వసర్వభోక్తృత్వ సర్వేశ్వరత్వాది
షడ్గుణైశ్వర్యంబైనభోగంబోంకారంబుమాతృకయందుల
వ్యాపకం బగునాత్మ మహాత్మ యాత్మోత్మిది సంజ్ఞలుకలిగి
నది మూలప్రకృతిశరీరం బగు నిది పిండాండబ్రహ్మాండంబు
లకు దృష్టశరీరంబులని వాచ్యార్థంబు చెప్పంబడు నీశ్వర
రూపంబును దృశ్యంబగు వీటికి సర్వసాక్షిస్వరూపంబు
చిత్తు వీటితోఁగూడిన జ్ఞానోపాధిచేత శుద్ధబ్రహ్మం బనిపించు
కొనును వీటి కతీతంబగు నదియె యీశ్వరుని తుర్యా
తీతం బది జలశర్కరన్యాయంబున నిత్యముక్త శుద్ధబుద్ధ
సత్యజ్ఞానఘనసచ్చిదానందపరిపూర్ణం బగునదియే నిష్కళ
బ్రహ్మం బని మహావాక్యనిర్దేశ్యంబు నదియే నీవ ఈక్రమం
బున నీశ్వరతనుచతుష్టయప్రకారంబు తేటవడం జెప్పిన
సంతోషస్వాంతుఁడై శిష్యుండు శ్రీగురుచరణంబులు
శిరంబుసోకం బ్రణమిల్లి యిట్లనియె. 25

శా. స్వామీ! నాకుఁ బ్రపంచలక్షణములున్ సంధిల్లుజీవేశ్వర
ప్రామాణ్యంబులవృత్తులందెలియఁజెప్పన్ వింటిసందేహము
ల్బ్రేమన్బాపితి రింక వేఁడెదను సంప్రీతిన్ బ్రవర్తిల్లు నీ
సామాన్యం బగుకల్పపంచకము నజ్ఞానక్రమం బంతయున్.

వ. వివరింపు మని యడిగిన శిష్యునిం గనుంగొని కృపాతరంగి
తాంతరంగుం డై గురుం డి ట్లనియె. 27

తే. అరయ పిండాండమునను బ్రహ్మాండమునను
ప్రళయములు రెండు రెండు నై పరిఢవిల్లు
గురుకృపాదానమునను సంగుప్తమగుచు
నమరు నత్యంతికప్రళయం బనంగ. 28

వ. ఇవి పంచప్రళయంబు లనఁ జను వీటిలక్షణంబులు తద్వ్యా
ప్తులు సకలంబును వేఱువేర నెఱింగించెద సావధానంబుచే
విను మని యిట్లనియె. 29

క. విను పిండాండంబులు రెం
డనుదినమును గలుగుచుండు నరయ సుషుప్తిన్
ఘనసకలేంద్రియములతో
తనువులు రెండనఁగఁ బ్రళయదశ యిదియె సుమీ. 30

వ. కావున సకలేంద్రియంబులతో స్థూలసూక్ష్మశరీరంబులు
రెండును సుషుప్తియందు నిత్యంబును లీనం బగుటం జేసి
యీప్రళయంబు దినప్రళయం బనంబరఁగు నింక స్థూల
దేహప్రళయంబు వివరించెద వినుము. 31

క. స్థూలశరీరప్రళయను
నాలోకింపంగ నది మహాప్రళయమగున్
లీల నివి రెండుపిండాం
డాలోలప్రళయములు రయంబున జూడన్. 32

వ. ఇవి పిండాండప్రళయంబులు యింక బ్రహ్మాండప్రళయంబు
లెట్టి వనిన. 33

సీ. ప్రతిచతుర్యుగసహస్రములు బ్రహ్మకు నొక్క
పగలు రాతిరి యగునంతకాల
మిది జలప్రళయంబు నగును నిద్రించిన
బ్రహ్మకు నదియొక్క ప్రళయమయ్యె
నాబ్రహ్మ మరణమా నది బ్రహ్మప్రళయంబు
లీరెండు ప్రళయమ్ము లెంచిచూడ

బ్రహ్మాండమున గల్గు ప్రళయముల్ దక్కిన
ప్రళయంబు విధము నేర్పఱతు వినుము

తే. జలజగర్భుఁడు త్రైలోక్యసహితుఁ డగుచు
పరమ మైనట్టి మాయలోపల నణంగ
నట్టి సమయంబునను ద్వాదశార్యములును
ప్రాని యుదయింతు రపుడు విస్ఫూర్తితోను. 34

మ. చటులోగ్రాతపవహ్ని చేదిశలు నాచ్ఛాదించు త్రైలోక్యవి
స్ఫుటభానుప్రభలుల్లసిల్లభయదస్ఫూర్తిఁ బ్రవిడంబించు న
ద్భుటులౌ ద్వాదశసూర్యులందు విలయప్రఖ్యాత కాదంబినీ
పటలంబుల్ జనియించి వారి గురియుం బ్రహ్మాండము న్నిం
డఁగన్. 35

శా. ఆనీరంబున సర్వభూతసముదాయంబుల్ మునుంగుల్ తదీ
యానూనప్రళయంబునం గలసి స్థూలాంభోజగర్భాండము
ల్లీనం బై ననురూపముం జెడక నోలిన్ సూక్ష్మలింగాంగమ
జ్ఞానాంభోనిధిలోపలన్ మునుఁగుబీజాకారరూపంబుతోన్.

సీ. అజ్ఞాన మయమైనయాసుషుప్తిని జీవ
గణములు మగ్నమై కలసినట్లు
ఘనవిరాట్టు హిరణ్యగర్భులు కారణా
తీతు లై యవ్యాకృతంబునందు
మగ్నమై యుందురు మానుగాఁ దమతమ
నిజకర్మసహితులై నిబిడమైన
యామ్నాయ మనెడిమందాసనంబున చతు
ర్వేదభేదములు గల వివిధజీవ

తే. రాసులెల్లను జడసముల్లాసభావ
ములను తమయందు మెఱుంగక మునుగుచుండ్రు
యిదియె బ్రహ్మకు రాతిరి యెంచిచూడ
నిది దినప్రళయం బగు నిష్ఠచరిత. 37

ఉ. అంతట నాచతుర్యుగసహస్రములుం జనపద్మజుండు న
త్యంత సమాధియోగవిధి దవ్వేఁగఁ జేసి లయాంబుపూర
మ్మున్, వింతఁగఁ గ్రోలి లేచి కనువిచ్చి చతుర్విధవర్ణజీవుల
న్నెంతయు కర్మవాసనల నేమరకన్ సృజియించు నిచ్చలున్.

క. ఏ యే జీవులకెల్లను
ఏ యే వాసనలు కర్మ మేలాగుండున్
న్నా యా జీవుల నెల్లను
పాయక సృజియించు కర్మపరతంత్రుం డై. 39

వ. ఇది దినప్రళయం బని యెఱుంగుము. 40

చ. అరయఁగ నింకనీకును మహాప్రళయం బెఱిఁగింతునిశ్చలో
దారమనీషతన్ వినుము దాని విధం బతితుర్యమంటిదు
ర్వారరయంబునందు సురవర్గము బ్రహ్మచతుర్విధైక వి
స్తారశరీరరూపములు సర్వమణంగును విస్మయంబుగన్. 41

వ. ఇట్లు బ్రహ్మాదిదేవతలు విరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృత
మూలప్రకృతిసహితంబుగాఁ బ్రళయంబు నొందు నని
చెప్పి మఱియు ని ట్లనియె. 42

సీ. క్రమమొప్పు శతవత్సరము లనావృష్టిచే
సకలభూతములు నాశంబునొందు

నటుమీఁదటను ద్వాదశాదిత్యు లుదయమై
చటులతీవ్రాతపజ్వాలనశిఖల
కనుపట్టు నూర్ధ్వలోకము లేడును దహించి.
నాయగ్నికణముల నాదిశేషు
ఫణములు దాఁకిన పటువిషజ్వాలలు
గ్రమ్మి తద్విషమున కలితవహ్ని
తే. కీల లురువడి సప్తపాతాళలోక
ములను దహియింపఁ బదునాల్గుభువనములును
నిటుల లయమొందు నక్కాల మినుడు నూరు
వత్సరము లుండు తీక్ష్ణ దుర్వారుఁ డగుచు. 43

సీ. అప్పుడు సంవర్తకాదిమేఘంబులు
సకలదిక్కులఁగ్రమ్మి చటులతీవ్ర
దృగసహ్యధగధగద్ధగితవిద్యుల్లతా
కలితమై భయదోగ్రఘనకఠోర
విస్ఫురితాజాండవిపులస్థనితఘోష
ములతోడ పటుతరజలవిలంబ
మానదర్పమకరకానికాయంబుతో
భూరిధారాపూర్ణవారి యగుచు
తే. రేయుఁ బవలును వడినొక్కరీతిగాను
మింటికిని నేలకును సూత్ర మంటినట్లు
సకలలోకంబులెల్లను జలమయముగ
వరుస వర్షించు నూఱుసంవత్సరములు. 44

వ. ఇట్లు వర్షించిన సకలంబును జలమయంబై తజ్జలంబునందు
భస్మంబైన బ్రహ్మాంబు గలసి యుండు గావున. 45

మ. అప్పుడా మేఘసమూహములస్సలిలధారానూనమానంబులై
విపులాజాండము నీటముంచి పెలుచన్ వేగంబె తత్తోయ
మం, దుపమింపన్ సరిరానినిష్ఠురసముద్రోదగ్రచండప్రభా
తపనం బై బడబాగ్ని బుట్టిజలముల్ ద్రావున్నితాంతస్థితిన్.

ఉ. ఆజలమంతనాశనము నైనను దద్బడబాగ్ని నిశ్చల
భ్రాజితమై శతాబ్దములు బర్వి వెలుంగఁగ చండవాయువ
వ్యాజ జనించి తీవ్రగతినొంది విజృంభణవృత్తితోడ నా
రాజిలుచున్నబాడబము గ్రాసముసేయును నశ్రమంబునన్.

క. ఘోరంబుగ నాజంఝా
మారుతము శతాబ్దములును మలయుచు వీచున్
మీరిన నమ్మారుతమును
ధీరత నాకాశమొడిసి పెగమ్రింగు తగన్. 48

క. మునుకొని నయ్యాకాశము
కనుకనితన్మాత్రయుతముగాగ మహాత్మా
పెనుపొందు తామసంబును
వినుతాహంకారమంత వెసమ్రింగు తగన్. 49

సీ. ఆనిందు తామసాహంకారమును బట్టి
రాజసాహంకార మోలి మ్రింగు
నామించు రాజసాహంకారమును బట్టి
సాత్త్వికాహంకారజడము మ్రింగు
జ్ఞానకర్మేంద్రియ సహితమై సాత్త్వికా
హంకారమున లీనమగుచునుండు

నరయ నాసాత్త్వికాహంకారమంతగఁక
రణదేవతలును చక్రప్రయుక్త
తే. మగు మహాత్తత్త్వమైనయవ్యాకృతంబు
నందుఁ గలయు మహాతత్త్వమై విశేష
మైన యవ్యాకృతము మూలమైన ప్రకృతి
యగుమహామాయతోఁ గూడు ననఘచరిత. 50

వ. ఆగుణక్షోభిణి యైనయమ్మహామాయ గుణసామ్యంబునం గూడు సామ్యంబునందు పంచవింశతిభూతగ్రామంబులును సకలవిధజీవసమూహంబులును సర్వంబు నణంగియున్న సమయంబున పరమపురుషుండు తానె పరబ్రహ్మం బై వెలుంగు సకలశబ్దంబులు గుణసామ్యంబున నణంగు ఆగుణసామ్యంబైనమూలప్రకృతి పరబ్రహ్మంబున లీనంబగు నాపరబ్రహ్మమునందు యిచ్ఛాజ్ఞాన క్రియాజ్ఞాన ద్రవ్యాజ్ఞానరూపం బైనశక్తిత్రయంబు నాశం బగునదియెటువలె నయ్యె నని యంటివా వినుము. 51

ఆ పూని కర్మ మనెడిబురదలోపల జీవ
బీజసస్యసమితి వేర్మినణఁగు
నట్టి జీవసహిత మగు కర్మవంక మ
జ్ఞానభావమునను లీనమగును. 52

తే. కాన జీవులకెల్లను జ్ఞానమహిమ
లేదు గావున మోక్షంబు లేదు సుమ్ము
అరయ వటబీజమున వృక్ష మణఁగినట్టు
లఖిలవిశ్వంబు గుణసామ్యమందు నణఁగు. 53

క. త్రిగుణసామ్యం బెల్లను
మూఁగిన యాస్వస్వరూపమున మగ్నం బై
యేగతి యెఱుఁగదు గావున
వేగ పరబ్రహ్మ మొకఁడు వెలుఁగుచునుండున్. 54

వ. అట్టి నిజప్రకాశస్వరూపంబునందు నీసకలప్రపంచంబు నెవ్విధంబున నణంగియుండు నని యంటివా యది వివరించెద వినుము. 55

ఆ. విను మహాసముద్రమునఁ బచ్చికుండలు
గలపఁ గరఁగి నీటఁ గలసినట్లు
నిర్గుణంబునందు నిఖిలప్రపంచంబు
గలసిపోవు నిర్వికారముగను. 56

క. చాలుగ పురగప్రపంచం
బేలాగున బుట్టుననిన నెంతయు నీకున్
బోలించి ముందు చెప్పనె
నీలో నది తెలిసియుండు నిర్మలచరితా. 57

వ. అని చతుర్విధప్రళయంబులు తల్లక్షణంబులు సవిస్తారంబుగా వేర్వేర వివరించి యింక నత్యంతికప్రళయం బెఱింగించెద నది యత్యాశ్చర్యంబు నీవు సావధానాయత్తచిత్తుండ వై విను మని యిట్లనియె. 58

మ. అల పిండాండమునందు స్థూలమగు బ్రహ్మాండంబునందున్ స
ముజ్జ్వలమై యొప్పుచతుర్విధప్రళయము ల్జర్చించి తల్లక్ష
ణాఖ్యలు వేర్వేర నెఱుంగఁ జెప్పితిని యింక న్నీకు నత్యంతిక
ప్రళయంబున్ వివరించెద న్వినుము శుంభచ్ఛేముషీసంపదన్.

తే. అరయ నత్యంతిక ప్రళయంబునకును
కర్మ యనఁగ వివేకుఁ డొక్కరుఁడు కాఁడె
యట్టి సువివేకుఁ డఖిలదృశ్యప్రపంచ
మంతయును బట్టి సంహార మాచరించు. 60

వ. అది యెట్లనిన. 61

చ. అరుదుగఁ ద్రాడుజూచి భయమందు భుజంగమటంచు భ్రాం
తిచే, నరిమురి సద్వివేకమున నల్లనజూచిన లేకపోవులో
వెరవున జూడకున్న భయవిహ్వలభావము దీర దీవిధం
బరయ నిజస్వరూపుఁ గనిసంతనెమాయనశించు గ్రక్కునన్.

వ. కావున నీస్వరూపంబుఁ జూపెద వివేకంబున గనుంగొనుము.

సీ. తలఁప స్వప్నములోన తనుజంపవచ్చిన
శత్రువులను బట్టి సంహరింప
మఱి యుపాయములేదు మానుగా మేల్కాంచి
నంతనె యావైరు లణఁగిపోరె
పరికింప నటుల ప్రపంచమంతయు నిజా
కారమైయుండి సంహారమగును
నది యెటువలెనన్న నర్కాంశులను నెండ
మావులు గనుపించి మలసిచూడ

తే. లేని యటువలె జీవవిహీనమైన
ప్రతిమదేహంబు మిథ్యయై పరగినట్లు
మాయ విస్తీర్ణమై జగన్మయము నగుచుఁ
గానఁబడుచుండు సద్వివేకమునఁ జూడ. 64

వ. ఇట్లు వివేకంబునఁ జూచిన జగంబు మిథ్యారూపం బై బ్రహ్మంబు సత్యస్వరూపం బై నిలుచు నీసకలప్రపంచంబు లుండియు లేక యుండును. 65

క. ఈకరణి వెరవుతోడ వి
వేకంబునఁ జూచితేని వినుము ప్రపంచం
బాకుల మై నశియించును
శ్రీకరమై బ్రహ్మయొకఁడె చెలఁగుచునుండున్. 66

వ. కావున నీప్రపంచంబునందు తనకు సంసారబంధకంబు లేదు ఇది ప్రత్యక్ష ప్రళయంబగుటంజేసి యత్యంతప్రళయం బనంబడు. 67

సీ. పరికింప నది మహాప్రళయంబువలె గాదు
అదిస్థూలరూపంబు అరసిచూడ
పోలింప సంసారమే లింగదేహంబు
అజ్ఞానగర్భమం దణఁగియుండు
భవబీజరూపమై భావింప జడ మది
యాలింగదేహంబు నదియు నెంత
పర్యంతమును నశింపదు అంతపర్యంత
మాజీవునకును శుభాశుభైక
తే. కర్మచయములు జెడ వవిగాన జీవు
నకును జననంబులును మరణంబు దప్ప
దింతయును లెస్స నాత్మలో నెఱిఁగి బుద్ధి
మంతుఁడవు గమ్ము నిత్యనిర్మలచరిత్ర. 68

క. పంబిన యీపంచప్రళ
యంబులలక్షణము లన్ని యతివేడుక గా

నంబడఁ జెప్పితి నీకు న
యంబున ముఖ్యార్థమొకటి యది వినుపింతున్. 69

వ. నీవు సావధానంబున వినుము. 70

సీ. క్రమమున నీత్రిగుణముల లోఁగొనియున్న
యవ్యాకృతం బదియరసిచూడ
గరమొప్ప నీశ్వరు కారణదేహంబు
ఘనసుషుప్తియవస్థ యెనయరుద్రుఁ
డభిమాని యతఁడాత్మ యగునె యీసకలంబు
గుణమయం బాత్మ నిర్గుణుఁడు చూడ
ఘనవిరాట్టుహిరణ్యగర్భులవ్యాకృతి
పరగ సృష్టిస్థితిప్రళయములును

తే. బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రముఖవిశ్వ
మంతయును జూడఁ గుణకార్య మనితలంచు
రూఢి పరమాత్మ సాక్షిస్వరూపుఁ డగుచు
నుండు నంతయు నెఱుఁగుచు నుండు ననిన. 71

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున ఈశ్వరతనుచతుష్టయపంచప్రళయవివరణంబను పంచమప్రకరణము.



## షష్ఠప్రకరణము.

క. వినవయ్య శిష్యరాయా
అనువుగ జీవేశ్వరులకు నైక్యం బిదిగా
వున తాదాత్మైక్యంబును
ఘనముగ నెఱిఁగింతు షష్ఠప్రకరణమందున్. 1

వ. అని యి ట్లనియె. 2

క. వినుతింప తత్పదార్థము
మనుకొని యీ త్వం పదార్థమును నీయుభయం
బున గల్గులక్షితార్థం
బనుపమ ఫలితార్థమగుచు నలరు మహాత్మా! 3

తే. మొనసియున్న మహావాక్యమునకు తత్ప
దార్థమే పూర్ణచైతన్య మరసిచూడ
నదియె ప్రత్యక్పర బ్రహ్మ మనఁగ నొప్పు
గాన యిది లెస్సఁ బరికింపు మానసమున. 4

క. పూని యవిద్యామాయల
నానిన యుభయంబు నిరసనం బైనఁ బరం
బౌనట్టి నిర్గుణం బగు
మానితచైతన్య మొకటి మరి నిల్చుసుమీ. 5

క. పదపడి తత్పదమని త్వం
పదమని యీ రెంటి యర్థభావంబులు నీ
వదిగాక వేరె యగునే
యిదియె మహావాక్యమూల మీవు నిజముగాన్. 6

వ. ఆవస్తువు నీవే యని చెప్పిన శ్రీగురునకు వినయసంభ్రమ
చేతస్కుం డై శిష్యుం డి ట్లనియె. 7

క. అయ్యా! యీశ్వరునకు నా
కెయ్యెడ నైక్యంబుగలదె హీను మగ్న సగుణా
అయ్యాశ్వరుడు సర్వజ్ఞుం
డెయ్యెడ కించిజ్ఞుఁడనఁగ నే జీవుండన్. 8

వ. ఆతత్పదార్థం బెలాగున నే ననవచ్చును. 9

సీ. వ్యాపకుం డతఁడు నే నట పరిచ్ఛిన్నుండ
స్వామి యతండు సేవకుఁడ నేను
అతఁడు స్వతంత్రుఁ డే నట పరాధీనుండ
నతఁడు నియంత నేనియామ్యకుఁడును
అతఁడు ముక్తుండు నే నాది సంసారిని
మోక్షదుఁ డతఁడు కర్మరుఁడ నేను
అతఁడు ఫలప్రదుం డగు నేను ఫలభోక్త
నరయ నాతండు సృష్ట్యాదికార్య

తే. కర్త నేను నిరంతరకలితదుఃఖ
నగుదు నిటువంటి పశువు నేనైన నాకు
నీశ్వరునకును నెటుల నైక్యంబు గలుగు
దీని సంశయ మెఱిఁగింపు ధీవరేణ్య. 10

తే. పూర్ణసుజ్ఞానవిమలైకబోధరూప
వినుము జెప్పెద తత్పదం బనఁగ త్వం ప
దమున గలుగు నుపాధిరూపములచేత
భేదమై తోచు భేదంబు లేదు నీకు. 11

వ. ఏకవస్తువైన సువర్ణంబు లోహదర్పణాదులయందు రెండై
కనుపించు విధంబున ప్రకృతిసంబంధంబువలన బ్రహ్మంబు
జీవేశ్వరభావంబులఁ దోఁచు నామాయోపాధిచైతన్యుం
డు పరమాత్మ యగు అవిద్యోపాధిచైతన్యుండు జీవాత్మ
యగునీరెండు నుపాధివిరోధంబులవల్లను జీవేశ్వరు లని
యెడి పేరం బలుకంబడు నీవెంచినగుణంబు లన్నియు

మాయోపాధియని తెలిసి నీవు పరమార్థమందు వివేకించి
చూచితివా నిర్గుణం బైనపరమేశ్వరుం డొక్కండని
యెఱుంగుదు వని చెప్పి మఱియు నిట్లనియె. 12

క. ఓ జనవిద్యాకల్పిత
మేజీవుని ధర్మ మదియు మిథ్యారూప
వ్యాజ మని దాని మర్మము
రాజితమతిఁ దెలియవలయు రసికతతోడన్. 13

ఉ. జీవుని తత్త్వభేదములు చెన్నుగ ముప్పదియార తెల్వితో
భావములోఁ గనుంగొనిన బ్రహ్మము నొక్కఁడె నిల్చు నా
యవిద్యావిధమందు నిత్యత మహాప్రకృతింగల శాశ్వత
త్వముణ్, వావిరి లెస్సజూడఁగ నవార్యమటంచును ము
న్నుజెప్పెనే. 14

వ. మాయాకల్పితజీవుం డీశ్వరుండును అవిద్యోపాధిజీవుం
డగుజీవుండును యీరెండును నిరసనంబుజేసిన కేవలబ్రహ్మం
బు నిలుచును వెండియు. 15

సీ. మునుకొని వేదాంతమునను జహల్లక్ష
ణమున జహల్లక్షణంబు మఱియు
ననువొంద జహదజహల్లక్షణం బన
నిది లక్షణత్రయం బెఱిఁగికొనుము
తలపోయ తత్పదత్వంపదములయందుఁ
గల్గువాక్యార్థముల్ గడకుఁ ద్రోచి
లక్ష్యార్థములఁ బ్రీతి లలిబుచ్చుకొనఁదగు
శబలంబు నటుద్రోచి సమ్మతమున

తే. శుద్ధమే బుచ్చుకొనవలె సారిది పొట్టు
విడిచి తండులములు గొనువిధము దోఁప
కల్పితోపాధులన్నియుఁ గడకుఁ ద్రోచి
శుద్ధచైతన్య మది గ్రహించుట శుభంబు. 16

వ. అది గావున మహావాక్యంబునకు జహదజహల్లక్షణంబు
ప్రమాణంబు చిక్కినలక్షణద్వయంబు నిరర్థకంబది యెట్టు
లనిన. 17

ఉ. అందల మెక్కి కొంతదడ వశ్వము నెక్కను కొంతసేపు
ఈ చందము రెంటియందుఁ గలజాణఁ డొకం డటుగాన
చూడనీ, యందలముఁ దురంగమును నారయ భిన్నము
నందు నున్నవాఁ, డుం దలప న్నభిన్నుఁడు కడుం బరికిం
పుము నేర్పుమీరఁగన్. 18

మ. మును కాశిం బొడఁగంటి నిప్పు డిదుగో మోదించి రామే
శ్వరం,బున నేగాంచితి వాఁడు వీఁడు నొకఁడే మున్నిప్పు
డుం జూచినం, దనరం జూడఁగ దేశకాలములు భేదం
బింతయా గాక న్నాతనికిం భేదము లేదు అట్లగుట తథ్యం
బాత్మలోఁ జూడుమా. 19

ఆ. కాన యీయుపాధికల్పన జూడంగ
భిన్నమింతెకాని పేర్మితోడ
నందు నున్నవాఁడు నరయ భిన్నుఁడు గాఁడు
తెలిసికొనుము లెస్స తేటగాను. 20

వ. ఈశ్వరుండు మాయోపాధితసర్వజ్ఞుం డై యుండియు నటు
వెనుక మాయాతీతుం డై యప్రమేయుం బైనబ్రహ్మం బై
యుండు. 21

క. జీవుం డీశ్వరుఁ డవిద్యా
భావము తత్కార్యములను పటువిపరీతం
బై వర్తిలు జ్ఞానంబున
వావిరి సుఖదుఃఖములను వదలి సుఖించున్. 22

తే. శుద్ధచైతన్యమేచూడ సురుచిరముగ
నలరి ప్రత్యక్షచైతన్య మగుచునుండు
నది యనన్యభావంబున నరయ పూర్ణ
మైన చైతన్యరూపమై యడివసించు. 23

సీ. ఈరెండు నిరసింప భూరితాదాత్మ్యమే
శుద్ధచిన్మాత్రమై పొరిదినొప్పు
వివరింప నారెండు విద్యాను కార్యమా
యాకారణంబులై యలరుచుండు
నీరెండు మిథ్యయం చారూఢి నిరసింప
జీవేశ్వరైక్యంబుచే వెలుంగు
త్వం పదంబనఁగ జీవబ్రహ్మతత్పదం
బీశ్వరబ్రహ్మమే యెంచిచూడ

తే. నెలమి నసిపద మిట్టి జీవేశ్వరులకు
నరయ స్వాభావమై యైక్యమగుచునుండు
ననుచుఁ బలుకుట యనుచిత మనియెఱుంగు
మిది మహావాక్యపరమార్థ మిద్ధచరిత. 24

వ. ఇందుకు యెవ్వరికి కర్తృత్వంబులేదు నీకు పదత్రయ
వ్యాఖ్యానంబును కరతలామలకంబుగా దెలిపితిమి నీవు
చేసినభాగ్యంబున పరబ్రహ్మంబు లభించెను ఈనిర్గుణం బగు

వస్తువు ఇటువంటిదని పలుకుటకు నశక్యంబు గావున నచ్చట సకల యుక్తులును నిలిచె. నచ్చట బ్రహ్మంబు దొరికె ననుట వ్యర్థవాక్యంబు అక్కడ మనోవాక్కులకు నగమ్యంబు మనస్సు ఎఱుంగునంటివా యెఱుంగదు. వేదశాస్త్రంబులు వెఱ్ఱిపట్టిపోయెను. వేదాంతంబులు నోరు మూసుక యూరకయుండెను. సిద్ధాంతంబు లందలేక పోయెను. మనంబు ఎఱేఁగి యెఱుంగదని నీస్వానుభవంబున నెఱుంగుమని యిట్లనియె. 25

మ. వలనొప్ప న్నది యెట్టిదన్నను మహావాక్యంబు గూఢా
ర్థముం, దెలియం జెప్పెద సావధానమున నంతే లెస్సఁగాఁ
జూడుమి, మ్ములబ్రహ్మంబును జెప్పరాదు నిజమీమూలంబు
సమ్యక్కృపా, కలితాత్ముం డగుశ్రీగురుప్రభునిచేఁ గాక
న్గనఁగ శక్యమే. 26

వ. కావున శ్రీగురునియనుగ్రహంబునంగాని యనుభవంబునకు రానేరదు. 27

సీ. అలనేతిముఖమున నాయనాత్మక్రమం
బింతయు మిథ్య యటంచు లెస్స
పరిహరించిన మీఁద బ్రహ్మసాక్షాత్కార
మౌనను వేదవాక్యముప్రమాణ
మగుఁ గాన నానేతి యనెడువాక్యమునకు
నేదర్థమనిన జీవేశ్వరులకు
భేదమౌ సంసారప్రతిబంధములు విడి
పించి చూపిన నది పెంపుమాన

తే. సం బెఱుంగును నదియు బ్రహ్మంబుగాదు
మానసమునకు నామనోజ్ఞానమునకు
నేమహావస్తువు ప్రకాశ మిచ్చునట్టి
యాప్రకాశమె బ్రహ్మమంచని యెఱుంగు. 2

క. సంబిన పిండబ్రహ్మాం
డంబులు మిథ్యయని యెఱిఁగిరే జ్ఞానాజ్ఞా
నంబులు దృశ్యము లైనతి
రంబున బ్రహ్మంబు తానె రహిఁ వెలుఁగొందున్. 2

ఉ. చీఁకటిలోననుండి తనచెంతవసించిన వస్తువారయన్
గాకను దీపముం గొని తిరంబుగఁ గాంచును నట్టిదీపమ
స్తోకత నట్టివస్తువును జూడఁగ నేర దట్లైనదీపమున్
లేక కనంగరాదు లవలేశము గావున దీపము న్వలెన్. 3

క. ఆదీపము నావస్తువు
నాదరమున తానె యెఱుఁగు నట్లైన దగ
న్నాదీప మేటి కన్నను
ప్రోదిగ చీఁకటులనెల్లఁ బోఁద్రోలుటకున్. 3

ఉ. కాన మనంబునంగలిగి గాఢమునై పెనగొన్నయట్టి య
జ్ఞానతమంబు బాపి నను సమ్మతితో తను దా నెఱుంగనా
మానుగ జ్ఞానదీపమది మానసమందు జనింపకుండినం
బూని నిజస్వరూపమును బుద్ధి కనుంగొనరా దదెంతయున్.

క. జ్ఞానముచేతను వడిన
జ్ఞానము నిరసింపవలయు జ్ఞానంబున స
న్మానత బుట్టించుట న
జ్ఞానము చెరుచుటకు గురువచనమే దలఁపన్. 3

వ. కావున నమ్మహావాక్యంబునకు మిగిలిన పాషండమతంబుల ప్రమాణంబులు మహావాక్యశ్రవణంబున జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లి సంసారమూలం బైనయజ్ఞానకాష్ఠంబు దహించు సకలప్రపంచంబు నిరసనంబుగావించిపరబ్రహ్మసాక్షాత్కార కృతకృత్యులం జేసి సుఖంబు నొందంజేయు నమ్మహావాక్యంబునకు నిదర్శనం బెట్లనిన. 34

సీ. రమణీయ దండకారణ్యంబునను రామ
లక్ష్మణుల్ సీతతో లలివసింప
నొకనాఁడు ఋషులు రామోర్వీశుదర్శనో
త్సుకులయి చనుదెంచుసమయమునను
మునిపత్నులందరు ముదముతోడుత వచ్చి
సీతదగ్గర నిల్చి చెల్వముగను
ఋషులలోఁ గూర్చున్న శ్రీరామవిభుఁజూడ
వేడుకఁబుట్టి యా వేఁదు లపుడు

తే. అమ్మ నీవిభుఁ డెవ్వఁ డిందరసి మాకు
దెలుపుమా యాతఁ డీతఁడో తెలియఁబలుకు
మనిన తలయూఁచి తలయూఁచి యంతమీఁద
నీతఁడౌ ననె నేతి వాక్యార్థఫణితి. 35

క. కని యంత నడుగనొల్లక
తనివారఁగఁ జూచి రామధరణీశుని మ
న్ననగాంచి యుండి రంతయు
మునిపత్నులు తన్మయమున మోదం బెసఁగన్. 36

వ. కావున నివ్విధంబున నుపనిషద్వాక్యంబులచేతను సకల
ప్రపంచంబు నేతిముఖంబున నిరసించి బ్రహ్మానందంబున
సుఖం బనుభవించి తటస్థుండై నిలిచి మఱియును. 37

తే. మొనసి సద్రూపమున సకలప్రపం
చము ప్రకాశమొందు సకలశ్రుతుల
కెనయ నేతి వాక్యమునకు నతీతమై
మనసు కందరాని మహిమఁ గాంచె. 38

వ. అది పరబ్రహ్మం బని యెఱుఁగుము. 39

క. చెప్పక చెప్పెను వేదము
లప్పుడ యోగీశ్వరులు మహాత్ములు మదిలో
నెప్పుఁ డెఱుంగక యెఱిఁగిరి
యిప్పగిదిని వేదవాక్య మది నిజమరయన్. 40

క. వేదములకు నిది యౌనని
కా దని చెప్పంగ రాక కరమరుదుగ మ
ర్యాదను తద్వస్తువును ప్ర
మాదము నిరసించి మరియు మౌనముఁ దాల్చెన్. 41

తే. రూఢినావస్తువే నీస్వరూప మనుచు
స్వానుభవమున జూడుము సమ్మతమున
నామహావాక్యములు విన్న నఖిలశాస్త్ర
సరణు లెఱిఁగిన యీరూప మెఱుఁగవశమె. 42

వ. కావున నమ్మహావాక్యార్థంబు శ్రీగురుముఖంబునం గాని
తెలియ దనుట ప్రమాణంబు. 43

ఉ. లోకములోన నీమహిమ లోలతతోడ విశేషమంచు న
స్తోకవివేకులై యొకనిజూచి మఱొక్కఁడు సద్గురుప్రభుఁ

దేశికవతోడ చేరి యుపదేశము గాంతు రటైన ప్రాప్తిలే
కాకమనీయబోధ మది యంటదు జ్ఞానము లేదు గావునన్.

క. కావున ప్రపంచ నిరసన
భావము చేకూరిగాని పరతత్త్వంబౌ
కేవల నిజస్వరూపము
శ్రీవైభవలాభమదియుఁ జెందదు సుమ్మీ. 45

ఉ. కాన జడాత్ములైన యధికారవిహీనులు పెద్దలన్ సమా
ధానముతోడ వేఁడినను తద్వచనంబులు విన్ననైన లో
నూతన జాడ్యము న్వదల కూర్జితమౌవిపరీతదృష్టిచే
పూని చెరించి పిమ్మటను బొందుదు రెప్పుడు సుప్తిలోపలన్.

క. మానుగ భవయుతమగు న
జ్ఞానము గాల్చుటకు వెరవు సుమ్మది బ్రహ్మ
జ్ఞాన మది గాన శుద్ధ
జ్ఞానము బుట్టించుటకును సద్గురుఁడె కదా. 47

తే. అట్టి శ్రీగురువాక్యమే నరయ కార
ణంబు సద్బ్రహ్మ సాక్షాత్కృతంబునకును
నఖిలభూతప్రపంచసంహారమునకుఁ
బరఁగ నటుగాన కేవల బ్రహ్మమతఁడు. 48

క. వినుము 'అహం బ్రహ్మం' బని
యును 'సర్వం బ్రహ్మ'మనుచు నొగి 'బ్రహ్మాస్మి'
యని యోగీంద్రులు బలుకుదు
రనయము నది నీవె కావె యనఘచరిత్రా! 49

క. తనర శ్రుతిద్వయముం జె
ప్ప నహం బ్రహ్మంబు ననుచు పూని యఖండా
ర్థనిదర్శన మిదియే యని
ఘన సమ్యగ్గురు సమాధికారణ మగుటన్. 50

వ. ఇది సమ్యక్ జ్ఞానస్థితి యని వేదాంత సిద్ధాంతు లూర్ధ్వ
బాహులై చెప్పుదురు. 51

సీ. అల బ్రహ్మ విష్ణు రుద్రులు నిత్యముక్తులు
ఘనశుభాశుభకర్మకలితమతులు
బ్రహ్మావబోధులు పరికింప విమల సు
జ్ఞానవిగ్రహమూర్తి యైనయట్టి
పరమేశ్వరునకును భావింప నుపదేశ
మరయ లేదైన తా నాదిగురుఁడు
సత్యస్వయంప్రకాశస్ఫూర్తినిత్యము
క్తుఁడు గాన నమ్మహాత్మునకుఁ గలిగి
తే. యలరు నంతఃకరణసంజ్ఞ లైన బ్రహ్మ
విష్ణు రుద్రులు స్వస్వయం వేద్యు లెపుడు
కేవల బ్రహ్మబోధైకభావ మతులు
వారు ముక్తులు గారె ధీవరచరిత్ర. 52

వ. వారు మాయోపాధితాదాత్మ్యమైన తమతమ నిజస్వరూ
పంబు మరచిన వారు గారు కావున వారు నిత్యముక్త
లని యేల చెప్పరాదు. 53

మ. ఒనరన్ శ్రీగురుసుప్రసాదమున జ్ఞానోత్పన్న మైనట్టి పా
వనుఁ డాజీవుఁడు జీవితం బెడలి జీవన్ముక్తుఁ డౌ గాదెయా

సనకాదు ల్మరి నిత్యముక్తులు జనుల్ సత్కర్ములై భూతలం
బున దేహంబులు దాల్చిసద్గురుకృప న్బోధానుసంధానులై.

వ. ప్రారబ్ధవశంబున సత్కర్మజ్ఞానసంపన్నులై మనుష్యదేహం
బులు దాల్చి తమభాగ్యవశంబున శ్రీగురుకృపాదానపరి
గ్రహంబు గలిగి పునర్భవంబులు దప్పి శరీరధారులై
జ్ఞానోత్పత్తిఁగలిగి జీవన్ముక్తులై సచ్చిదానందపరబ్రహ్మం
బగుదురు. 55

మ. అడవిం బుట్టిన వహ్ని భూరితృణగుల్మానేకవృక్షావలీ
పటలం బేర్చినభంగి జీవునికి సంబంధంబులైనట్టి యా
పటుదేహత్రయకర్మసంచయసముత్ప్రారబ్ధజీవత్వముల్
జటులజ్ఞానఘనాగ్నికీలలను భస్మంబౌ నిమేషంబునన్. 56

ఆ. చెలఁగి జ్ఞానవహ్నిచేఁ దనుత్రయమును
దగ్ధమాచరించి దనరువారు
దగ్ధపటముభంగి ధారుణీతలమున
సంచరింతు రాత్మసౌఖ్యమునను. 57

చ. అరుదుగఁ జూడ దగ్ధపటమత్తులకుం గనుపించియుండియుం
గరములఁ బట్టఁబోవఁ గొరగాదటు గావున ధాత్రిలోపల
న్నారయ జ్ఞానవంతులును నజ్జుల కజ్జులఁబోలె నుందురా
వెర వెలుఁగంగలేరు జడ విహ్వలభావులుగాన వారలున్.

క. ఆరూఢి నాత్మసాక్షా
త్కారం బైనట్టియోగిఘనులకు నెపుడున్
బ్రారబ్ధతనుత్రయక
ర్మారంభక్రియలు దోఁపవార్యస్థితాన్. 59

వ. అని యి ట్లనిన. 60

చ. అనయము తత్త్వబీజ మది యాకలిదీప్పనె కాని యంకురం
బున కదిరాదుగాన గురుపుత్త్రులునిం క్రియలోలురయ్యు నె
ష్మనముల సద్గురుప్రభునిమార్గము దప్పక సంచరింతురా
ఘనులకు సంసృతిభ్రమలు గప్పవ దెన్నటికిం గుణోత్తమా.

వ. అనిన శిష్యుం డి ట్లనియె 62

క. ఓయయ్య కారణంబగు
నాయజ్ఞానంబు దొలఁగె నంటి వటైతే
నాయజ్ఞానము దొలఁగిన
నీయంగద్వయము చెడక యేల వసించెన్. 63

వ. కారణంబు నాశంబైనకార్యం బేల వదలకపోయెను! దగ్ధంబైనపటంబు చెడక యేల నిలచియుండెను యీ సందేహంబు దెలియఁ బ్రసాదింపు మనిన శ్రీ గురుం డిట్లనియె. 64

క. రావోయి బుద్ధిమంతుఁడ
నీ వడిగినయర్థమునకు నేఁజెప్పెద సం
భావించి చూడు మందుల
వావిరి సందేహమెల్ల వదలుం జుమ్మీ. 55

మ. వడిగాఁ దీసి ధనుర్ధరుండు విడువన్ బాణంబు నెందాక న
వ్వడిగల్గున్ శర మంతదాక నడుచున్ వమ్మైన నచ్చోటనే
పడుఁ బ్రారబ్ధము కర్మ వేగమున నాపర్యంతముం దేహముల్
బడవా వేగము దూలినం బడును దా భగ్నంబులై మేది
నిన్. 66

చ. తివిరి కులాలచక్రమది ద్రిప్పి యటుండిన దానివేగముం
దవిలిన యంత సేపది యుదగ్రతతోఁ దిరుగుం దమత్రయం
బవిరళ పూర్వసంచితరయం బొగి గల్గినయంతసేపును
న్నవయక నిల్చునారయము నల్లన దీరిన ధారుణిం బడున్.

క. ప్రకటాహంకారం బను
వికటకులాలుండు లేక వెస కర్మపుమ్రొ
త్తిక లేకయున్న తనువను
రకమగుచక్రంబు పగిలి రాలదె ధరణిన్. 68

క. మునుకొని ప్రారబ్ధవశం
బున దేహవ్యయము దిరుగుఁ బోరిపోరి జ్ఞానా
గ్నిని భస్మముచేసి మహా
ఘనుఁడు తన నిజస్వరూపకలితాత్ముఁ డగున్. 69

వ. ఇది నిర్గుణ సాయుజ్యముక్తి యిది నీకుం జెప్పితి మీప్రకా
రంబు దెలిసినవారికి పునరావృత్తి లేదు లే దని చెప్పి
మఱియును. 70

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున
జీవాత్మ పరమాత్మ తాదాత్మ్యైక్యపూర్వకమను షష్ఠప్రకరణము.

---

ఆశ్వాసాంతము.

శా. ముక్తి శ్రీపరిరంభసంభ్రమకళా మోఘస్ఫుటప్రాభవా
వ్యక్తబ్రహ్మమయస్వరూప నిగమాంతాలోల విద్యాసమా
సక్తా శ్రీకరభవ్యమానసయశస్సాంద్రస్ఫురచ్చంద్రికా
సిక్తాజాండకటాహ సన్మునిజనశ్రేణీమనోరంజనా. 71

క. మహదాది వినుత సంచిత
విహితానుష్ఠానయోగ్యవిద్యావ్రత ని
స్పృహదృశ్యమోక్షసౌఖ్యా
వహ సనకసనందనాదివందితచరణా. 72

భుజంగప్రయాతము:—
శివజ్ఞానయోగప్రసిద్ధప్రభావా
కవిస్తోత్రపాత్రప్రకాశస్వభావా
వివేకప్రవీణాత్మవిద్యానుసేవా
భవాభీలదుర్దాంతపాథోధినావా. 3

గద్య. ఇది శ్రీగురుదత్తాత్రేయకృపాలబ్ధకవితావిచిత్ర శ్రీవత్స గోత్రపవిత్ర వేగినాటివంశపయఃపారావారనిశాకర నాగయామాత్యపుత్ర సరసగుణధుర్య కొండనార్యప్రణీతంబైన వివేకసింధు వనుమహాప్రబంధంబునందు మహాకారణదేహనిరసనంబును, ఈశ్వరతనుచతుష్టయనిరసనంబును, పంచప్రలయవిస్తారంబును, అజ్ఞానప్రకారంబును, జీవాత్మపరమాత్మతాదాత్మైక్యంబునుం గల ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.

## సప్తమ ప్రకరణము.



శ్రీమద్వివేకసింధు క
థామృతకల్లోలవీచికాలోలసుధీ
క్షేమంకర యతసీసుమ
దామశుభస్ఫురణకాయ దత్తాత్రేయా! 1

తే. అవధరింపుము సకలశాస్త్రార్థతత్త్వ
వేది యైనట్టి శ్రీగురుం డాదరమున
నిజపదాంబుజసద్భక్తి నివ్వటిల్లు
నట్టి శిష్యునితోడ ని ట్లానతిచ్చె. 2

సీ. సాలోక్య సామీప్య సారూప్యములు మూఁడు
పదవిశేషములును భక్తితోడఁ
బొందినవారికిఁ బోరి నభోగమనముల్
దప్పవు నిదియు సత్యంబు దలఁపఁ
బరికింప నాల్గవ పదవి సాయుజ్యంబు
నది భావకల్పితం బైచెలంగు
నది యొకచో సత్యమైన నీవును పరి
చ్ఛిన్నుండ నైతినం చెన్నవలదు

తే. అరయ నీముక్తి యాముక్తి యటుల గాన
బంధనము దప్ప దదిపునర్భవకరంబు
గాన నిందుకు దృష్టాంత మేను బూని
తెలియఁ జెప్పెద వినవయ్య ధీవరేణ్య. 3

ఉ. పూజ్యము నై వికుంఠమున పుణ్యచరిత్రులు మున్ను విష్ణుసా, యుజ్యమునొందినట్టి విజయుండు జయుండును విప్రశాపతం, ద్యాజ్యవిభూతచే ధరణి దైత్యులు నై జనియించి భూరిసా, మ్రాజ్యము సేయ రోటు ఇది మానసమందుఁ దలంచి చూడుమా. 4

వ. కావున నెంతపర్యంతంబు స్వస్వరూపంబునకు రాదు అంత పర్యంతంబు మాయారూపం బని యెఱుంగుము. 5

తే. ప్రళయమునను లోకసంజ్ఞలు నష్టమౌఁ
గాదె లోకములకుఁ గలదె ముక్తి
యరయ నటుల గాదు నిర్గుణ సాయుజ్య
మదియె నిత్యముక్తి యనఘచరిత. 6

సీ. ముదమొప్ప నిజముక్తి సాధింపముందుగా
యాపురూరవుఁ డాదియైనచక్ర
వర్తులు తమరాజ్యవైభవంబులు రోసి
సర్వసంగత్యాగసరణి నొంది
సాధించినారు విచారించి చూడుము
కలశాబ్ధిలోఁ దరంగములు నెగసి
క్రమ్మర జలధిలోఁ గలసినకైవడి
యదియు గావున సదా యైక్య మగును

ఆ. దేహసహితుఁ డైన దెలియ జీవన్ముక్తుఁ
డతఁడు దేహాద్యతీతుఁడై యలరునెపుడు(?)
వాని నెవ్విధమున వర్ణనసేయంగ
వచ్చు పరమపరుఁ డవాచ్యుఁ డతఁడు. 7

వ. మోక్షంబు సత్యంబైనబంధంబు సత్యంబె యనవచ్చు
నాయంటేని చెప్పెద వినుము. 8

తే. తలప బంధనమెపుడు సత్యంబుగాదు
ముక్తి సత్యంబ యాత్మకు మూలమైన
భూరి యజ్ఞానమే బంధకారణంబు
నందు పదవీత్రయంబున నణఁగియుండు. 9

క. దానికి చిత్పదమవసర
మగా నతనికి స్వాత్మకంబు నౌనెన్నందుర్గ
బూనిచెడదు కాలత్రయ
మూనము వర్తింపుచుండు మహితవిచారా. 10

సీ. ఆనందమే చూడ జ్ఞానస్వరూపంబు
నది క్రియాక్షరమని యందురెపుడు
పరగ నాయానందపరమైన పరమాక్ష
రమున కక్షరక్షరంబు లనెడి
యల నివృత్తిప్రవృత్తులును రెండు గనుపించ
గని మనోబుద్ధివాసనలచేత
నింద్రియంబులు నాత్మ నెనసినటించును
ఆచిదానంద నీరాకరమున

తే. నొక్క పురుషుండు నిద్రింప నొకఁడు వచ్చి
లేపుటలు లేక తనుదానె లేచుగాన

వట్టి వాఁడును నాతఁడ యుంటువలన
బూని యీరెండు లేదు నీలోన జూడ. 11

వ. అది వాక్కులకు నగోచరంబును వేదాంతమహాద్వైతంబె
సత్పదం బని చెప్పంబడును ఆసముద్రమందు నిద్రించి
యొకరు లేపక తానే లేచినవాఁడు సత్వుండు ఆసమయం
బున నిద్రసొక్కు తలకెక్కి లేవక యుండెనా నది చిత్ప
దానందం బని యెఱుంగుము. 12

ఉ. ఒక్కఁడు నిద్రబోయి జడ మొయ్యనదీరక లేచి సూర్యుడీ,
దిక్కుజనించె నుత్తరపు దిక్కది యంచు దలంచ వేరె
యం, డొక్కఁడు జూచి తూర్పు దెస నుద్భవమయ్యె నటం
చుఁ జెప్పిన, న్నిక్కము వీనిమాట యిది నిశ్చయమంచు
దలంచ డెంతయున్. 13

క. అటు వెఱక తనకుఁ దానే
పటుగతి దిశలెల్లఁ జూచి భానములో ను
త్కటముగ సూర్యుఁడు తూర్పున
తటుకున నుదయించె ననుచు తథ్యము సేయున్. 14

వ. కావున మాయాసంబంధంబున నిద్రించియున్న జీవుఁడు
తనకుఁ దానే మేల్కొనిన యప్పుడు ఈదేహేంద్రియా
దులకు ప్రపంచంబునకును వేఱై యానందంబున నిలచి
తనస్వరూపంబు స్వభావంబునం గాంచు నని మఱియును.

క. కల్లయగు మాయనేటికి
యల్లన నిరసింప దాని కట నిత్యత్వం

బెల్లపుడు లేదు నీలో
తల్లడపడ కరసి తేని తను దా నె చెడున్. 16

క. పంబికొని లేని యజ్ఞా
నం బిది సాన్నిధ్యమునను నటియించును దా
నిం బట్టుక నాత్మజ్ఞా
నంబున నిరసింపవలయు నానావగలన్. 17

క. ఈవిధమున రజ్జువుఁ గని
భావంబున సర్పమనుచు భయపడి లెస్సఁ
భావించి తెలియ త్రాఁడై
వారికిఁ పడును భయ మవశ్యముఁ గనుఁ దీరన్. 18

తే. ఇటుల ప్రకృతియనుష్ఠాన మెఱిఁగినంత
పూని యిట్టిపదత్రయజ్ఞాన మెఱుఁగు
నపుడు యజ్ఞాన మను ప్రకృత్యణఁగిపోవు
కేవ లానంద మటు మీఁద కేళిసల్పు. 19

వ. ఇవ్విధంబున నానందమయం బై యుండును. 20

క. వారు ప్రకృత్యభిమానులు
వారికి కారణము లై నవరగుణముల బెం
పారెడి ప్రకృత్యానందము
చేరువ చేష్టించుచుండు చెలువము తోడన్. 21

వ. ఆప్రకృతి యత్యంత ప్రభావంబున భావాభావరూపంబున
దిరుగుచు నానందస్వభావం బై యుండును. 22

తే. పూని యీ రెండుపదము లనూనభంగి
విశదముగ నీకుఁ జెప్పితి విమలచరిత

పరగ తత్పదమయము చిత్పదమయంబు
నగు ద్వయాద్వయంబు లనఁగ నలరుచుండు. 23

క. పరువడి నాచిత్పదమున
నరయ ద్వయాద్వయము లనెడి యవియును లేవ
య్యిరు దెరఁగుల వ్యాఖ్యానము
గరమరుదుగఁ జెప్ప నలవిగాదు దలంపన్. 24

తే. వస్తువెనిత్య మనుచు భావమునఁ దెలియు
మిందు కే చెప్పి చెప్పరా దెట్టు లనిన
నరయగా మంచివస్తువులందు నొక్క
చెడ్డదుండిన నది విసర్జింపవలయు. 25

ఉ. పొందుగ నీపదద్వయము పూని విచారము సేయ నాత్మయం
దందుల వ్యాపకం బగుచు నల్లనవర్తిలు నట్టి సచ్చిదా
నందపదత్రయక్రమసనాతనధర్మము లెల్ల మీకు మే
ల్పొందముగాఁగ జెప్పితిమి సంతసితంబుగ నేర్పుమీరఁగాన్.

వ. అది యెట్లంటేని. 27

తే. పరగ మోక్షంబు విస్తరింపంగ దగదు
యీపదత్రయ శోధనం బెఱిఁగితేని
వరుస భిన్నమభిన్న భావములు నీకు
గానబడుగాదె యిది లెస్సఁగా నెఱుంగు. 28

వ. ఇది మహావాక్యంబునఁ గలముదితార్థంబు ఇంక నొక్క
విచిత్రంబైన యుక్తి వివరించెద నందువలన సకలభేదం
బులు నివృత్తియగు నీస్వస్వరూపప్రకాశస్వరూపంబు
నీవెఱుంగుదువు. 29

క. సత్తుగ భేదం బనఁగా
సత్తో సదసత్తో యల నసత్తో యీమూఁ
డుత్తమవికల్పములలో
కోత్తరముగ వీని దెలియ నొగి మిథ్యలగున్. 30

తే. సత్యమైన నిరాకారసరణినుండ
వలయుఁ గాకది చెడనేల దెలిసిచూడ
నట్టి నాశనమై పోవునదియు సత్య
మనఁగ నేటికి యుక్తిగా దరసిచూడ. 31

క. భేదము నాశము నని యా
చ్ఛాదించిన నదియు మిథ్య సిద్ధాంతమగుఁ
గాదన నేటికి వారల
భేదము సత్య మనవలదు పృథుభావమునన్. 32

క. విను మథవా యది నాశన
మును బొందిన నైనభేదము స్సత్యము నే
జనముల మాటలు వంధ్యా
తనయుం డిలయేలె నమరదశ ననుటఁదగన్. 33

వ. వారిమాటలు సత్యం బనగూడదు. 34

క. కావున దానికి భేదము
భావంబున సత్యమనుచుఁ బలికెడిపలుకుల్
ద్వైవిధకల్పంబుల నవి
భావింపఁగ నప్రమాణపద్ధతు లరయన్. 35

వ. అని యివ్విధంబున నుభయపక్షంబులు దూషణంబులు
గావించి మఱియు ని ట్లనియె. 36

క. తనరఁగ భేదము సదస
త్తని చెప్ప విరోధమగును నందుకు నదిగా
వున మిథ్యాడంబరమది
కనుపించని యట్ల నదియుఁ గనుపించుఁ దగన్. 37

వ. అది సర్వదా విడిచిపెట్టుము. 38

సీ. అనుభవించ కల సత్యమంటివా కలలోన
గన్నది సత్యమై కలుగవలెను
అది యసత్యం బని యంటివా తత్కాల
మునకును సుఖదుఃఖములు నిజములు
అది సదసత్తని యంటివా యది విరో
ధాభాసయుక్తియౌ నదియుఁగూడఁ
దా స్వప్నమున లేని దైనను గనుపించు
నాకాల మది సత్యమై చెలంగు
తే. నటుల భేదంబు సత్యమై యజ్ఞులకును
గానఁబడుఁ గాన నిది లెస్సఁగా నెఱుంగు
మీవిధం బంతయును జగజ్జీవపరము
సకలమును మాయమిథ్యావిచార మనఘ. 39

వ. అది గావున నది విడువుము. 40

క. మీరిన యీభేదంబు వి
చారింప స్వజాతియో విజాతియొ యదిగా
కారూఢి స్వగతభేదమొ
యారయ నీమూఁడు లేవు యాత్మునియందున్. 41

ఆ. మొనసి యీస్వరూపమునగల్గు నీప్రపం
చము స్వజాతియొ విజాతియొ యటన్న

రెండువిధము లెన్న మాయామయంబులు
మదిని మిథ్యలనుచుఁ దెలియు మనఘ. 42

మ. తలప న్నిట్టి స్వజాతియుక్ స్వగతభేదం బెన్న బ్రహ్మాం
బునం, దులదూరీకృతమై స్వయంప్రభలతోఁదోఁచుక్ బర
బ్రహ్మము, దలఁపక్ జాతి స్వజాతియుక్ స్వగతభేదంబు
న్నహంకారముం, దిలకింపక్ మమకారము న్వదలి సందీ
ప్తైక చిన్మాత్రమై. 43

వ. ఇట్లు మాయామయభేదంబులం గూడిన యీశ్వరుండు
భేదంబులు నిరసనం బైనయాత్మస్వరూపంబు నద్వితీ
యుం డై వెలుంగుచుండు. 44

సీ. సకలతర్కోక్తులసరణు లక్కడనిల్చె
మొనసి షడ్దర్శనంబులు మణింగె
నేను నీవనుమాట నిలచిదూరంబయ్యె
మాయాపరిభ్రాంతి మట్టుపడెను
ఘనతవేదాంతంబు కడగాన కది నిల్చె
తలపఁదీర్ఘస్వప్నములు నశించె
నెఱుకమఱుపులు రెండు చోరవలేక తొలంగె
నతఁడు నే ననుమాట నఱయ నణఁగె

తే. నట్టియెడ కేవలబ్రహ్మమై స్వయంప్ర
కాశమై వేడ్క సంతతానంద మగుచు
నది విశేషంబులకునెల్ల శేషమయ్యె
నట్టి వస్తువు సుమ్ము నీవనఘచరిత. 45

వ. ఆవస్తువు సకలజీవులకు జీవస్థానం బగువిశ్వవిలాసం బగు

నిది నుతింప బ్రహ్మాదులకు నగమ్యం బది యగాధంబు
గావున తనకు దానై ప్రకాశింపుచుండును. 46

క. ఆవస్తువు నేనంచును
భావంబున నీవు ఎంతపర్యంతము లో
భావింతు వంతదడవును
నావస్తువు దృశ్యమగుచు నతిగోప్యమగున్. 47

ఆ. ఎఱుక మఱుపులు లేని యెఱుకయె నీస్వస్వ
రూపమని యెఱుంగు జ్ఞానమున క
తీతమైన యదియె తగుజ్ఞానమందిరం
బది స్వయంప్రకాశ మమలచరిత. 48

సీ. పరుఁడు నిర్మలపరబ్రహ్మంబు దాసర్వ
గతుఁడయ్యుఁ దన్నెఱుంగఁడు దలంపఁ
దా నెఱుంగును సర్వ తత్త్వముల్ సత్వంబు
నకు బ్రకాశం బిచ్చునాథుఁ డనుచు
నది దానె తా నని యాత్మలో నెఱుఁగుము
సుఖదుఃఖములు లేని సుఖకరంబు
యేపార నీచూపు లేయెడ లీనమౌ
నది పరబ్రహ్మమంచనుచు నీదు

తే. స్వానుభవమున జూడుము సరవితోడ
నదియె దృశ్యంబు నగుచుండు నెలమినందు
లోన తానుండి తన్ను దా గానుపించఁ
డట్టి వస్తువు పరమాత్మ యనియెఱుంగు. 49

క. భావింప జ్ఞాన మనియెడి
యావరణము లేదు యచట నహమన్నది లే

దావిమల స్వస్వరూపము
నీవెఱుఁగుము నిత్యసౌఖ్యనిరసనమగుచున్. 50

ఆ. ఏది మనసెఱుంగు నెలమి మిథ్యారూప
మనుచు విడువు మదియు నాత్మగాదు
తలపు మరపు లేని తానె తానైయుండు
ద్వైతమనెడివెఱ్ఱి దలఁగు మనఘ. 51

ఆ. పట్టువిడుపు లేక పరగ శీతోష్ణముల్
గాక స్థూలసూక్ష్మకరముగాక
రాక పోక లేక వీకతో చెడిపోక
యున్నయదియె యాత్మ సన్నుతాత్మ. 52

క. చేయఁడు నొకక్రియ తానును
చేయించఁడు నొకరిచేత చేతోచిత్తో
పాయములు గావు భోగము
నాయతభోగ్యమును గాదు నాత్మకు నెపుడున్. 53

క. ఆయహము నచటలీనం
బాయసునది జ్ఞప్తిరూప మది తా తానౌ
నేయనువున నిట్టిది యని
సోయగమున చెప్పవచ్చు చోద్యము సుమ్మీ. 54

తే. ఆద్యమునుగాదు నియమకర్తాప్తిగాదు
వ్యాప్తమునుగాదు వ్యాపకం బరయగాదు
చంచలముగాదు నీప్రపంచమున కవ్య
తీతమై యుండు యది నీవు తెలిసిచూడ. 55

తే. అదియు సర్వంబు తానయై యలరుచుండు
నచట నేయుక్తులకు తావు నఱయ లేదు

సకలయుక్తులు నచ్చట సడలిపోవు
నదియ నీజోడు నీనిజంబైనరూపు. 56

వ. అదియ హేతుదృష్టాంతవర్జితంబులై యనుపమానంద సుఖఫలితంబై ద్వైతాద్వైతరహితంబై నపరమతత్త్వంబు. వేదశాస్త్రంబులవల్లను నభ్యాసయోగంబులవల్లను ప్రాప్తిగానేరదు అది నీస్వానుభవంబున సిద్ధించును. 57

తే. ఆపరబ్రహ్మ తాను మాటాడవలసె
నేని తనస్వస్వరూపంబు బూని పలుకు
గాకయుండిన తన స్వప్రకాశమందె
మగ్నమై యుండు వేఱొక్కమాటలేదు. 58

వ. అది తానె తానైన పరబ్రహ్మంబు ఎఱింగియెఱుంగన ట్లూరకుండుట నిశ్శబ్దో బ్రహ్మం బని చెప్పం బడు గావున. 59

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున భేదఖండపూర్వకమను సప్తమప్రకరణము.

---

## అ ష్ట మ ప్ర క ర ణ ము.

మ. పరమోత్కృష్టము నైనకేవలపరబ్రహ్మంబునం దైక్యమే,
వెరవొప్పన్ ఘటియించు నాకుఁ దెలియ న్విస్పష్టముం గా
సమ్యాదరవృత్తి న్వివరింపుమన్నఁ గురుఁ డంతన్ శిష్యునిం
జూచి సు, స్థిరబుద్ధి న్వినుము నీకుఁ జెప్పెద మహాచిత్రంబు
గా నంతయున్. 1

సీ. ఎంతపర్యంతంబు నెలమి జీవేశ్వరో
పాధిచైతన్యంబు బరఁగ లేదు

అంతపర్యంతంబు నాతత్పదత్వంప
దములకు భేదమై తనరియుండు
గాన సర్వోపాధికార్యకారణముల
కైక్యంబు నెఱుఁగంగ నగును లెస్స
తలఁప నాపరమతత్త్వంబును నదిస్వయ
మద్వైత మని తెలియంగవలయుఁ
తే. గాన నంతయు నీకు నేక్రమముతోడ
తెలియఁ జెప్పెద వినవయ్య తేటగాను
దీనివలనను నైక్యంబు తేటపడును
లాలితచరిత్ర విషయవల్లీలవిత్ర. 2

క. దండిగ నీశ్వరతనువున
జాండము జీవునిశరీర మగుపిండాండం
బొండొంటికి భేదము లే
కుండు మహాభూతకార్యమొక్కటి యగుటన్. 3

వ. ఇవి యతని స్థూలప్రపంచమహాభూతాధికారణం బని
యెఱుంగుము. 4

క. క్రమమున పిండబ్రహ్మాం
డము లరయఁగ కార్యకారణము లట్లగుటన్
సమకొని భేదము నాకా
ర్యము కారణములకు లేదు యదియొక టగుటన్. 5

క. ఏయెడ కారణము లే
దాయెడ కార్యంబు లేదు నటతంతుపట
న్యాయము స్వర్ణవిభూషణ
న్యాయంబులు గాన రెంటి కర లేదు సుమీ. 6

ఆ. పరఁగ సృష్ట్యవస్థ బ్రహ్మాండమునకును
బేర్మి జాగ్రతయును బిండమునకు
నరయ రెండు నైక్యమున బ్రసిద్ధముగాదె
గాన భేద మనుట గాదు సుమ్ము. 7

క. తనరఁగ జాగ్రదవస్థకు
ఘనుఁడౌ విశ్వుండు సృష్టికర్త యగు విరిం
చనుని నిజాంశము గావున
ననయము నీయిద్ద ఱొకటి యగును గుణాఢ్యా! 8

తే. మొనసి బీజాంకురన్యాయమునను జూడ
నరయ నీశ్వరు లింగదేహంబు సకల
జీవలింగశరీరసద్భావములను
జెలఁగు నటుగాన నైక్యంబు సిద్ధమనఘ. 9

ఉ. మానుగ తప్తలోహమున మాటికి గ్రమ్మెడి విస్ఫులింగ
సం,తానము గంగలోపల నుదగ్రత బుట్టు కరళ్లు భిన్న
ముం, గాని విధంబున న్నొకటి గావున జీవుని లింగదేహ
ముఁ, ధీనుత యీశ్వరాంశ యని తెల్విగఁ జూడుము
నాత్మలోపలన్. 10

చ. అరయ హిరణ్యగర్భుని నిజాంశము జీవుని లింగదేహమం
దరుదుగ గూడగా గలిగె నాత్మకుదుస్తరగర్భవాసనల్
బరఁగ హిరణ్యగర్భపరిపాలన వృత్తినిజాంశజీవస, త్పురు
షుని స్వప్నమై యలరు పొందుగ రెంటికి లేదు భేదముల్.

తే. పూని స్థితిపాలనము కభిమాని విష్ణుఁ
డైన యాలింగదేహాభిమాని తైజ

సుండు నీయిద్దఱకు నాత్మ సొరదిఁ జూడ
నైక్య మగుగాని భేదంబు అచట లేదు. 12

తే. ఘనసుషుప్తికి సంహారకర్త యగుచు
నలరు రుద్రాంశమే ప్రాజ్ఞుఁడై చెలంగు
నరయ నీరెంటికిని తమోహంకృతగుట
నైక్య మగు భేదమందు లేదని యెఱుంగు. 13

తే. అరయ నీశ్వరు నిజశక్తి యైనయట్టి
యామహామాయకును జీవునందు గలిగి
వెల్గు నజ్ఞానమునకును తెలియ భేద
మనెడి వారలు మూఢులు అనఘచరిత. 14

క. అంబుజభవాండమునకు ని
జంబుగ నీశ్వరునిసర్వసాక్షిత్వము తు
ర్యం బటుగావున భేదమ
నంబడ దవి రెంటికిని మనంబున జూడన్. 15

క. కావున జీవేశ్వరులకు
భావింప నుపాధిధర్మపద్ధతు లగుచో
పైవ వెలయఁగ భేదం బని
యేవిధమున బలుకవచ్చు నీరెంటికొగిన్. 16

వ. అనిన శిష్యుం డిట్లనియె. 17

సీ. వినవయ్య నాస్వామి వేదశాస్త్రంబులు
నరయ నానాశాఖ లగుచు భేద
మే సత్యమై చెప్పు వాని జూడఁగ నస
త్యం బది యనుచు నె ట్లనఁగవచ్చు

నిర్ణయంబుగ ద్వాసువర్ణసంయోజ్య శా
ఖాయాం యటంచును కరముదనర
శ్రుతిజెప్పు భేదోక్తి గతి యిదేలాగున
నప్రమాణంబు సేయంగ వచ్చు

తే. ననిన విని శ్రీగురుం డాదరాత్ముఁ డగుచు
నన్న రావోయి నీకు నే నంతవట్టు
తెలియఁ జెప్పెద నిది నీవు దెలుసుకొమ్ము
అనుచు శిష్యుని జూచి యి ట్లనియెఁ బ్రీతి. 18

తే. పూని యీశ్రుతివాక్యంబు పూర్వపక్ష
మే ప్రతిష్ఠించుదాని సన్మేధతోడ
నేతిముఖమున బోఁగొట్టి నిర్గుణంబు
జెలఁగి సిద్ధాంతమున బ్రతిష్ఠించవలయు. 19

చ. వలనుగ వేదశాస్త్రము లవశ్యము భేద మటంచుఁ జెప్పి ని
శ్చలముగ పిమ్మట న్నుపనిషద్వచనంబులు నిశ్చయంబుగాఁ
బలుకును గాన నీశ్రుతిని బల్కిన వాక్యము పూర్వపక్షమం
చెలమి నెఱుంగు మీవిషయ మెంచఁగ ద్వైతము భేద
వాదమున్. 20

వ. కావున నీభేదం బైనవిషయంబులు మనంబున బెట్ట
వలదు ఇట్లగుటంజేసి మహాత్ములు ఏకమేవాద్వితీయం
బ్రహ్మం బని భేదంబు భిన్నంబుచేసి విడిచి రది గావున
భేదవాదుల మతంబులు అభావంబులని విడిచి పెట్టుము
ఇంకొకవాక్యంబు చెప్పెద వినుము. 21

సీ. అత్యద్భుతంబును నతికౌతుకంబుగా
నెఱిఁగింతు వినవయ్య యిద్ధచరిత

ఘనవిరాట్టు హిరణ్యగర్భులు స్థూలసూ
క్ష్మంబులు నుత్పత్తి సుస్థితులును
వెలయ జాగ్రత్స్వప్నములు నాదిగా నివి
కార్య కారణము లై కరము దనరు
పరగు పిండాండంబు బ్రహ్మాండమగును బ్ర
హ్మాండంబు పిండాండమై చెలంగు
తే. సృష్టిజాగ్రదవస్థ సంస్థియె స్వప్న
కరము నటుగాన నివి కార్య కారణములు
ఇన్నిటికి నైక్యమేయగు నెంచిచూడ
తెలియఁ గనుగొను సంశయస్థితులు వదలి. 22

వ. అనిన శిష్యుం డి ట్లనియె. 23

క. మును స్వప్నము జాగ్రదా్వ
సన యని జెప్పితిరి యిపుడు స్వప్నంబును కా
రణ మని జాగ్రతకార్యం
బని వలికితి రిదియు నాకు నానతి యీవే. 24

వ. కార్యంబు వలన కారణం బేలాగున నగు ననిన శ్రీగురుం
డి ట్లనియె. 25

మ. అరయన్ స్వప్నమునందు రూపము మనోవ్యాపారవృత్తిన్
సమస్థిరమై యుండఁగఁ జేయు స్వప్న మదియే జేల్వొందు
తన్మానసం, బరుదారన్వెలి దోచి బాహ్యవిషయవ్యాప్తిన్
హృషీకంబుల, న్నిరవై యుండుటఁ జేసి జాగ్రతయు నై
నేపారు వీక్షింపఁగన్. 26

క. కావున స్వప్నము కారణ
మై వెలయును జాగ్రతయును నందుకు కార్యం

బై వర్తిలు నీరెంటికి
వావిరి భేద మని చెప్పవలవదు సుమ్మీ. 27

క. మును చెప్పితి గద తైజసుఁ
డును విష్ణునియంశ విశ్వుఁడును బ్రహ్మాంశుం
డని జనకసుత న్యాయం
బున రెంటికి నైక్యమగును పుణ్యవిచారా! 28

తే. రమణ నవ్యాకృతమన హిరణ్యగర్భ
మనఁగ నజ్ఞాన మనఁగ లింగాంగ మనఁగ
నిన్ని వటబీజమున వృక్ష మున్నయట్లు
కార్యకారణరూపమై కరము దనరు. 29

వ. కావున మాయావిద్యలకు హిరణ్యగర్భలింగదేహంబులకు
పరస్పరైక్యంబు స్వభావంబై యుండు. 30

క. ప్రళయసుషుప్తులు కారణ
ములు స్థితిస్వప్నములు కార్యములు ఈరెండున్
వెలయఁగ నైక్యము లగుటకు
వలవదు సందేహ మిచె యవశ్యముఁ జూడన్. 31

చ. తనరఁగ విష్ణునందుగల తైజసవృత్తియు బ్రహ్మయందు గ
ల్గిన యల విశ్వవృత్తియును కేవల రుద్రునియందు గల్గి వ
ర్ధనమగు ప్రాజ్ఞవృత్తియును రాజససాత్త్వికముం దలంపఁగా
ననఘచరిత్ర తామస ఘనాహమునందు నణంగునిచ్చలున్.

క. తనరిన నవ్యాకృతమం
దొనరఁగ నజ్ఞానవృత్తి నొప్పు మహామా
యను గలిగి యాత్మజ్ఞానం
బను వృత్తికి నైక్యమగును ననఘచరిత్రా! 33

ఆ. ప్రళయమే సుషుప్తి పరికింపఁగా సర్వ
సాక్షి తుర్యమగు నిజంబుగాగ
కార్యకారణములు కావున వీటికి
నైక్యమగును సిద్ధ మరసిచూడ. 34

క. వెలయఁగ ప్రాజ్ఞుఁడు రుద్రుం
డల యీశ్వరుఁ డైనప్రత్యగాత్మవలన ని
మ్ముల నుదయించిరి గావున
కలుగును నైక్యంబు సార్వకాలమునందున్. 35

వ. అని చెప్పి యింతవట్టునుం దెలియక ముక్తిఁబొందెద మనెడి
వారి మాటలు యెద నమ్మినవార లుమ్మెత్తకాయలు దిన్న
వారలు గావున నట్టి మందమతులచేత నుపదేశం బైన
వారలు సంసారం బేలాగున నిరసించుదురు అదిగావున
జ్ఞానదృష్టిచేత వస్తువు నపరోక్షమందు చూపలేని గురు
వుల గోష్ఠివిడచి నానామతంబు లైనదుర్మార్గమతంబులు
ఖండించి కారణగురుం డైనమహాత్మునిం జేరి వారి యను
గ్రహంబున సంసారంబు తరియించుటకు సందేహంబు లేదు
గావున. 36

మ. అనఘుం డార్యుఁడు పండితోత్తముఁడు వేదాంతార్థ
విద్యావిశో, ధనుఁడుర్జ శాంతుఁడు నిర్జితేంద్రియుఁడు
నద్వైతప్రభావుండు శో,భనచారిత్రుఁడు ముక్తుఁ డాశ్రి
తకృపాపారీణుఁ డై యొప్పు నా,ఘనునిం గారణదేశికుం
గొలిచినం గైవల్యముం జేకుటన్. 37

తే. సకలవేదాంతవిద్యార్థసారములను
నరసి యొజిఁగించు గురుఁడు మహాత్ముఁ డనుచు

జేరి వారల కతిభక్తిసేయవలయు
ఘనచతుర్విధ శుశ్రూష లనఘచరిత. 38

వ. ఆగురుం డెటువంటివా డనిన సంసారవ్యతిరిక్తుం డై జ్ఞాన
వైరాగ్యంబులచేత నున్మత్తుఁడై కామక్రోధాద్యరిషడ్వర్గం
బుల జయించి బ్రహ్మానుభావానందరసంబున నానందింపుచు
సంసారభయభ్రాంతులై తనపాదంబులే గతి యని చేరిన
వారలను సిద్ధాంతదీపంబున తమోవిశేషంబు నివారణంబు
చేసి రక్షింతు రని చెప్పి మఱియును. 39

క. కావున వారలు జెప్పిన
యా వేదాంతార్థసార మది యెవ్వరు సం
భావించి వివేకంబున
ప్రావీణ్యత వినిన ముక్తిపదులగుదు రొగిన్. 40

క. ఈసుజ్ఞానాంబరములు
భాసురముగ ముక్తివనితగట్టి రమింప
న్నీసుజనుఁడు వైరాగ్యా
యాసమున గృహింపఁగలఁడు అనవరతంబున్. 41

సీ. మునుకొని వేదాంతముల ముక్తిఁ గలదని
చెప్పని దుర్మార్గశీలమతుల
నెవ్వరిలోనైన నెంచయోగ్యులుగారు
మరణాంతమున ముక్తి దొరకు ననుచు
జెప్పెడివారలఁ జేరికొల్పెడివారు
మనుజులుగారు దుర్జనులుసుమ్ము
ఈస్థూలదేహంబు ఇలబడ్డ పిమ్మట
మనుజుఁడై పుట్టునం చనెడివారి

తే. పలుకు లెదనమ్మువారలు పామరులును
అట్టివారలు గురువుల మనుచు మెల్ల
చేరి పాషండమతములు జెప్పుచుండ్రు
వారి పలుకుల నొల్లరు సూరిజనులు. 42

క. మానుగ పరతత్త్వాఖం
డానంద బ్రహ్మరసము ననవరతంబుౕ
గా బూనుకొని యనుభవింతురు
ధీమతులై పరమగురుఁడు దెలిపినకతనన్. 43

క. సతతము బ్రహ్మానందా
మృతరసముౕ స్వీకరించి మేధాభరణుల్
ఇతరమగు తుచ్ఛవృత్తికి
మతిసారఁగు వివేకశీలవంతులు నగుటన్. 44

వ. అది గావున సకలపాషండమతంబులు ఖండనంబుగావించి ముక్తికరతలామలకంబు సేయుటంజేసి వేదాంతసారం బయినయీగ్రంథంబు వివేకసింధువని చెప్పంబడు దీనివల్లఁ బ్రారబ్ధభవసంచయంబులు నాశంబగు వినాశం బయిన ముక్తుం డగు మఱియును. 45

అని యిబ్భంగిపరాత్పరుండు నిజబ్రహ్మాణ్యుండు విద్యా ...శా, ఖనివేదాంతవిచారశీలుఁడు వివేకత్రాణపారీణుఁడు, ...విసౌఖ్యావహుఁ డాశ్రితావనుఁడు సన్మాన్యుండు విజ్ఞా దూ... నట్టి ముకుందమౌని తెలిపెౕ దా ధర్మయు ...లై. 46

తే. ...ఘుండు బ్రహ్మవిద్యావిశారదుఁడును
...జ్ఞానవైరాగ్యైకసారమూర్తి

వేదవేదాంతార్థవేసి పురాణేతి
హాసనానాశాస్త్రభాసురార్థ
మర్మభేదనశాలి మహనీయశేముషీ
కలితుండు పరతత్త్వకారణుండు
మానితనిత్యసమాధియుక్తుఁడు సర్వ
సముఁడు పరాత్పరస్వానుభవుఁడు

తే. నగు ముకుందమునీశ్వరుఁ డాగమాంత
సరణి గురుశిష్యసంవాద సంజ్ఞతోడఁ
దెలిపె నటుగాన శ్రోత్రియధీగరిష్ఠు
లైనవారలు వినరయ్య యాదరమున.

సీ. అనఘాత్ములార మీ రానందముగ నిది
వినవలె నెంత లేదనక భక్తి
నితరభాషలచేత నెలమిజెప్పినవృద్ధ
బాలుర కిది తేటపడ దటంచు
పనిబూని యిది యాంధ్రభాష రచించెను
వలనొప్ప నుపనిషద్వాక్యసరణి
క్రమమొప్ప సోపానగతులునై చెలువొందు
నీయర్థమును జీవు లేలదెలియ

తే. రేల చూడరు సంశయం బేలవిడువ
రాత్మ సంధాన సుజ్ఞాన మందరాదె
యొలమి తంగేటిచెట్టున గలుగు తేనె
గాన కడవులఁ దిరుగు వెంగళులుబోలె.

వ. ఇతరమార్గంబుల సంచరించుచు వివేకవిహీనులై

ణంబుల నొందుచుండు రని చెప్పి ముకుందమునీంద్రుండు
మఱియు ని ట్లనియె. 49

క. ధీరత నీవేదాంతవి
చారము దెన్నఁగునను వాక్యసరణిగ నతివి
స్తారముగఁ దెలియఁ బలికితి
నారయ నివి వెఱ్ఱిమాట లైనను వినుఁడీ. 50

శా. నామాట ల్వినవెఱ్ఱిమాటలయిన న్నవ్యస్ఫురద్బ్రహ్మవి
ద్యామాహాత్మ్యము గల్గి సంతతము బ్రహ్మానందధారాళధా
రామూలంబునఁగ్రాలఁగాఁగలుగునత్యాశ్చర్యమౌగాని యీ
సామర్థ్యం బిది యేల సేసెదరు నిస్సారంబు విద్వద్ఘనుల్.

తే. చెఱకు నల్లనైన చెఱకులోపలిరసం
బరయ తియ్యనగుచు నలరుభంగి
నలర వెఱ్ఱిమాట లైనను సువివేక
పటిమ వెలుఁగుచుండు భవ్యమగుచు. 52

సీ. నయమైనశృంగార నవరసకావ్యముల్
పరికింప వాగ్విడంబము లెకాని
యాత్మలాభంబు లేదటుగాన నెఱుకవం
తులుగాని యొల్లరు తెలిసిచూడ
నాకావ్యములు సార్థమని చూచువారికి
పరమార్థలాభసంపదలు మిగుల
దూరమై యుండును వారల కిల నెటు
వలెనన్న చండాలవాటియందు

తే. సొరిది మధురాన్నమైనశిష్టులు భుజింప
నొల్ల రటుగాన తత్కథ లెల్ల ప్రకృతి

జనులకే కాక పరమార్థసాధకులకు
హితవు బుట్టదు తుచ్ఛవైకృతులు నగుట. 53

ఉ. కావున సంస్కృతింబొరఁగి గారవమొప్పఁగ స్వస్వరూపతే
జోవిమలాత్ములై సుఖము చూఱలు గొంచు మహానురా
గులై, వావిరినుండరాదనెడివారికి నేల రుచించు కర్మసం
భావితులైనవారలకు భవ్యపదార్థవిచారసంపదల్. 54

క. ఎవ్వరి కేవస్తువు ప్రియ
మవ్వస్తువు వారలకును నతిరమ్యంబై
నివ్వటిలుగాక కర్ముల
కివ్వాక్యంబులు రుచింప వెన్నఁటికైనన్. 55

వ. అది గావున జడులకు నగమ్యంబై యుండు నిట్టి పరమార్థ
సాధనోపాయంబులైనవాక్యంబులచేత శ్రీచంద్రమహాళి
నాహృదయంబున నెలవుకొని నాచేత నీగ్రంథంబు రచి
యింపించె నిట్టి వేదశాస్త్రంబుల ముదితార్థంబులు నాంధ్ర
భాషరచియించిన పరమార్థలాభహేతువైన నీగ్రంథంబు
వివేకులైన చతురు లేల నొల్లరది గావున. 56

తే. మంటిలోపలనుండిన మానికంబు
లప్రయాసంబునను చేతికబ్బెనేని
యేల జతనము సేయరు యెంచిచూడ
గాన సువివేకు లిట ప్రీతి గాంతురెలమి. 57

సీ. జయచంద్రమహాళి నీస్వస్వరూప మెఱుంగ
నలవిగా దబ్జగర్భాదులకును
విశ్వజీవనుఁడవు శాశ్వతబ్రహ్మవు
విశ్వరూపుఁడవు వికారరహిత(?)

మైన స్వయంప్రకాశాత్ముఁడ వాత్మసం
వేద్యుండ వాద్యంతరహితుఁ డవును
నిర్గుణనిరవద్య నిరుపమ నిస్సంగ
నిత్యనిరంజన నిర్మలుఁడవు
తే. సుఖములకునెల్ల సుఖము నై సుస్వరూప
మైన షడ్భావరహితుఁడ వైననీవు
నను గృపాదృష్టిచేఁ జూచి యెనసి ప్రోవు
నతహృదయరూప సచ్చిదానందరూప. 58

చ. క్రమమున మీయనుగ్రహము గల్గినవారికి జ్ఞానసంపదల్
సమకొని హస్తసంగతము చయ్యననా భవదీయసుస్వరూ
పము నిరతంబుగాంచి సుఖభావమునొందుదు రట్లుగాననా
విమలహృదంతరాళమున వింతగ నిల్పితి గాదెసత్కృపన్.

వ. నాహృదయంబున నిల్పి వేరై సుస్థిరంబు లైన చతుర్విధ వాక్యంబుల నెచ్చరించి స్వస్వరూపంబు నాచేత పరిశీలించిన నాస్వామివి నీవే యని ప్రార్థించెదనని మఱియు నిట్లనియె. 60

క. గురుఁ డెట్టివాఁ డటన్నను
పరతత్త్వబ్రహ్మసౌఖ్యభావమున నిరం
తరము ప్రవేశించిన స
త్పురుషుఁడు సద్గురుఁడు గాదె పుణ్యచరిత్రా! 61

క. వారలకు విషయచేష్టలు
దూరంబై యుండు హర్షదుఃఖంబులు లే
వారయ చిత్తము చాంచ
ల్యారూఢత నొందకుండు ననవరతంబున్. 62

తే. తలఁప బ్రహ్మపిపీలికాంతరము భూత
వారములయందు విషయభావంబు లేదు
రూఢి తా నొక్కఁడను నీశ్వరుం డొకండు
ననెడు ద్వైతంబు భావమం దరయ లేదు. 63

వ. ప్రపంచంబు సకలంబును పరమాత్మస్వరూపంబనుచు బ్రహ్మా నందంబున మగ్నులై యుందురు వారలు సకల కర్మనిర్ము క్తులు సంకల్పరహితులు సర్వసములు నై యుందురు వారు కర్మంబు లాచరించినను తమ నిజస్వరూపస్థితి యెన్నం డును మరువరు. 64

సీ. అనయంబు సకలేంద్రియద్వారములయందు
స్వస్వరూపానందసౌఖ్యమందు
విధినిషేధము లేక విధినిషేధంబులు
నాత్మయం దైక్యంబు నమరఁజేసి
వలనొప్ప నింద్రియవ్యాపారముల నున్న
నైన నకర్తవ్యు లగుచు నిలిచి
యాశ్చర్యకరమైన యాత్మసుజ్ఞానయో
గంబున ముక్తిసంగతులు నగుచు

తే. ఘనయవస్థాత్రయంబుల కరము మీఱి
సర్వసాక్షిస్వరూపులై సంతతంబు
బ్రహ్మసాక్షాత్కృతధ్యానపటిమ దవరు
వారిచే జ్ఞాన మెఱుఁగంగవలె నిజంబు. 65

తే. పూని పరమామృతానందపూర్ణు లగుచు
మానితామాన ముక్తిసంధాను లగుచు

సంగమెఱుఁగని పరమాంతరంగు లగుచు
సౌఖ్యమున నుండువారలు సద్గురువులు. 66

వ. తలఁపుమరపు స్వరూపానుసంధానంబు మొదలగు నిమిత్తం
బులు లేక నిమిషార్ధంబేనియు నితరవ్యాపారంబుల నొం
దక నీశ్వరావతారులై యుండునట్టివారు మహాత్ములైన
యోగీంద్రులు వారలు కారణగురువు లని చెప్పి శిష్య
లక్షణం బెఱింగింతు విను మని యిట్లనియె. 67

సీ. గురుభక్తివంచక క్రూరవిద్యాచోర
పాషండ మదగర్వభావులకును
పతితవాఙ్మార్గారపతితహాస్యకృతఘ్న
కుజనపాతక మత్తకూహకులకు
చారణమారణోచ్చాటనస్తంభన
వశ్యమోహనమంత్రవాదులకును
ఆలస్యకర్మతాహంకారనాస్తికా
జ్ఞానచోరకదుర్విచారులకును

తే. మున్నె సభలను తనమహామహిమ ప్రకట
నంబు గావలె నని గురునాథుతోడ
కొసరి యాక్షేపమొనరించి కోపగించు
నట్టిశిష్యున కీయరా దాత్మవిద్య. 68

తే. గురుని ప్రాకృతదృష్టి గన్గొనుచు మాటి
మాటికిని చేరి వర్తించుమందునకును
అంతరంగంబుసిద్ధి లేనట్టివాని
కాత్మవిద్య యొసంగరా దరసిచూడ. 69

వ. ఇట్టివారలకు బ్రహ్మోపదేశంబు జేసిన ఫలింపనేరదని చెప్పి యింక గురుపుత్రుం డైన సచ్ఛిష్యుని తెఱంగెఱింగింతు విను మని యిట్లనియె. 70

తే. ఘోరసంసారబాధలఁ గుందికుంది
సరవి మునుజెప్పు శిష్యదోషములు లేక
జ్ఞానవైరాగ్యయుక్తుఁడై సమతగాంచు
నట్టిశిష్యుండు గురుపుత్రుఁ డరసిచూడ. 71

క. గురుభక్తులు శుద్ధాంతః
కరణులు వైరాగ్యపరులు ఘనవితరణులున్
గురుదైవములకు భేదము
పరికింపరు నిశ్చలస్వభావవివేకుల్. 72

ఆ. సాధుగుణులు నిత్యసంతోషచిత్తులు
గురుఁడె దైవమనుచుఁ గొలుచువారు
సంశయంబులేనిసత్యవాదులు దృఢ
వ్రతులు విషయరాగవర్జితులును. 73

క. అనయము గురువులవలనను
ధనవంచన మెఱుఁగనట్టిధన్యులు శిష్యుల్
వినుతాత్మబోధ కర్హులు
మునుకొని జ్ఞానోపదేశములు జేయఁదగున్. 74

వ. అట్టిశిష్యులు బ్రహ్మజ్ఞానస్వరూపం బైనయాత్మావలోకంబునం దాసక్తులై యుండుదు రట్టివారలకు గురుండు బోధింపవలయు. 75

చ. పరుసమునోకి లోహములుపన్నుగఁగాంచన మైనయట్లు శ్రీ
గురువుల సన్నిధానమున గొబ్బున బొందును స్వస్వరూ

పము, న్నరయఁగ నట్టిశిష్యులకు నాత్మవివేకముఁ దెల్పి
శీఘ్రమే, పరువడి స్వప్రకాశ మగుపాత్రులు గావున
నిచ్చుటొప్పగున్. 76

వ. వారలకు బ్రహ్మోపదేశంబు సేయం బ్రయాసంబు లేదు
గావున. 77

క. వారు ముముక్షులు గావున
కూరిమి తమవారి జేసికొని సద్గురువుల్
వారక రక్షింపఁగవలె
చేరిక నుపదేశమిచ్చి శీఘ్రత మెఱయన్. 78

వ. అది యెట్లనిన. 79

సీ. సతతంబు మంత్రాదిసాధనోపాయంబు
పరమయోగాభ్యాస పరికరంబు
అష్టాంగయోగ నిష్టాభ్యాసమును మొదల్
సేయింపఁగా వారి చిత్తవృత్తి
యతివిమలం బగు నది లేనిపక్షాన
గురుసేవ లెస్సగా గురువుతోడ
చేయించఁదగు వారు చేయు నాక్షణమందె
చిత్తంబు నిర్మలస్థితి దనర్చు

తే. పరమసుజ్ఞానపరతయు ప్రాప్తమగును
కాన పరుసంబు దనసన్నిధానమునను
అష్టలోహంబులును పైడియైన భంగి
గురునికృప స్వస్వరూపమై కొమరుమిగులు. 80

శా. వైరాగ్యం బనువహ్నిలో నిబిడమై వర్తిల్లు నజ్ఞానము
న్నారూఢస్థితి వేల్చి మందగుణతామాద్యంతముంబాపిన

సారోదార నివారణక్రమము నై సంధిల్లువిజ్ఞానముల్
కారుణ్యంబున నిత్తు రాశ్రితులకుం గల్యాణసంధాత లై.

సీ. అట్టిశ్రీగురునకు నరయంగ పరుసము
సరిగా దదెట్లన్న సకలలోహ
ములు సోఁకి వెలయంగ బంగారమౌగాని
పరుసమౌనటులఁ జేయంగనేర
దట్లగుటను నిజశిష్యులకును గురుఁ
డాత్మస్వరూపమై యలరునట్టి
తద్రూపమౌనట్లు తగఁ జేయువారలు
బ్రహ్మస్వరూపసంభావ్యు లగుట
తే. నచ్చెరువుగాన పరుసము నట్టిగురుని
తోడ సరిగాక పోయెను తొడరిచూడ
తల్లిదండ్రులు సంసారదాయకులును
నగుట శ్రీగురునితో సరి యనఁగరాదు. 82

వ. వారలు సద్గురువులంబోలి సంసారబంధంబు ఛేదించి
రక్షింపనేరరు గావున. 83

ఆ. అరయఁగల్పవృక్ష మది సరి యంటివా
కల్పితార్థ మొసఁగుఁ గాన గురుని
యటుల కల్పరహితమైన తద్రూపంబు
నియ్య లేదు గాన నీడుగాదు. 84

తే. చెలఁగి చింతామణిని సరిసేతు మనిన
నెలమి చింతించినదె గాని యితరమీయఁ
డాతఁ డిచ్చును చింతనాతీతవస్తు
వదియు నటుగాన సమము సేయంగరాదు. 85

క. ఆరూఢి గామధేనువు
గూరిమి సరిసేతుమనిన గోరినకోర్కుల్
వారక యిచ్చును సద్గురుఁ
డారయ గోరనిపదార్థ మదియొసఁగుజుమీ. 86

వ. కావున కామధేనువునుం గురునితోడ సమంబుగాదు. 87

చ. అతఁడు కృపాప్రసాదమున నందఱి నొక్కసమంబుగాగ సం
తతముఁ బరోపకారనిరతస్ఫుటబుద్ధినిజూచు చూచినన్
అతిశయమొప్ప పాత్రు లగునట్టియెడన్ దయసేయుఁగాన
దు, ర్మతులకు బ్రహ్మవిద్య నిజమర్మ మొసంగఁడు పాత్రులం
జూగిన్. 83

మ. సమతన్ మేఘుఁడు వారిధారలు మహిన్ సంప్రీతి వర్షింపఁ
బ, ల్లములై యుండినచోట నీరు నిలుచున్ లక్షింపఁగా
బండపై, దునుకు న్నీరము నిల్వ ద ట్లగుట నందుంబాత్ర
మూహించి యు, త్తమునందుం దగ బ్రహ్మవిద్య నిలుపం
ధర్మంబు జింతింపఁగన్. 98

క. పంబిన బ్రహ్మజ్ఞాన ర
సంబులు సత్పాత్రులందు సమకొని నిలుచున్
డాంబికులయందు నిలువదు
నింబద్రువమందు తీపె నిలువనిభంగిన్. 90

చ. అరయఁగ పుత్రుఁడు న్వతితుఁడై నమతం డ్రిధనంబు నర్హతం
బొరయఁడు శుద్ధుఁడై నమరి బొందును నిట్లగుటన్ గురుండు
స, ద్గురుఁడు ధనంబు బ్రహ్మమగు దుర్విషయంబుల బొందు
జీవుఁడున్, పరమపదార్థముం గొనఁగ బాధ్యుఁడు గాఁడు
తలంచిచూడఁగన్. 91

తే. అట్టిజీవుఁడు పరిశుద్ధుఁ డయ్యెనేని
పరమవిజ్ఞానధనము చేపట్ట నర్హుఁ
డనుచు వివరించి గురుభక్తి నాశ్రయించుఁ
డని ముకుందమునీంద్రుఁ డి ట్లానతిచ్చె. 92

వ. ఇట్లు గురుశిష్యలక్షణంబులు తేటపడం జెప్పి ముందరికథా
వృత్తాంతం బి ట్లని యానతిచ్చె. 93

క. తాపత్రయసంతప్తుం
డై పటుసాధనచతుష్టయమున బ్రవీణుం
డై పరమగురునికోమల
మౌపదముల కెఱఁగి శిష్యుఁ డతినమ్రుం డై. 94

వ. వినయ భయభక్తియుక్తుం డై యి ట్లనియె. 95

శా. అయ్యా! దుర్విషయాంబుపూరితము నై యాపజ్జల గ్రా
హామున్, సయ్యాటం బొనరించునట్టి ఘనసంసారాబ్ధిలోఁ
జిక్కి వే, ద్లోఁగియంగానక తాపబాడబశిఖాదోర్ధూయ
మానుండ నై, కుయ్యాలింపు మటంచు వేఁడెద ననుం
గూర్మిం గటాక్షింపవే. 96

క. జ్ఞానమను నావలోపల
మానుగ నన్నునిచి దర్వమహితకృపా సం
ధానంబు జేసి దుర్భర
మైనసముద్రము తరించునటు సేయఁగదే. 97

క. ఘోరభవారణ్యంబున
దారుణ తాపత్రయాగ్ని దరికొని కాల్పన్
ధీరతచెడి మీపదములు
చేరితి సుజ్ఞానపదము చెందింపఁగదే. 98

ఘనసంసార తమంబున
మునుకొని యజ్ఞాననిగళమున జిక్కితి మీ
యనుకంప యనెడిశస్త్రం
బున నది ఖండించి కూర్మి బ్రోవవె నన్నున్. 99

అని యనేకవిధంబులం బ్రార్థించి పునఃపునః ప్రణామంబు
లాచరించిన శ్రీగురుండు సదయాంతరంగుం డై యి
ట్లనియె. 100

అన్నా ! సంసారభయా
పన్నుఁడవై నొచ్చితనుచు భయహరముగ న
భ్యున్నతి నభయం బొసఁగుచు
మన్నించి కుతూహలమున మలయఁగఁ జేసెన్. 101

క్షణమున నీదుబంధనము జారఁగఁజేసెద సావధాననై, ప్రణి
గలిగుండుమంచు గురుపుణ్యచరిత్రుఁడు శిష్యరాట్శిఖా,మ
ణిని సమీపమందునిచి మన్ననతోడఁబ్రతిజ్ఞఁజేసి చ,య్యన
నటు హస్తమస్తకసమైక్యము జేయుచుఁ గూర్మితోడుతన్.

ఇట్లు హస్తమస్తకసంయోగంబు గావించి గురుసాంప్రదా
యప్రకారంబున శాంభవీముద్రావిధానంబున స్వస్వరూప
జ్ఞానంబుఁ దెలిపిన నంత జ్ఞానశక్తిఁ బ్రవేశించి శిష్యుని చైత
న్యంబున స్వయంబోధప్రకాశం బైన శరీరంబునందు కం
పంబు పొడమి పులకాంకురం బై చెమర్చి సాత్త్వికభావం
బున రాజయోగసామ్రాజ్యపట్టాభిషిక్తుం డై యుండె
నప్పుడు. 103

అప్పుడు ముక్తికాంతను రయంబున స్వానుభవంబునందు
దా, నొప్పుగఁ గాంచి నిశ్చయము నొందుచు సంసృతి భీతి

లేక యే, చొప్పున జూడ శిష్యుఁ డనుసుమ్మనువా యదితే
క యొక్కటై, కప్పిన సంశయభ్రమలు గల్గకయుండెను ని
శ్చలస్థితిన్. 104

వ. ఇట్లానందంబున పరవశుం డై యుండు సమయంబున. 105

సీ. అనువందస్వానుభవామృతనది నిండి
పరమదుర్వారమై పారుచుండ
నావివేకుం డనునావికుండు మునింగి
యనుగతి మమకార మనెడివృక్ష
మామూలముగఁ గూలె నందున్న తృష్ణాది
పక్షులు గూల్లను పడటగలసె
నింద్రియగ్రామంబులెల్ల విస్తీర్ణమై
యరవరలై కూలి వరదబోయె

తే. నట్టియెడ పరసుఖ మను హంసతూలి
కామనోహర శయ్యపై కరముముక్తి
కాంత యుపగూహనసుసౌఖ్యమున బొదలి
యుండె నా రాజయోగి నిత్యుండు నగుచు. 106

క. ఈగతి ముక్తివధూసం
యోగంబున సకలవిషయయుక్తముగ మనం
బాగడమై లయమయ్యెను
యోగవియోగములు లేక నొక్కఁడు నిలిచెన్. 107

చ. ఇటువలెస్వస్వరూపమున నేమియెఱుంగకయుండు టే తగఁ
పటుతర యోగనిద్ర యనిపల్కుదు రార్యులు నట్టిసౌఖ్యసం
ఘటనుఁడు రాజయోగి యవికల్పవికల్పవిహీనమైన యు
త్కటశివయోగరాజ్య పదగౌరవవృత్తిసుఖించెనయ్యెడన్.

క. భావింప నెఱుక మఱపులు
భావాభావములు లేక పరకాంతాసం
భావితుఁ డై సుఖయించెను
శైవమహాయోగ సౌఖ్యసామ్రాజ్యమునన్. 109

క. ఏకచ్ఛత్రంబుగ సు
శ్లోకుఁడు శివయోగపరమసుఖసామ్రాజ్య
శ్రీకలితుఁ డగుచు మోక్ష
శ్రీకరసంగ్రహణసుఖవశీకరుఁ డయ్యెన్. 110

సీ. అపుడు చిచ్ఛక్తి స్వర్గాదిభోగములను
వరుస దీపముల నివాళులీయ
సారూఢ మైన బ్రహ్మానందసుఖమున
పరవశుఁ డగుచు తత్పరమసుఖము
నెఱిఁగినవారలు ఎఱుఁగుదు రింతియ
యెఱుఁగనివారికి నెఱుఁగవశమె
మనమునఁదలఁప వాక్కునఁ జెప్పఁ గొలఁదిగా
దట్టిసౌఖ్యంబున నధివసించి

తే. పక్షి తనఱెక్కలను వియత్పథమునందు
నాడుచుండియు నాకాశ మంటనట్టు
లింద్రియాది మనోవ్యాప్తులెల్ల తనదు
ఆశ్రయంబున నుండియు నంటకుండు. 111

వ. అట్టి రాజయోగికి సకలంబును లభించునట్టి మహాత్ముని
వినుతింప బ్రహ్మాదులకు నలవిగాదని మఱియును. 102

తే. అటుల వివరించి శ్రీగురుం డాదరమున
శిష్యుఁ గముఁగొని యిఁక నొక్కచిత్రమైన

ప్రశ్న యొకింతు నదిసెప్ప పరమదుర్ల
భంబు వాఙ్మనములకు శక్యంబు గాదు. 113

వ. అయినను నీ కొకింతు విను మని శ్రీగురుం డిట్లనియె.

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమ మనుగురుశిష్యసంవాదమున స్వరూపనిరూపణ మను అష్టమప్రకరణము.



## నవమ ప్రకరణము.

ఉ. లాలితమూర్తి శ్రీగురుఁడు లాలనతో నిజశిష్యుఁ జూచి
యీ, మూలమునైన స్వానుభవమున్వివరించెద సావధాన
సం, శీలుఁడవై నిజానుభవసిద్ధి గనుంగొనుమంచు సత్కృ
పా, లోలతఁ జెప్పె నిట్లనుచులోగనుజూడ్కులఁ జూచు
చుండఁగన్. 1

ఉ. అప్పుడు స్వానుభూతియనునంగనతో కవగూడి తుర్యమం
దుప్పతిలెన్ మహాపురుషుఁ డుత్తమయోగికిలోచనంబు ల
న్విప్పినయంతమాత్రమున వేగమునంగరుణాప్రవృత్తులున్
గప్పినదైన స్వానుభవ గౌరవము న్విడనాడఁ డెప్పుడున్.

క. ఆసమయంబున నింద్రియ
భాసురవృత్తులు జనింప పరమానందో
ల్లాసంబు లగుచు మునుపటి
వాసనల న్విడిచి శుద్ధవాసన బొందున్. 3

ఉ. దూరమువైన మున్నడిచి దుర్గమభారము మోసివచ్చి యి
ల్చేరినయొద్దు పచ్చికభుజించి జలంబులు ద్రావి పండినన్, ధీ

రత లేవ లేనిగతి ద్రిమ్మరుతాపదవాగ్నితప్తమై, పారెడు
నింద్రియంబులును బ్రహ్మమునందు సుఖించునిచ్చలున్. 4

తే. భ్రమసి పూర్వ విశేషగుణములు మనముఁ
దెలియ కొకవేళలను బ్రవర్తించెనేని
యుముక విడిచిన బియ్యమై యుండుగాని
జాడ్యమును బొంది దుర్మార్గసరణిఁ బడదు. 5

వ. అని వివరించిన శిష్యుండు సంభ్రమాశ్చర్యచిత్తుం డై యి
ట్లని స్తుతియించె. 6

సీ. జయ నిర్మలాకార జయ భక్తమందార
జయ నిర్వికార సంశయవిదూర
జయ సత్కృపాలోల జయ పుణ్యసంశీల
జయ సత్యఖేల దుర్జనవిఫాల
జయ ఘోరభవనాశ జయ సర్వలోకేశ
జయ చిదాకాశ శశ్వత్ప్రకాశ
జయ సచ్చిదానంద జయ పావనముకుంద
జయ సదానంద సుజ్ఞానకంద

తే. జయ శివస్వాంతమానిహృత్సన్నిశాంత
జయ సుధాలాప పరమహంసస్వరూప
జయ సముల్లాస మోక్షయోషావిలాస
జయతు గురురాయ భక్తసజ్జనవిధేయ. 7

వ. అని స్తుతియించి యిట్లనియె. 8

మ. బహుకాలంబుననుండి జీవుఁడును నై భాసిల్లు నారూప
ముక్, మహనీయోజ్జ్వల బోధచే దెలిపి సన్మానంబునుం
బాపి ని, స్పృహావృత్తి న్నను నేనె దొంగిలిన లోదృష్టి

న్ననుం జూపినన్, మహితుం జేసిన మీకృపన్నిదిగో ప్రేమ
న్బ్రహ్మముం గాంచితిన్. 9

వ. అట్టి పరమసుఖంబు నాకు బ్రసాదించి రక్షించితిరి గావున
నిందుకు బ్రత్యుపకారంబుగా నర్థంబు నిచ్చెద ననిన సకల
లోకంబుల నున్న సమస్తవస్తువులును నాశంబునుం బొం
దునవి గావున నాశరహితం బగు బ్రహ్మంబునకు సమంబ
గునె కల్పతరువు నిచ్చినవారికిఁ దర్పణ ప్రతిఫలితం బైన
ముక్తాహారంబు నొసంగినభంగి చింతామణిరత్నంబు నొసం
గినవారికిఁ గాజుపూస యిచ్చినవిధం బగుంగావున ప్రత్యు
పకారంబు సేయ సమర్థుండ గా నని మఱియు ని ట్లనియె.10

సీ. ఆవరించిన మహాహంకారమంతయుఁ
జూచుమాత్రంబున సురిగిపోయె
పరమవా స్వస్వరూపప్రకాశుఁడనై తి
ఘనమైన మీ యనుగ్రహమువలన
జడుఁడనై పశువనై జరియించు ననుగురు
సింహాసనస్థుని జేయగంటి
ధనహీనుఁ డగుదరిద్రుని దెచ్చి పట్టాభి
షేకంబు జేసిన చెలువమయ్యె
తే. కాన నిటువంటి మీకు నే బూని యేమి
యియ్యఁగలవాఁడ నాచేత నేమి యగును
అయిన నాజీవధనములు నర్పణంబు
జేసి మ్రొక్కెద గురుమూర్తి చిత్తగింపు. 11

వ. అనిన శ్రీగురుం డి ట్లనియె. 12

క. శ్రీగురునిచేత శిష్యుఁడు
బాగుగ నుపదేశ మగుచు భక్తిసలుపఁడే
యాగడపు శిష్యుఁడరుగు న
ధోగతులకుఁ గాన భక్తి దొరకొనవలయున్. 13

క. తెగువను వినాశవంతము
లగు నుపచారములు పంచనాత్ముం డగుచున్
దగిలి యొనర్చిన గురునకు
జగతిని యటువంటిఖలుఁడు జనుదుర్గతికిన్. 14

వ. అనిన శిష్యుం డి ట్లనియె. 15

క. స్వామీ! మీమహిమలు నే
నేమని వర్ణింతు నాకు నీయజ్ఞానం
బాముకొన నొక్కనిమిషము
లోమాయము జేసితిరి విలోలతకరుణన్. 16

తే. తనరు సుజ్ఞాన మనునౌషధం బొసంగి
యరయ గురుభక్తి యనెడి పథ్యంబుబెట్టి
పూని భవరోగమెల్లను బోవఁజేసి
పరఁగ రక్షించితిరి కాన బ్రహ్మమైతి. 17

వ. కావున నీ మ్మహైశ్వర్యం బేమి యని చెప్పవచ్చు. 18

తే. చెలఁగి ప్రాణాపహారమున్ జేయునెడల
కాచిరక్షించి బ్రతికించు ఘనునకేమి
సలుప ప్రత్యుపకారంబు సమముగాదు
సేవఁ జేయుటదక్క సుస్థిరతఁ జూడ. 19

వ. అనిన శ్రీ గురుం డి ట్లనియె. 20

క. గురుకృప ఫలించినందుకు
గురుతొక్కటి గలదు పరమగురుభక్తి నిరం
తరము దినదినమునకు హె
చ్చిరి సుజ్ఞానియని యని వచింతురు ప్రాజ్ఞుల్. 21

మ. అరయ న్నింద్రమహేంద్రజాలమత సూయామంత్రజా
లంబుల, న్నిరవంద న్నుపదేశ మిచ్చుగురువుల్ యింటింట
నూరూర నుం,దురు సంసారపయోధి దాటువెరవు న్నా
ల్గాల్పఁగా జేయఁజా,లరు దుర్మార్గులు గాన సద్గురుఁడు
గల్గం డెల్లెడం జూచినన్. 22

వ. కావున పరబ్రహ్మసాక్షాత్కారంబుచేసి సంసారసముద్రంబు
దరియింపం జేయునట్టి సద్గురుండు గల్గుట దుర్లభం బట్టి సద్గు
రుండు జూచుమాత్రంబున సంసారజ్వరంబు పరిహారం బై
సుఖించు నని చెప్పిన శిష్యుం డి ట్లనియె. 23

క. కైవల్యధనము గలిగెను
గావున త్రిభువనములందు గలదైన్యదరి
ద్రావరణములును రుద్రు దృ
గావేశముచేత భస్మ మైనవిధమునన్. 24

క. అనువంద మీయనుగ్రహ
మున ఘనసంసారభయము మొదలంట నిక్కృం
తన మాచరించి యతిసుఖ
మున విహరింపంగఁ గలిగె మునినుతచరితా! 25

శా. స్వామీ! యీఘనసౌఖ్య మెప్పటికి నిస్సందేహమై నిల్చి ని
స్సీమాఖంగ సముద్రమై తొలఁగఁగా జేపట్టి రక్షింపవే
ప్రేమ న్నట్టిసుఖంబు నేనె యగుచుం బెంపొంది క్రీడిం

చెనఁగ, ఆమాహాత్మ్యము నాకుఁ దెల్పవె నిరాయాసంబునం
గాంచెదన్. 26

క. ప్రేమము సమ్యగ్జ్ఞానా
భామూలం బెఱుఁగుటకును నంతయు నాకు
న్నేమమున నెఱుఁగ జెప్పుము
శ్రీమహిత కృపాకటాక్ష శేఖరవృత్తిన్. 27

వ. అనిన శ్రీ గురుం డి ట్లనియె. 28

క. రావోయి పూర్ణచంద్రుఁడ
నీ వీ బంధనముబాసి నెగడిమహాసౌ
ఖ్యావహుఁడ వైతి వికన
న్నేవిధమున బొగడవచ్చు నిద్ధవిచారా! 29

చ. అరుదుగ నీవు నన్నడిగినట్టిది నీకెఱిఁగింతుభావ ము, స్థిర
ముగ సద్గురుప్రభుని సేవ నిరంతర మాచరించి నం, బర
మసుఖంబు నిత్యమగు బ్రహ్మము నీవయియుందు వెప్పు
డున్, బరువడ నీనిజానుభవ పాకమునం గనుగొమ్ము
వేడుకన్. 30

సీ. వినుమయ్య యయ్యనుభవముతో సరిలేదు
వాక్కున జెప్పంగ వశముగాదు
స్థూలసూక్ష్ములు రెండును జూడఁగా గాదు
కాలత్రయంబున గానరాదు
కడగి జాగ్రత్స్వప్న ఘనసుషుప్తులుగాదు
కీర్తింపఁగా గ్రియాక్రియలుగాదు
మఱియు నిర్మాణప్రమాణంబులును గాదు
నేను నీ వనుమాట నెఱయగాదు

తే. సుఖములకు నెల్ల సుఖమునై సొంపుమీఱు
కల్పితములెల్ల క్షణములో గాల్చివైచు
విషయసుఖముల నెల్లను వెడలఁదోలు
నట్టి వస్తువు బ్రహ్మ మయ్యదియె నీవు. 31

వ. అది స్వయంప్రకాశంబును బ్రహ్మానందంబును సుఖస్వరూపంబును నీశ్వరావతారంబును నఖండానందపరిపూర్ణంబును వేదాంతాతీతంబును నైనచిదాకారనిర్మలప్రకాశం బైనస్వస్వరూపంబు నెందేని స్వస్వరూపానుభవం బగు నయ్యనుభవంబున స్వస్వరూపప్రకాశం బై భవరోగనివారకం బైనపరమసుఖస్వరూపం బై జీవేశ్వరసమరసభావంబై మహావాక్యరసం బై యొప్పునదియే రాజయోగం బని చెప్పంబడునట్టి నిర్వికల్పసమాధిపరుం డైనయవధానవరునికి సకలవిషయంబులు విషం బై తోఁచు మఱియును.

ఉ. పన్నుగ దీనికొక్కటి యుపాయము చెప్పెద దీనికిన్ సము
త్పన్నమగున్ స్వరూపపదుపస్థితభావము గాన యిప్పుడే
మిన్నక మిథ్యయంచు నెలమిన్ విడువం దగునట్లుగాన ము
మ్మున్నుగ బుద్ధిలో విషయమోహవిరక్తి గ్రహింపఁగాదగున్.

సీ. అనయంబు చిత్తంబు నందు నానావిధ
కల్పనల్ బొడమక కట్టవలయు
సమత ననన్యభావమున నీశ్వరునాత్మ
చింతించి తగభక్తిఁ జేయవలయు
గురుపుత్త్రుఁ డైనసత్పురుషుఁడే కాంతిమై
గురుసేవహృద్వీధి గూర్పవలయు

నరయగుణాతీత మగుపరబ్రహ్మంబు
నందు నేకీభావ మందవలయు

తే. వాఁడు సంకల్పములు దన యాత్మలోన
బొడమినను వాని వెంబడిఁబోక తాను
భిన్నమైనను నవి తామె భిన్నమగుచు
పోవు మేఘంబు తనకు తా బొలిసినటుల. 34

తే. కాక దా నటు హృదయ సంకల్పగతులఁ
దగిలెనేనియు సంకల్ప తాపమెడయ
దట్టిసంకల్పమునకు వే రయ్యెనేని
కలుగు నత్యంతసుఖము నిత్యంబుజూడ. 35

వ. కావున దనకు సంకల్పంబు లేయేమార్గంబులం దోచు నావెంటం బోవక నిరాలంబంబున దృష్టినిలిపి తద్విషయం బులు మనంబునం దోచిన నవి మిథ్యాస్వరూపంబులుగా దెలిసి నిరపేక్షభావంబున తనకవి లేనియట్టు లుండవలయు నని చెప్పి మఱియు ని ట్లనియె. 36

క. ఏ విషయంబుల వింతలు
భావంబులఁ గాంచి వాని బడిబడిపోవఁ
భావింప నవియె తనకును
జీవాంకురహేతువులు ప్రసిద్ధం బరయన్. 37

ఉ. పంబిన యావికల్పములు పన్నుగ దత్త్వనిదర్శనంబు భావంబున జేసిచూచిన నవశ్యము నుద్భవమయ్యె నా నిరాలంబమునందు దా నిరవలంబమె బ్రహ్మము నిర్వికారతేజం బది తన్ను నచ్చట నిజంబుగ లీనము సేయఁగాదగున్.

ఆ. ఎలమి నెవ్వఁడాయె నేమి దేశాంతర
వాసియయిన నిజనివాసమునకు
వచ్చి సుఖమునొందు వానిమాహాత్మ్యంబు
లజున కైనఁబొగడ నలవి యగునె. 39

ఉ. పారు నదీజలంబులును పారక నొక్కెడ నిల్చెనేని గం
భీరమునై సముద్ర మగుపేర్మి సమస్తము లోనడంగి ఙెం
పారును నట్లజీవుఁడు నిజాంశ జలింపక నిల్చెనేని ని
ష్కారణమయినబ్రహ్మ మగుస్వానుభవంబునజూడు నేర్పునన్.

సీ. ఇక నొక్కగుఱుతు నీ కెఱుఁగింతునదియు ప్ర
పంచసంహారమై బరగుచుండు
నది యెట్టిదన్న మాయాలక్షణస్వరూ
పోన్ముఖస్ఫురణ యై యొనరదీప్తు
లను విపరీతకల్పనలు మనశ్చిత్తు
రాదింద్రియములు పెక్కగుచునుండు
నవి సుఖదుఃఖదాయకములు గావున
నింత యవిద్యయం దెలమిబుట్టె
తే. కల్పనలు యెప్పుడు వినాశ కరములగును
నపుడు మాయాయవిద్యలు నడగిపోవు
నట్టివేళల సకలేంద్రియముల చేష్ట
లుడిగి లయమొందు తమకు దాము రుగుణాఢ్య. 41

వ. అది యెటువలెనంటేని. 42

ఉ. గారడివిద్యవాఁడు బలుక్రంతలునా సొరకాయబుఱ్ఱలో
నీరమునించి వాయి బలునేర్పునమూసిన నన్నిక్రంతలన్

వారి దోరంగకుండు నలవాయటువచ్చిన నీరుజారు ని
ట్లారయ కల్పనల్దెగిన యంతనె నిల్చును నింద్రియస్థితుల్.

తే. అరయ కల్పనలెప్పు డడంగిపోవు
జననమరణంబు లప్పుడే సమసిపోవు
పరమసుఖమున నానందభరితుఁ డగుచు
నుండుననుచును జెప్పిన నుల్లమలరి. 44

వ. శిష్యుం డి ట్లనియె. 45

క. ఈవిషయమునకు నాదగు
భావంబున సంశయంబు ప్రాప్తం బయ్యెన్
దేవరవు నాకు విశదము
గా వివరింపంగవలయు కలవిధ మెల్లన్. 46

క. భావంబునజూడ సుషు
ప్త్యవస్థను కల్పనంబు లన్నియు నడగున్
జీవునికి జననమరణము
లేవిధమున దప్పనయ్య యోజింపుదగన్. 47

వ. అనిన శ్రీ గురుం డి ట్లనియె. 48

క. నీవడిగిన సంశయములు
వావిరి నిశ్శేషముగను వమ్మైపోవం
గా వినుపించెద నింతయు
భావమునం దెలియవినుము పరమగుణాఢ్యా! 49

సీ. అలరజీవుని సుషుప్త్యవస్థలోపల
కల్పనల్లేశంబు గానరాక
యుండిన నజ్ఞాన మొగినిరసించుట
లేదు గావున సమాలీఢమగును

సంస్కృతియెంతేని సడల దాత్మండును
నది సుషుప్తని తెలియంగలేక
నజ్ఞానమున లీనమగునందు నాత్మాను
భవము నేమనుచుఁ జెప్పంగవచ్చు
ఆ. నాత్మ యెంతదడవు నజ్ఞానవిషయవా
సనలు విడువడంతి సమయములును
జననమరణములును సతతంబు దప్పవు
జీవులకును యెన్ని భావములను. 50
క. మానితమగు సద్గురుకృప
చే నజ్ఞానమునగవియు చీకటినాశం
బైన సమయమున సత్యచి
దానంద మయస్వరూప మై వెలుఁగొందున్. 51
తే. లీల నాసుషుప్తి కాలంబులోనున్న
కల్పనలు నవిద్య గర్భవివర
మందు లీనమగును నజ్ఞాన మనుకాంత
గలిసి యాత్మయుందు గలియదయ్య. 52
వ. అది గావున నజ్ఞానంబు విడువకుండుటం జేసి సంసారంబు విడువదని చెప్పి యిందువలన నీసంశయంబు దెగె గదా యనిన శిష్యుం డిట్లనియె 53
తే. రమణవృత్తి జీవరాశికి నేవేళ
సుప్తిగలిగియుండు జూడ నందు
వెలయకల్పనలును విజ్ఞానమును నవ
స్థాంతరమున బొందు నటుల గాదె. 54
వ. అనిన శ్రీగురుం డిట్లనియె. 55

క. విను మటువలె గా దింతకు
ననుభవమే గురుతు గాన నజ్ఞానంబుఁ
ఘన మగువిజ్ఞానంబుఁ
మునుకొని యాత్మస్వరూపమున లీనమగున్. 56

క. శ్రీగురుకృపచే నెంతయు
వేగమ యజ్ఞానతమము విలయము నొందఁ
బాగుగ నప్పుడు వెలుఁగును
నాగతి బ్రహ్మంబు కల్పనాతీతము నై. 57

వ. ఇంకొకవిచిత్రం బెఱింగింతు వినుమని యిట్లనియె. 58

క. ప్రీతిగ విక్షిప్తగతా
యాతసునిష్ఠితసులీనతాహ్వయములు వి
ఖ్యాతము లగును సమాధిని
యేతద్విషయములు నాల్గు నెఱింగింతుఁదగన్. 59

వ. అవి సమాధిభూతము లనం దగు నది యెట్టు లనిన. 60

మ. సమతంజిత్తము బ్రహ్మమందునియతిఁ సమ్యక్స్థితి న్నొమన
స్యమునుంబొందితెనంతటన్వదలి సంసారక్రియావ్యాప్తికిం
దమకింపంగని వానిదెచ్చి మరలం దద్బ్రహ్మముం గూర్చుత
ద్విమలజ్ఞానవిశిష్టము న్దెలియఁగా విక్షిప్తయం బ్రుత్తముల్.

మ. అరయం జిత్తముసౌమనస్యమున బ్రహ్మంబందు లీనంబు నై
సరవిం గ్రమ్మఱ లేచివచ్చి ఘనసంసారంబు నీక్షించి క్ర
మ్మర దద్బ్రహ్మమునందు లీనమగు నామార్గంబు సద్వృత్తిచే
రరుదార న్వివరించితిన్వినుగతా యాత ల్వివేకింపఁగన్. 62

తే. మనసు వేగస్వరూపమం దనుగతముగ
తగిలి నిల్చి తదాకార మగుచు బరిణ

మించి యానందరస మారగించువృత్తి
ఘనసునిష్ఠిత యనఁగ విఖ్యాతిఁగాంచె. 63

తే. బ్రహ్మమున జిత్తమంతయు బరిణమించి
కేవలజ్ఞప్తిరూపమై లీలనిలిచి
సుఖము నెఱుఁగక నొక్కటై సొరిదినుండు
నది సులీనతయండ్రు మహాత్ము లెల్ల. 64

వ. ఇట్లు నాల్గుభూములవిధంబు లెఱింగి బ్రహ్మంబు ధ్యానంబు జేసిన సకలభ్రాంతులం గెలిచి ప్రయాసంబు లేక పూర్ణానందంబునం బొందు నతండు రాజయోగి యని చెప్పంబడు నని మఱియును. 65

తే. మనసు బ్రహ్మమందు మలసిన నింద్రియం
బులను గలసి సౌఖ్యములు ఘటించు
గాకయున్న విషయ గతులపై విడుచును
దుఃఖమున గృశించి తొట్రుపడఁగ. 66

క. జ్ఞానులకు చిత్తమంతయు
మానుగ నిశ్శేషముగను మరి బ్రహ్మములో
లీనంబగు నింద్రియ సం
తానముతో దేవతలు ముదంబున జూడన్. 67

వ. అని చెప్పి యింతవిస్తారం బేల చెప్పవలయు ననిన వినుము.

ఆ. మందమతుల కెల్ల మరి తెలియుటకునై
చెలఁగి యింతవట్టు చెప్పవలసె
తీవ్రమతుల కెల్ల తెలియంగ గురుసిద్ధ
వాక్య మొకటిచాలు వసుధలోన. 69

వ. ఇది రాజయోగప్రకారం బిది సార్వకాలంబు జేసి హృద

యంబున నిలిపినవాఁడు మహాపురుషుం డగునట్టి మహాత్ముం
డు తన హృదయాంతరాళంబున శ్రీగురు ననన్యభావం
బున సప్తవిధార్చనంబులును షోడశోపచారపూజలునుం
జేసి చిత్తంబునకుం గప్పిన రజస్తమోగుణంబుల నివార
ణంబు సేసి నిర్గుణబ్రహ్మంబుమీఁద భక్తినిలిపి తనకుదానె
నిర్గుణబ్రహ్మంబయిన పరమసుఖంబు బొందునటుల గాదేని
యష్టాంగయోగంబున భక్తిప్రసంగంబున జీవపరమాత్మల
కైక్యంబు సాలదనిన శిష్యుం డిట్లనియె. 70

సీ. అయ్య యెట్టిపదార్థ మవిపరికింపంగ
బ్రహ్మ మంచేటికి పలుకఁబడెను
సగుణమో నిర్గుణ సంజ్ఞయో పరమాత్మ
మాయ యెవ్వనిశక్తి యై యెలర్పు
నది యెటువలెనుండు నా రూపమెట్టిది
యజ్ఞాన మెవ్వారి నాశ్రయించు
నెవ్వారు నిర్మించి రీప్రపంచం బెల్ల
నదియెట్లు నిలిచియున్నదితలంప
తే. జననమరణము లెటువలె సంభవించు
నెలమి జీవుని కీక్రమం బెల్లనాకు
దెలియ నెఱిఁగింపు మతికృపాదృష్టిఁజూచి
పరమకారణ గురుమూర్తి భవ్యకీర్తి. 71

వ. అని యడిగిన శ్రీ గురుండు కృపారసభరితుం డయి విను
మని ముందరికథావిధానంబు నిట్లని చెప్పందొడంగె. 72

ఇది శ్రీమద్వివేకసింధువునందు గురుశిష్యసంవాదమున
స్వానుభూతిప్రకరణమను నవమప్రకరణము.

ఆశ్వాసాంతము.

శా. సమ్యగ్జ్ఞానధురీణ గౌణమయవిస్తారప్రపంచస్ఫుర
ద్రమ్యాజాండకటాహసంజనిత భూతవ్రాత చేతోసమా
గమ్యామాన నిజప్రకాశవిమలాంగ శ్రీకళాంచద్దిశా
సౌమ్యాకార విహారభక్తజనసంసారాపనోదక్రియా. 73

క. గుణభూషణ గుణశోషణ
గణనాతీతప్రభావ కరుణాభరణా
ప్రణుతామర గణవిద్యా
చణసాధుశరణ్య నిత్యసత్యవరేణ్యా! 74

పంచచామరము:—

జగన్నివాస నిత్యముక్త సన్నిధిప్రభంజనా
మృగాజినాంబరప్రకాశ మృత్యుగర్వభంజనా
దిగంతరాళ సద్యశోవితీర్ణసాధురంజనా
యగణ్యపుణ్యచర్యనిర్మలాత్మసన్నిరంజనా. 75

గద్య. ఇది శ్రీగురుదత్తాత్రేయకృపాలబ్ధకవితావిచిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర వేగినాటివంశపారావారనిశాకళత్ర నాగయామాత్యపుత్ర సరసగుణధుర్యకొండనార్యప్రణీతం బయినవివేకసింధు వనుమహాప్రబంధంబునందు భేదఖండనంబును స్వానుభూతిప్రకారంబునుం గల ద్వితీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.

## దశమప్రకరణము.

శ్రీ రుచిర భువనవినుత వి
హారయశోహార సజ్జనాధారమహో
దార భవదూరహితబో
ధారంబితమునినికాయ దత్తాత్రేయా! 1

తే. అవధరింపుము సకలశాస్త్రార్థతత్త్వ
వేదియైనట్టి శ్రీగురుం డాదరమున
నిజపదాంబుజ సద్భక్తి నివ్వటిల్లు
నట్టి శిష్యునిం జూచి యిట్లానతిచ్చె. 2

తే. వినుము శిష్యశిరోమణి విశదముగను
యెలమి లోకోపకారార్థ మింతవట్టు
నడిగితివి గాన ధన్యుండ వగుట నీకు
దెలియవినిపింతు తత్త్వంబు తేటగాను. 3

సీ. అలరు నిర్గుణబ్రహ్మమందు జీవేశ్వరు
లనియెడు రెండువాక్యములు పుట్టె
నవిస్వానుభవవికాసాయత్త చిత్తులై
దృఢవివేకంబున దెలియవలయు
నావివేకములేక నన్యథానుక్తులం
దెలియుట దుర్లభం బెలమిజూడ

విమలవర్తికము రంధ్రముఁ జేయఁగా కాశ
యులిచేత గూడని చెలువుగాదె

తే. కాన బ్రహ్మావబోధ ప్రకాశయుక్తు
లకు వివేకంబు వలయును ప్రకటముగను
నదియు మిథ్యావివేక మాఁట్లుగాన
స్వానుభవమున సువివేకశాలి వగుము. 4

వ. నీ వడిగినప్రశ్నంబులకు సదుత్తరంబుగా నంతయు క్రమం
బునం దెలిపెద వినుమని యిట్లనియె. 5

క. ప్రకటింప శక్తిచక్రము
లకు భిన్నం బైనయెుక లనిపరికింపన్
సకలంక నిష్కళంకము
ల కుటిలమతి నదియె బ్రహ్మమని యెఱుఁగఁదగున్. 6

తే. తెలియఁగా ద్రష్టృ దర్శన దృశ్యములను
నవియె త్రిపుటియనంగ బెంపారుచుండు
నవియు నెక్కడ లీనమౌ నదియె తాను
నగుపరబ్రహ్మ మని తెలియంగవలయు. 7

క. ఏయెడ జ్ఞాతృజ్ఞాన
జ్ఞేయంబులు లేవు సమముసేయఁగ మఱి లే
దేయెడలను ప్రతివస్తువు
ధీయుత యది బ్రహ్మమనుచుఁ దెలియుము మదిలోన్. 8

తే. అదియ జ్ఞానరూప మనియంటి వేనియు
నెఱుక యచట లేదు నెంచిచూడ
నదియుగాక నదియు నజ్ఞానమంటివా
మరపు నచట లేదు మాన్యచరిత. 9

తే. అదియెభావమన్న నదిశుద్ధచైతన్య
సుస్వరూప మగుచు చోద్యముగను
అందు దోఁచుచుండు నానందమదిగాన
భావమనుచు ననఁగ బాగుగాదు. 10

వ. అది శూన్యంబని యంటివేని యజ్ఞానమయంబులయిన జగం
బులం జెఱుచు గావున శూన్యంబనరా దదియే ప్రత్యక్షం
బుగా బ్రకాశించుం గావున నింతయు బ్రహ్మవిదుం డైన
వాఁ డెఱుంగు నతండె ధన్యుండు. 11

క. ఉన్నదని పట్టరా దది
యున్నఁగ లే దనుచు విడువఁ బడ దది బ్రహ్మం
బెన్నఁగ నెవ్వరికిని వశ
మిన్నేటికి యెఱుఁగువాఁడె యెఱిఁగిసుఖించున్. 12

వ. అదియునుంగాక నిద్రించువారల బ్రబోధింపను ప్రబో
ధింపఁబడినవారల నెచ్చరికెలు సేయ హెచ్చరికె సెయఁబ
డినవారలను బోధింపం జేయను నీక్రమంబున నియమించు
చు దానక్రియుం డై యుండుగావున. 13

చ. పటికపు కొండచందమున భాసురమై విలసన్మహోన్నత
స్ఫుటదకలంక సర్వపరిపూర్ణమునై వెలుగొందు బ్రహ్మముఁ
బటుగతిబట్టి నన్నభము పాకముగాక నభంబుబోలి వా
క్పటిమ నగోచరంబగుచు బన్నుగనుండును నిశ్చలస్థితిన్.

వ: అది శుద్ధచైతన్యస్వరూపం బయిన బ్రహ్మం బదియె వ్యాప్య
వ్యాపకంబులకు వెలియై యుండునదియె నీ నిజస్వరూపం
బయి నీలోన వెలుంగుచుండు. 15

క. కమలభవ విష్ణు రుద్రులు
తమతమకార్యములయందు తత్తద్వ్యాపా
రము లాచరించి బడలిక
లమరఁగ దీర్చుకొను నాలయం బది తలఁపన్. 16

క. అదియె పరబ్రహ్మం బగు
విదితంబుగ నచటఁజూడ విద్యావిద్యల్
గదియవు గాన నగమ్యం
బది స్వస్వంవేద్యమగును నది నీవుసుమీ 17

తే. ఆపరబ్రహ్మ మదియు నేనైతి ననెడి
నాయహంకారమునుబొందు నతఁ డెఱుంగ
జాలఁ డాయాత్మ సువిచార సరణిగాన
నాయహంకృతి నాశనం బగుట మేలు. 18

వ. అపుడు కల్పనలు లీనంబయినస్వానుభవంబున బ్రహ్మం బని
తెలియంబడు గావున. 19

క నిండుకొని యనంతబ్ర
హ్మాండంబుల బాహ్యమునను నభ్యంతరమం
దుండును వ్యాపించుచు నది
దండిగ బ్రహ్మం బటంచు తలఁపుము దెలివిన్. 20

సీ గగనవీథిని మేఘగమనంబు గనిపించు
నటువలె బ్రహ్మంబు నందు మాయ
యనుపటలము దోఁచి కనిపించుచుండియు
నదిచెడు స్వప్రకాశాత్ముఁ డైన
నరయంగ బ్రహ్మాదిసురలు చింతింపంగ
చింతనల్చేయుచు చిత్తమునను

యెఱుకలేక నెఱుంగుదురు గాన నది నిర్గు
ణబ్రహ్మ మదియు పూర్ణస్వరూప

తే. మట్టి సర్వేశ్వరస్వరూపాంతికమున
తనరు మాయాప్రపూర్ణ చైతన్య మనఁగ
నెఱుఁగు మీమాయయును బ్రహ్మ మిట్టిదనుచు
పలుకఁ జెప్పంగ శక్యమే బ్రహ్మకైన. 20

క. వేదాంతము సిద్ధాంతము
వేదార్థం బుపనిషద్వివేకవచనముల్
ప్రోదిగ ప్రమాణశిష్టము
లాదట పాషండమతము లన్యతరోక్తుల్. 21

వ. వేదనిరోధంబు లగునితరమతంబులు పాషండమతంబు లవి
స్వకల్పనాసిద్ధాంతంబులు గావున విడిచిపెట్టుము. 22

క. ఇంక నివర్తనమును ని
శ్శంక న్నెఱిఁగింతు నిర్విషయ నిర్గుణమం
దంకురిత మయ్యె నొక్కక
ళంకముగా భాసరూపలక్షణ యగుచున్. 23

వ. అది బ్రహ్మవివర్తనం బని చెప్పంబడు నది నిజాకారం బై
వికసించియుండు నని మఱియు నిట్లనియె. 24

క. సూర్యప్రకాశమందు న
వార్యంబుగ మృగజలంబు వర్తించు గతి
న్నార్యముగ బ్రహ్మమందలి
కార్యముగ వివర్తనంబు గడువడిదోఁచున్. 25

క. చీకటిలో త్రాడుంగని
భీకరమగు సర్పమనుచు భీతిలు పగిదిన్

వీక నటఁ దోఁచు మాయా
స్తాకవివ_ర్తనము రజ్జు దుష్ఫణివోలెన్. 26

వ. ఇట్లు దృష్టాంతపూర్వకంబుగా జెప్పి వెండియు నిట్లనియె.

తే. బ్రహ్మ మనువృత్తిలే దని పలుకుమాయ
యదియు బ్రహ్మవివ_ర్తనం బండ్రు బుధులు
నదియు గుణసామ్యసంకేత మై చెలంగు
నని వచింతురు సాంఖ్యసిద్ధాంతపరులు. 28

తే. ప్రకృతిపురుషుఁడు గుణసమప్రాప్తుఁ డైన
మలయు నది యీశ్వరునకు నున్మనియవస్థ
చెలఁగి చైతన్యమును నధిష్ఠింపఁగాను
యది మహామాయ యనియందు రార్యజనులు. 29

వ. అమ్మహామాయాలక్షణం బెట్టి దనిన శుద్ధసా_త్త్వికం బయి
స్వరూపానుసంధానంబయి యొప్పుచుండు నాస్వరూపాను
సంధానం బెట్టి దనిన బ్రహ్మంబు గుణంబుజూపించుటం
జేసి యనుసంధానం బని చెప్పంబడు నదియె మహామాయ
యని చెప్పి మఱియు నిట్లనియె. 30

సీ. ఎలమిమిథ్యాభాసకుల కుపదేష్టయై
యలరి బ్రహ్మవివ_ర్తనాఖ్యదనరి
యొందు నే నే బ్రహ్మ మనెడి జ్ఞానస్ఫూ_ర్తి
యంకురించుచునుండు నార్యజనము
లది మహామాయ యం చని యెఱుంగుదురు బ్ర
హ్మం బెట్లు పరిపూర్ణ మై వెలుంగు
నటువలె నీమాయ యంతటి మహిమతో
వ_ర్తించు నిది యెవ్వరికి తరంబు

తే. ఇట్టి దనుచును మనమున నెంచుటకును
తివిరి యీమాయమహిమలు తెలియఁగోరు
పరమయోగులు కేవల బ్రహ్మమనుచు
కలిగి లేకున్న విధమును గాంతు రెలమి. 31

ఆ. రమణ దానిదుస్తరత్వంబు గన మహా
భూషణంబుగాని దూషణంబు
గాదు సుమ్ము మాయగనుపించు బ్రహ్మంబు
లోన గలిగి లేని దానిఁ బోలి. 32

చ. వలనుగ లేనితావున నవశ్యముదోఁచి పథంబుజూపి యా
జలజభవాదిదేవతల చక్కఁగఁబెట్టుచు గంతుఁలాడుచున్
నెలమి నటించుగాన జగదీశ్వరుఁ డిమ్ముల సృష్టికార్యమై
కలుగఁగఁజేయుమాయ యదిగ్రమ్మిన దాటదరంబె యేరికిన్.

వ. ఇది యనుభవం బగుమాయాప్రకారం బిది యనిర్వా
చ్యంబునుం గావున మిథ్యాభ్రాంతిమీఁద వ్యాప్తంబయి
ప్రకాశింపుచుండు నీమాయాలక్షణం బనిర్వాచ్యం బెట్టు
లనిన నుత్తరార్థంబున సవిస్తరంబుగా నెఱింగింతు విను
మని యిట్లనియె. 34

క. రావోయి శిష్యరాయా
భావింపఁగ నేమికొదువ బ్రహ్మమునందున్
వావిరి మిథ్యారూపం
బై వర్తిలుచున్న మాయ యెందు దలంపన్. 35

తే. అరయవిశ్వంబు మాయామయంబుగాని
బ్రహ్మమయ మని పలుకుట పాడిగాదు

యిదియు నెక్కడ మిథ్యయౌ నెంచిచూడ
నచటఁ దెలియ మరేమున్న దార్యచరిత. 36

మ. ఘనమై లేనిదె యున్నయట్లునిజమై కాన్పించు నాకాశమం
దనివార్యంబుగ వింతలై వివిధరమ్యాకార తేజోవినూ
తనరత్నాయతసౌధరాజములు గంధర్వారయంబుల్సుశో
భనవృత్తిం గనిపించు చందమున శుంభల్లీల దోఁచుం దగన్.

తే. అందుఁ బ్రహ్మం బధిష్ఠించి యలరుగాన
చూచియార్యులు ప్రకృతిపూరుషుఁ డటందు
రదియె మూలప్రకృతి పరుఁడైన పరమ
పురుషునకు నది నిజశక్తియౌ నఱసిచూడ.(?) 38

ఆ. మొనసి యేకరూపమున నున్నదానికి
గగనమందు లోన గలిగెనందు
తత్త్వములు జనించె తన్మాయలో నధి
ష్ఠించి యాత్మ మున్నమించుకతన. 39

చ. శరనిథిలోతరంగములు చాల జనించి వికీర్ణమై జలాం,తర
మున వ్యాపకం బగువిధంబున మాయజనించునందునం,దర
యఁగ బ్రహ్మము స్వరుప గన్పడు వ్యాపకమయ్యునందునం,
దరయఁగఁదోఁచుతన్మయమునై నదివోసగుణస్వరూపమున్.

క. మాయకు శేషం బై యన
పాయంబున పరమమగుచు భావాతీతం
బై యలరు చుండు నెప్పుడు
నాయది నిర్గుణము బ్రహ్మ మని యెఱుఁగఁదగున్. 41

క. ఏయెడ నేదొక్కటియును
మాయను గడచియుంచుచుండు మది బరికింపఁగ

మాయోపాధి బ్రహ్మము
ధీయుత యది శబళమనుచు దెలియుము తెలివిన్. 42

తే. సకలశాస్త్రంబులను నేది సగుణమనుచు
జెప్పఁబడునది యాత్మ యం చెన్నవలయు
చూడ నాతఁడు పరమపూరుషుఁ డటంచు
పలుకుచుండుదు రార్యులు ప్రజ్ఞమెరసి. 43

వ. పరమపురుషలక్షణం బెట్టి దనిన. 44

క. మాయామూలప్రకృతికి
నాయెడ భిన్నమయి యున్న దది యెట్లన్నన్
ధీయుత మూలప్రకృతికి
పాయక సాక్షిస్వరూపభావుం డగుచున్. 45

సీ. సతతంబు మూలప్రకృతిని తానె యెఱుంగు
చుండును స్వప్రకాశుండు నగుచు
నాకారమై యొంటియైననిరాభాసుఁ
డై ప్రకాశస్ఫూర్తి నలరుచుండు
నతఁడు స్వయంప్రకాశాత్మస్వరూపుఁ డై
మాయలో వ్యాపించి మలయుచుండు
నది గాన వారల నాదిసంసారులు
నని చెప్పఁబడు శ్రుతు లందు నెపుడు

తే. వేద్య మమ్మాయ యాతండు వేత్త యగును
జ్ఞేయ మమ్మాయ యతఁడు చర్చింప జ్ఞాత
యిటులనుండియు భిన్నులై యొసఁగు చుందు
రమృతు లటుగాన చూడు మహాద్భుతంబు. 46

క. తన సర్వజ్ఞత్వంబున
నెనయఁగ పురుషుండు ప్రకృతి నెఱుఁగుచు నుండున్
వినుప్రకృతి యట్టి పురుషుని
కని యెఱిఁగి యెఱుంగలేదు కడుజడ మగుటన్. 47

ఉ. వారల నాదిదంపతులు వారలకున్ వివరింపకూటముల్
వారక లేకయుండియును వారెడ బాయ రొకళ్లొకళ్లొ ని
ట్లారయ వర్ణరూపరహితాత్ములు నై యమృతస్వరూపు లై
భూరిమహాప్రభావములఁబొంపిరివొవుచునుందు రెప్పుడున్.

వ. మఱియు స్వరూపనిర్ధారణంబున నాత్మానుభవుం డైనమహా
నుభావుండు నిజస్వరూపంబు నెఱుంగుచుండు. 49

క. కోరి ప్రవృత్తి నివృత్తులు
నీరెండును మాయలగును నింతయుఁ జేయ
న్నారూఢి నిలిచియుండును
భారంబు వహించి సృష్టి పటుకార్యములన్. 50

సీ. హరిహరబ్రహ్మాదు లామహామహుఁడు ధ
రించిన యవతారరీతు లరయఁ
గావున వారలు ఘనుఁడైన పరశివు
నాజ్ఞవర్తింపుదు రనుదినంబు
నాతని గుణములె హరిహరబ్రహ్మ లై
సృష్టిస్థితిక్షయశ్రేష్ఠులు నయి
రది గాన నిక నొక యఖిలేశ్వరుఁడు గలం
డని చెప్పవలసె నయ్యలఘుమూర్తి
తే. మలసి చూచిన యంతనె మాయలోన
నామహాతత్వముద్భవ మయ్యెనపుడు

నదియె సృష్ట్యాదికార్యంబు లాచరించు
నెలమి నిజభావమున నిశ్చయించినపుడు. 51

వ. అమ్మహామాయయొక్క శుద్ధసత్త్వప్రతిభవిధంబు మహత్తత్త్వం బగు నచ్చటరజస్తమంబులు రెండును గూఢంబై సత్త్వగుణగర్భంబున గోప్యంబయి వర్తించు నది పరమకారణ దేహం బగు మఱియు రుద్రునిచేత సంహారంబు నేయుటకు కర్తయైన యదియె యవ్యాకృతశరీరం బగు నని మఱియు నిట్లనియె. 52

క. శిష్టుండు సర్వేశ్వరుఁడు న
ధిష్ఠింపఁగ నందు వాఁడమె త్రివిధావరణల్
చేష్టలు ప్రకటించుచు ను
త్కృష్టతవిలసిల్లుచుండు కృతకార్యములై. 53

సీ. రమణీయసాత్త్వికరాజసతామసా
హంకారములు మూటియందు నరయ
ననువంద సాత్త్వికాహంకారమున జ్ఞాన
శక్తివర్తించు నిశ్చయముగాను
నారూఢి రాజసాహంకారమున క్రియా
శక్తివర్తించును సరవిఁజూడ
నరయంగ తామసాహంకారమున ద్రవ్య
శక్తివర్తించును సమ్మతమున

తే. క్రమముతో నిట్లు శక్తిత్రయము జనించి
యెలమి వర్తించు చున్నసర్వేశ్వరుండు
ద్రవ్య శక్తినిఁ గనుఁగొన తామసాహ
మున జనించెను తన్మాత్ర లనఘచరిత. 54

వ. అవి శబ్దస్పర్శరూపరసగంధంబు లై భూతపంచీకృతంబు
లయ్యె తత్క్రిమంబు వివరించెద. 55

క. ముందు తమోహంకారము
నందు గగనమందువలన ననిలము ననిలం
బం దగ్ని యగ్నిలో జల
మందు పృథివిక్రమముతోడ నైదుజనించెన్. 56

తే. శబ్దవిషయమాకాశంబు స్పర్శవిషయ
మనిలమును రూపవిషయంబు నగ్ని రసవి
షయము జలము సుగంధవిషయము పృథివి
కార్యకారణభావముల్ క్రమత నవియు. 57

వ. అందుల చైతన్యంబు ప్రవేశించి యధిష్ఠించు గావున. 58

క. ఆరూఢి రాజసాహం
కారము సర్వేశ్వరుండు గనుఁగొను నంతన్
జేరి క్రియాశక్తిమహో
దారత నుదయించె నద్భుతం బలరారన్. 59

క. నయమొప్పఁగ శ్రోత్రత్వ
గ్నయనరసననాసికము లనందగు జ్ఞానేం
ద్రియములు గర్మేంద్రియములు
పయివాక్కరములును పాదపాయూపస్థల్. 60

వ. ఇట్లు రాజసాహంకారంబున దశతత్త్వంబులు జనియించె
మఱియును. 61

క. ధీరత సర్వేశ్వరుఁడు ను
దారుండై జ్ఞానశక్తిఁ దగ బరికింప

న్నారూఢి సాత్త్వికాహం
కారం బుదయించె స్వప్రకాశం బగుచున్. 62

వ. దానియం దంతఃకరణంబు జనియించె నదియొక్కటియె చతుర్విధభేదకంబు లనందగు మనోబుద్ధిచిత్తాహంకారంబు లయి యొప్పుచుండు. 63

క. ఆరూఢి సాత్త్వికాహం
కారంబున తత్త్వమొకటి ఘనముగ బుట్టెన్
ఆరయ కర్తయు భోక్తయు
నై రంజిలు పరమతత్త్వ మగుజీవుండున్. 64

క. మానుగ నన్నిటియందును
జ్ఞానహృషీకములు సాధ్యసాధకములు నై
మానితము లఖిలవిషయ వి
తానంబులలోన నరయ దగునుత్తమముల్. 65

సీ. ఆరూఢి దామసాహంకారమున జన
నం బైనభూతతన్మాత్ర లరయ
కార్యంబు లటుగాన గనుపట్టుభోగ్యసా
ధనము లై విశ్వసంధానము లగు
నాయహంకారత్రయంబున నొకతత్త్వ
ముద్భవం బై చాలనొప్పుచుండు
నది భిన్న మైతోఁచు నది యొట్టి దని యన
నార్యులు త్రిపుటియం చందు రెపుడు
తే. జ్ఞాతయును జ్ఞానమును జ్ఞేయ సరణు లనఁగ
కార్యకారణకర్తృత్వగతు లనంగ

భోక్తృభోగభోగ్యంబులపొందు లనఁగ
జరుగు దొమ్మిదిత్రిపుటి సంజ్ఞల జెలంగి. 66

క. తిరముగ నంతఃకరణము
లరయంగా భోక్తు రింద్రియంబులు భోగం
బరుదారఁగ భోగంబులు
నురుగతి భోగ్యంబు లగుచునుండు దెలియఁగన్. 67

క. ఏవిషయమునకు నైనను
భావింపఁగ మూఁడుమూఁడు పనివడిగూడం
గావలె నం దందులకొక
కైవర్తిలు నాత్మగలసి వ్యాపించితగన్. 68

సీ. ఆకసాంశమునభూతాంశ లైదంతఃక
రణపంచకంబునై రహిఁజెలంగు
ననిలంబు నందు భూతాంశలైదునుప్రాణ
పంచకం బగుచును బరిఢవిల్లు
ననలంబు నందు భూతాంశలైదునుజ్ఞాన
విషయపంచకము నై వెలసియుండు
నప్పున భూతాంశ లైదునుశబ్దాది
పంచకం బగుచును బరఁగుచుండు

తే. నవనియందలి భూతాంశ లైదుకర్మ
విషయపంచక మనఁదగి వెలయుచుండు
నిట్టి తత్త్వంబు లిరువది యేను నిటుల
నొగి బరస్పర ముదయించె నొప్పుగాను 69

వ. ఈపంచవింశతితత్త్వంబులయందు నొక్కొక్క-భూతాం
శంబు క్రమంబునంగూర్చిన నదియె పంచీకరణంబగు జ్ఞాతృ

సమానశ్రోత్రశబ్దవాక్కు లాకాశంబునందలి పంచభూతం
బులగు మనోవ్యానత్వక్స్పర్శప్రాణులు వాయువందలి పంచ
భూతాంశలగు బుద్ధ్యుదాననేత్రరూపాంఘ్రు లగ్నియం
దలి పంచభూతాంశలగు చిత్తాపాన జిహ్వారసోపస్థలు జల
మందలి పంచభూతాంశలగు నహంకారప్రాణఘ్రాణగంధ
పాయువులు పృథివియందలి పంచభూతాంశలగు నిదియే
పంచీకరణం బని చెప్పి మఱియు ని ట్లనియె 70

క. తిరమై జాతృత్వాంతః
కరణమున సమానవాయుగతమై శ్రోత్ర
స్థిరతఁ వాక్సహితముగా
బొరిపొరి శబ్దంబుఁగొను నభోభూతాంశన్. 71

క. మానసము ధ్యానమందుల
లీనంబయి త్వక్కువలన లీలం బాణి
స్థానంబు తోడ స్పర్శయు
మానుగ గొను వాయుభూత మహితాంశనొగిన్. 72

క. పొందుఁ బుద్ధియు దానము
నందుఁ దగిలి చక్షురింద్రియమునకు పాద
ద్వంద్వగతితోడ రూప మ
నందగు విషయంబు గొనుధనంజయు నంశన్. 73

క. చిత్తమపానునితోనా
యత్తం బై జిహ్వవలన నటగుహ్యముతో
నత్తరి రసవిషయముగొను
నుత్తమగతితోడ నప్పయోభూతాంశన్. 74

క. మానుగ నాహంకారమ
పానమునం గలిసి మఱియు ఘ్రాణేంద్రియసం
ధానమున గుదముతోఁగం
ధానందము గొనుమహీతలాంశస్ఫురణన్. 75

వ. ఒక్కటొక్కటి యయిదింటితోడంగూడి తన్మహాభూతాంశలం జనియించు నిది తామసాహంకారాంశయగు గావున సమస్తతత్త్వంబులు నక్కడ లీనంబులగు నది యతిసూక్ష్మంబయిన యవ్యక్తంబగు నట్టిమహాభూతంబులకు సృష్టిస్వరూపసంధానంబులకు హేతుభూతంబులయి పరస్పరైక్యంబున నొక్కచోట గూడుం గావున నిది యీశ్వరమాయాప్రభావం బని చెప్పి యీతత్త్వసృష్టిప్రకారం బతివిస్తారంబుగా నీకెఱింగించితిమి గావున పరిశీలింపందగు నని తదనంతరంబ. 76

ఇతి శ్రీమద్వివేకసింధువునందు సృష్టిక్రమ మనుగురుశిష్యసంవాదమున
తత్త్వసృష్టియను దశమప్రకరణము.

---

## ఏకాదశప్రకరణము.

క. ఆరూఢి బంచకోశ వి
చారం బెఱిఁగింతు నీకు సకలంబును వి
స్తారముగ సావధానో
దారవివేకమున వినుము ధర్మవిచారా! 1

వ. అని మఱియు నిట్లనియె. 2

సీ. అజ్జగర్భుండు బాహ్యాంతరంబులయందు
సంపూర్ణమై యధిష్ఠాన మగుచు
భూరిప్రకాశమై బోధస్వరూపమై
నిత్యమై నిగమసంస్తుత్య మగుచు
నాద్యంతరహిత మై యానందకంద మై
శాంతమై యోగసిద్ధాంత మగుచు
నమలమై నిరుపమం బై నిరాకారమై
యాద్యంత విశ్వసంవేద్య మగుచు
తే. సత్యమై యప్రమేయ మై సర్వభూత
సాక్షి చైతన్యమై నిరంజనము నగుచు
పరమైయొప్పి యపరోక్షభావమునను
నలరి వెలుగొందు నది బ్రహ్మ మనియెఱుంగు. 3

వ. మఱియు నియామకంబును నిరుపమంబు నభిన్నంబు నసాధ్యంబు ననంతంబునై యొప్పి యీ దేశంబునంగల దీ దేశంబున లే దని దేశకృతపరిచ్ఛేదంబును యీవస్తువునందు గల దీవస్తువునందు లే దని వస్తుకృతపరిచ్ఛేదంబును లేక సర్వపరిపూర్ణచైతన్యబ్రహ్మం బఖిలాంతర్యామియై యుండు నని చెప్పి మఱియు నిట్లనియె. 4

క. ఇటువంటి పరబ్రహ్మము
పటుగతి తా ననుచు దెలిసి పరమజ్ఞాన
స్ఫుట కుశలుం డగుజీవుం
డట ముక్తుం డగునటంచు ననుబ్రాజదువుల్. 5

ఉ. జీవుఁడు కర్మపాశములచేతఁ గృహీతుఁడు నై యనన్యస
ద్భావమునందు మోక్షము పదంపడికోరుచు సంసృతిక్రియం

దావడిబోన జిక్కి త్రిషుతాపశిఖిఁ బగిత ప్తమానుఁ డై
యేవిధి బాపుకొందు ననియెంతయు వేదనబొందు నెప్పుడున్.

సీ. అనయంబు దేవతిర్యఙ్మనుష్యాదిజం
తు వ్రాతములయందు తొడరిపూర్వ
జన్మంబునందు నే జర్పింప నెవ్వండ
నై యుంటినో యిప్పు డరసిచూడ
మానవదేహి నై మలసిదేహేంద్రియ
ప్రాణాదిభూతసంగ్రహములోన
నే నెవ్వఁడనొ మరి యేరీతివర్తింతు
రాజిల్లు నీశరీరంబుఁ డిన
తే. దెలియ ముందర సురనరతిర్యగాది
జంతువులలోన నెవఁడనై జననమంద
గలిగి యున్నాఁడనో పూర్వకర్మ మెట్లు
నేయ నున్నదో యనిచాల చింతనొందు. 7

తే. జన్మమృత్యుజరారోగ సమితివలన
దూషితం బైనయీతను వేషమునకు
నింక సుఖమే స్వభావమో లేక నధిక
మైన దుఃఖంబు సహజమో యని తలంచు. 8

ఉ. ఇప్పుడు లేశమైన సుఖమే నెఱుఁగ న్వివరింపజాగ్రతం
జెప్పఁగరానిదుష్కృతులచే బహుదుఃఖములం గృశింతునే
నిప్పటిబోలె స్వప్నమున నింతకు మిక్కిలి దుఃఖనొదునన్
గప్పిన నిద్రలో నెవరిగానక దుఃఖము నొందుచుండుదున్. 9

సీ. ఆరూఢి వర్ణధర్మాశ్రమాచారశా
స్త్రాదివాసనలు నత్యంతముగను

పేర్కొనినను దుఃఖపెట్టుచున్నవి క్రమ్మి
వాటిని సాధింప వశముగాదు
చేజేతబుణ్యంబు సేయలేనైతి నే
నికదుఃఖములు నాకు నధికమాయె
భావంబుజేసితి పాపమేటికిజేస్తి
ననెడితాపంబున న్నావరించి

తే. యెలమి వేదింపుచున్నది యిట్టిదుఃఖ
ములకు నెన్నఁడు గల్గు విన్ములనివృత్తి
పూని యెటువలె మోక్షంబు నేను గాంతు
ననుచు పరితాపమొందు మోక్షార్థి యగుచు. 10

క. సమకొని మోక్షోపాయము
క్రమమున విలసించునట్టి బ్రహ్మైక్యజ్ఞా
నము నాకెన్నఁడు దొరకును
యమనియమాదికము లెన్న డలవడు నాకున్. 11

తే. అరయ పరిపూర్ణమైన బ్రహ్మస్వరూప
మెఱిఁగి యెన్నఁడు విశ్రాంతి నేను సుఖంతు
ననుచు పరితాపమందుచు ననుదినంబు
నాత్మసుజ్ఞాన మర్థించి యలమటించు. 12

వ. ఇట్టి యాత్మజ్ఞానార్థియైన యుత్తమాధికారికి జీవబ్రహ్మైక్య
జ్ఞానసాధనంబు పంచకోశవిచారంబు గావున నది నీకెఱిం
గింతు సావధానాయత్తచిత్తుండవై వినుమని శ్రీగురుం
డిట్లనియె. 13

## పంచకోశవివరణము.

క. పంబుకొనియుండు నన్నమ
యంబును ప్రాణమయమనో మయంబులు విజ్ఞా
నంబును నాయానందమ
యం బన నివి కోశపంచకాహ్వాయము లగున్. 14

వ. అం దన్నమయకోశ ప్రకారం బెట్టు లనిన వినుము. 15

చ ధరణి జనించినట్టి బహుధాన్యవిధౌషధు లెల్లగూర్చి స్త్రీ
పురుషులు భుక్తిగొన్న పరిపూర్ణము నై సతియందు రక్తముం
బురుషునియందు శుక్లమును బోల్పగ గూడినతద్వధూవరుల్
గరమనురక్తితోడ రతికామసుఖంబుల గ్రీడసల్పుచున్. 16

చ. పెనగొని యోనిమేఢ్ర పరిపీడనము న్నొనరింపమేఢ్రముం
దనుగతమైనశుక్ల మది మెల్లనజారి తదీయయోనియం
దనుపమవృత్తితోబడిన నంగనకుం ఋతుకాలమైన జ
య్యనను దరంబునంగలయ నాదగుశుక్లము శోణితంబొగిన్.

వ. ఇట్లు శుక్లంబు యోనిద్వారంబునం బ్రవేశించి తద్గర్భగతం
బయిన శోణితంబునంగలసి మూఁడు రాత్రంబులకు బుద్బు
దాకారంబయి వారపక్షమాసక్రమంబున గరచరణాద్యవ
యవంబులు గలిగినశరీరంబయి నవమాసంబులు నిండిన
దశమమాసంబున జననంబై క్షీరాన్నంబుల వృద్ధిఁబొందు
చు జరారోగమరణాదిదోషదూషితం బైన యీస్థూలశరీ
రం బన్నమయకోశంబన జను నీదేహంబు శుక్లశోణితపరి
ణామంబు గావున మలమూత్రగర్భంబులం బొరలి యపవి
త్రంబు నమంగళంబున నిత్యంబు నగు నీశరీరంబు తా నను

కొని దేహాత్మబుద్ధితోడ పామరు లైనజనంబు లీశరీరంబు తీర్థపర్యటనసాలగ్రామశిలాతీర్థసేవనాదిశాస్త్రీయసంస్కారంబులచేత శుద్ధినొందింపుచు క్షీరాన్నభోజనౌషధాదిసేవాభ్యంగనదుకూలవస్త్రగాద్యుపచారలౌకికసంస్కారంబులచేత నాయురారోగ్యలావణ్యాధికారంబులు సంపాదింపుచు నీశరీరోపభోగంబె పురుషార్థం బని భ్రమసి సంచరింపుచుందురు. 44

క. వారలలో నవివేకులు
సారమతిని గురుకృపాప్రసాదంబున ని
స్సారమగు నీశరీరము
నారయ నన్నమయకోశ మని యూహింతుర్. 45

వ. ఊహించి యిట్టి యన్నమయకోశం బయిన యీశరీరంబు తా గా నని విచారించుచుండుదు రది యెట్టు లనిన. 46

ఆ. పూర్వజన్మమందు పుణ్యపాపంబులు
సేయఁబట్టి పూనిరోయ కిపుడు
సారిది మితములేని సుఖదుఃఖములు నేను
ననుభవింపఁగలిగె నని తలంచు. 47

చ. వెనుకొని యీశరీరమున వేరయియుండిన వాఁడ నిష్ఫుడున్, మునుకొని కర్తనైతి నిక ముందర నిప్పటిపుణ్యపాపముల్, అనుగతమౌను స్వర్గనరకాదులవెట్టుల గల్గునట్టియా, ఘనసుఖదుఃఖముల్గనఁగ గల్గునొకో యనిచూచు దెల్వితోన్. 48

సీ. వివరింపభూతభవిష్యత్ప్రవర్తమా
నము లైనకాలస్థానములయందు

రమణతో నీశరీరముకంటె వేరైన
వాఁడనై లయమొందువాఁడ గాక
నిత్యుండనై యుండి నే నింక ముందర
నెవ్వండనై పుట్టి నెగడవలెనొ
అనుభూతిచేచాల నలమటించుచు దాహ
విచ్ఛేదనవ్యాఘ్రవృశ్చికోర
తే. గాదికంబులచేత నశ్యమునుబొందు
నీశరీరంబు నేను గా నిదియు నాది
గాదటంచు విచారించు ఘనుఁడు పుణ్య
శీలుఁ డైనట్టి సువివేకశాలి యతఁడు. 49

ఉ. నాయది యీాకమండలము నాయది పుస్తక మన్నయట్టు లీ
కాయము నాదటన్న యెఱుక న్వివరింపఁగ నేను వేరు యీా
కాయమటంచు లోదలఁపగన్పడునాత్మపృథక్స్వరూపుఁడౌ
టాయెడ నీశరీరమున కవ్వల వే రగువాఁడు దా నగున్.

తే. వరలి యీాదేహమున కధిష్ఠాన మగుచు
సర్వతనుధర్మములకును సాక్షి యగుచు
తనకు లోపల వెలుపల దానె యగుచు
దనరు చైతన్యమే గాని తనువుగాను. 51

మ. తనువు ల్స్వప్నమనోరథంబుల క్రియ న్దండోపతండం
బులై, యనయంబుం గలిగుండు పోవు నివి కర్మాధీనసంప్రా
ప్తముల్, యెనయ న్నాకును వీనితోదగులు లే దెల్లప్పుడు
న్నే ఘనుం, డను నిత్యుండ నిరామయుండ విమలుండ న్
సాక్షిచైతన్యుఁడన్. 52

వ. అని విచారించుచు నీశరీరంబునందలి శాస్త్రీయలౌకికరూ
పంబు లయినమనుపటిదుర్వాసనలు పరిహారంబుగావించి
సుషుప్తిపర్యంతంబు లైనదివసంబులును మరణపర్యంతం
బయినకాలంబును వ్యర్థంబుగాకుండ నిత్యంబును నాత్మ
విచారంబు గావింపుచు కామాదులకు నవకాశంబీయక
వర్తించువాఁడు సత్పురుషుం డని చెప్పి ఇదియె అన్నమ
యకోశభ్రమనివారణకారణం బగు నింక ప్రాణమయకోశ
భ్రమనివారణక్రమంబు వివరించెద నని శ్రీగురుం డి
ట్లనియె. 53

తే. ప్రాణమయకోశ మది వా
క్పాణిపదోపస్థపాయుకర్మేంద్రియముల్
ప్రాణాపానవ్యానో
దానసమానములుగూడి తగవర్తించున్. 54

సీ. అరయంగప్రాణంబు అణుమయం బయ్యుశ
రీరంబునందు పూరించియుండు
నట్టిప్రాణంబు దా ననుకొని తత్ప్రాణ
నిర్వాపణమునకు నిత్యకృతము
నన్నపానాదిసేవాలోలచిత్తుం డై
క్షుత్పిపాసలు దీర్చు సుఖమువుదనకు
పురుషార్థ మనిచాల బుద్ధిలో భ్రమసికిం
చిజ్ఞులు సంచరించినను నైన

తే. దృఢవివేకులు యిదితోలు తిత్తిలోని
వాయు విదిగాని యిది నే నవశ్యమరయ

గా ననెడి భంగి నీదేహగతమునైన
ప్రాణ మిది నేను గా నని పలుకుచుండ్రు. 55

క. పదఁపడి యిది నాప్రాణం
బది నే గా నందుకంటె నే వే రని తా
ముదమున లో బరికించిన
విదితంబుగ తాను వేరు విస్పష్టముగాన్. 56

సీ. ధృతిశిఖీంద్రోపేంద్ర మృత్యుప్రజాపతి
క్రమమైన యధిదైవతములచేత
నారూఢిప్రేరితం బయిప్రవర్తించువా
క్పాణిపాదోపస్థ పాయువులును
నధ్యాత్మ లగునందు నలరువచోదాన
గమనముల్ సుఖవిసర్గలు ననంగ
నధిభూతములు వీని యందువర్తించిన
నైనను క్షుత్పిపాసాదికర్మ
తే. కములు నైనట్టి ప్రాణానిలనులు దేహ
మందులను సంచరించిన నైనతాను
ద్రష్టనటుగాన నిందులో దగిలిసంచ
రించి వర్తించు వాఁడ గా నెంచిచూడ. 57

చ. గొనకొని యిట్టిప్రాణమయకోశముతో తగులింత లేదు నే
ననయము దీనిలోవెలిని నంతట నిండినవాఁడ నై నిరం
జనుఁడను సాక్షిరూపుఁడను సర్వవిధంబుల నంచునాత్మలో
గనుఁగొనువాఁడెప్పుడున్యుఁడటుగావునచూడుముసద్వివేకతన్.

వ. అని ప్రాణమయకోశవిచారంబు తేటపడం బలికి యింక

మనోమయకోశవిచారక్రమంబు వినుపించెద విను మని
యి ట్లనియె. 59

సీ. ఘనమైన వాగాదికర్మేంద్రియములతో
తోడరి యిచ్ఛాఖ్యశక్తి తోడఁగలసి
సంశయరూపమై సతతంబుసుఖదుఃఖ
మునగల్గి నాభాసమున జరించు
నంతఃకరణావృత్తి యగువిశేషమె మనో
మయకోశ మనెడినామమున వెలసె
ప్రాణంబు పగిదిని పరిపూర్ణమయి యుండు
నట్టి యీమనము తా ననుచుజడము
తే. తోడ సుఖిని నేను దుఃఖిని నే నని
భ్రాంతినొంది యన్నపానవిధుల
మొనసి విషయలాభమునను దత్కామిత
సుఖముఁ గొనుచునుండు సోమరుండు. 60

వ. కావున వివేకులయినవారలు నామనం బనియెడి యెఱుక
చేత నీమనోమయంబునకు తాను వేరగుదు నని విచా
రించుచుందురు. 61

సీ. అనయంబు చంద్రుఁడా నధిదైవతము చేత
ప్రేరితం బగుచు సంప్రీతితోడ
మనమను నధ్యాత్మ మంతవ్యమనునధి
భూతంబునందు విఖ్యాతిగాను
వర్తింపుచుండియు వరుసగర్మాధీన
మగుసుఖదుఃఖంబు లనుభవించు

చుండిన నేనియు సువివేకి యగువాఁడు
నలరు నీయధిదైవతాదిత్రివిధ

తే. మేను గా నింతటికి సాక్షి నైనశుద్ధ
బుద్ధసత్యప్రకాశరూపుఁడను గాని
యిందులో నాకు సంబంధ మింత లేద
టని విచారించు విద్వాంసుఁ డనఘచరిత. 62

వ. అది గావున నీమనోమయకోశంబున కతీతుండ నై దీని లోపల వెలుపల నిండియుండుదు నని నిరంతరంబు నాత్మ విచారంబు సేయుచుండుము గావున సదసద్వివేకపూర్వకం బుగా గనుఁగొను మని చెప్పి యింక విజ్ఞానమయకోశ విచారం బెఱిఁగించెద సావధానంబున విను మని యి ట్లనియె. 63

సీ. మహనీయ విజ్ఞానమయకోశ మనఁగ శ్రో
త్రత్వగ్విలోచనరసననాసి
కము లైనజ్ఞానేంద్రియములతో గూడిక
ర్తృత్వభోక్తృత్వాదిధేయ మగుచు
కనుపట్టి పరలోక గమనాగమనముల
కతిసమర్థతగాంచి యలరినిశ్చ
యస్స్వరూపంబు నై యాభాసతో గూడి
నడచు నంతఃకరణప్రవృత్తి

తే. ఘనవిశేషంబు విజ్ఞాన మనెడికోశ
మట్టి విజ్ఞానమయకోశ మరసిచూడ
నది మనోమయమునుబోలి యంతవట్టు
నిండి పూరించియుండు నఖండ మగుచు. 64

వ. ఇట్టి విజ్ఞానమయకోశంబు తా ననుకొని శ్రద్ధాజాడ్యు
లైనపామరులు గొందరు యోగోపాసనాదివిధులుసలుపుచు
తత్ఫలసారంబు లయినస్వర్గాదిభోగంబుల ననుభవించుచు
తద్భోగంబులు పురుషార్థంబులుగా సంచరింతురు గావున.

తే. వారిలోన వివేకు లై వరలువారు
యెలమి నాబుద్ధి యనియెడి యెఱుకచేత
మొనయువిజ్ఞానమయకోశమునకు నేను
వేరగుట సిద్ధమనుచు భావింపుచుంద్రు. 66

సీ. మలయుదిగ్వాతార్క మప్రచేతోస్వరూ
పము లైన యధిదైవతములచేత
తొడరిప్రేరేపింపఁబడిన త్వక్చక్షు యన జి
హ్వాఘ్రాణములు ననునట్టియైదు
నధ్యాత్మ లగునందు నలరు శ్రోతవ్యాదు
లై దధిభూతంబు లందులోన
నలరు వాచస్పతి యధిదైవమతనిచే
ప్రేరితం బగుబుద్ధి వేర్కొనంగ

తే. తనరు నధ్యాత్మ యగుసుబోద్ధవ్య మనెడి
తివిరి యధిభూతమున బ్రహ్మావర్తించుకొనుచు (?)
కర్మములఁ జిక్కి యజ్ఞాదికార్యములను
వైదిక వ్యాపృ లనుచాల వనటనొందు. 67

వ. కృష్యాదిలౌకికవ్యాపారంబులం దగిలి తత్ఫలభోక్తలై
యుండియు భావంబుననే నిష్క్రియుండను నకర్త నభోక్త
నందుల బ్రవర్తించినవాఁడ గా నని తలంచుచుండు నని
చెప్పి మఱియును 68

ఉ. ఆవట బుద్ధికోశమున నల్లన లో వెలినిండియుండి బు
ద్ధ్యాదిసమస్తముంగనుచు నిందుకు నే దగ సాక్షినంచు ను
త్పాదిత సద్వివేకమున నన్నుగ నే నిదిగాను నాదియుగా
గాదిది యంచులో దెలియఁగల్గినవాఁడెపరాత్ముఁ డారయన్.

క. ప్రాణమయమనోమయవి
జ్ఞానమయము లనుచు జెప్ప జనుకోశంబుల్
మానుగ మూఁడును సూక్ష్మాం
గానూనావయవములు యథార్థముచూడన్. 70

తే. అట్టి సూక్ష్మాంగమునకు ముఖ్యావయవము
లగుచు నజ్ఞానకార్యమై యలరునట్టి
తనరు నంతఃకరణమె జీవునకుపాధి
భూతమైయుండు విశ్వవిఖ్యాత మగుచు. 71

క. ఆయంతఃకరణమునకు
పాయక హృద్బుద్ధిచిత్తభవ్యాహంకా
రాయతములు నాల్గవయవ
కాయములై యలరుచుండు కడుచోద్యముగన్. 72

క. కోరి మనోబుద్ధివ్యా
పారంబులు నాత్మనంటఁబడవట్లు జుమీ
యారయ నాచిత్తాహం
కారవ్యాపారములును గదియవు నాత్మన్. 73

సీ. అరయ క్షేత్రజ్ఞుఁడౌ నధిదైవతముచేత
చెలఁగి ప్రేరితమైన చిత్తవృత్తి
యధ్యాత్మస్మర్తవ్య మనునధిభూతంబు
నందువర్తించిన నైనగాని

రుద్రాదిదేవత రూఢిఁబ్రేరేపింపఁ
గలిగిన యయ్యహంకార మనెడి
యధ్యాత్మయందుల నగునహంకర్తవ్య
మనునధిభూతంబు నందు బ్రీతి
తే. బూని వర్తించెనేనియు భూరివిశద
మైన యధ్యాత్మమాధిభూతాధిదైవ
తప్రపంచంబునకు నేనె ద్రష్టనైన
వాఁడ నిస్సంగిననుచు భావమున దలఁచు. 74

క. అనయము నీదృశ్యములో
చనువొప్పఁగ నాకు జూడ సంబంధము లే
దనుచు విచారించినవాఁ
డనుపమ సుజ్ఞానియందు రార్యులు సభలన్. 75

వ. అని చెప్పి యింక నానందమయకోశక్రమంబు వివరించెద
విను మని శ్రీగురుండు శిష్యునింజూచి యి ట్లనియె. 76

సీ. మొనసి జాగ్రత్స్వప్నముఖ్యప్రపంచమం
తయును గ్రసించి విస్తార మగుచు
నలరు జీవోపాధియైన యంతఃకర
ణము తనయందు లీనంబుచేసు
కొని యవిద్యావ్యక్తయమతమంబది సుషు
ప్త్యాదిశబ్దములచే నందు బలుకఁ
బడిన సాభాసయై పరఁగు వ్యష్టిజ్ఞాన
మానందమయకోశ మనఁగ నొప్పు
తే. నదియె కారణదేహమం చనఁగ బరఁగు
నరయ విజ్ఞానమయమాది యైనకోశ

ముల కుపాదాన మదిగాన పూర్వకోశ
మండలములందు పూర్ణమై నిండియుండు. 77

తే. అట్టి యజ్ఞానమే యాత్మ యనుచు తాను
నజ్ఞుడను మూఢుండ నటంచు నాత్మభ్రమసి
బరఁగు వారలు హేతుసంప్రాప్తిజడము
పరిహరింపంగ జాలక భ్రాంతు లగుచు. 78

వ. ఇట్లు సంసారపాశబద్ధులై వర్తింతురు. 79

ఉ. పొందుగ వారిలోపలను భూరివివేకులు కొంద రిట్టి యా
నందమయంబుకన్నను ఘనంబుగ వే రని తన్ను నాత్మలో
నందలపోసి దీనికి ననారతముం బహిరంతరంబులం, దుం
దగ బూర్ణమై వెలుఁగు దుర్యపరోక్షమునందు సాక్షియై.

వ. కావున నీయానందమయకోశంబున కాశ్రయంబయిన
సాక్షిచైతన్యప్రకాశరూపుం డనుగాని తా నజ్ఞానరూ
పుండ గా నని తలంపుచుందురు. 81

ఉ. చీఁకటిలోననుంటి నని చిత్తమునం దలపోయువాఁడు నా
చీఁకటికంటె వే రగుట సిద్ధము నా దగ నిట్లు గాన నీ
వీక నవిద్య పోయె నిదె వేరయియుంటి నటన్న తెల్వియ
స్తోకతగల్గియెప్పుడును చూడ నవిద్యకు వేరు దా నగున్.

క. తలకొని యజ్ఞానము నే
దెలిసితి నని నాకుఁ జూడ దెలియఁబడెను ని
మ్ముల నజ్ఞానము తా గా
నెలమిత నని గా దటంచు నెఱుఁగుము దెల్వీన్. 83

సీ. రూపింప ఘనతమోరూపమై రాహువు
దేదీప్యమానుఁడౌ దివసకరుని

నంటి యాచ్ఛాదించునట్టి సుషుప్త్యాదిక
కమునందు నజ్ఞానతమము బలిసి
జ్ఞానస్వరూపమై మానితాధిష్ఠాన
కమనీయ మగుస్వప్రకాశమందు
కల్పితసంబంధకలితమై విలసించి
యలసుషుప్త్యాదికం బైనజడము
తే. వలన మేల్కాంచి యేమియుఁ దెలియ కింత
దడవు సుఖనిద్రఁ గాంచితి దా నటంచు
తలఁచి తెలివొందు నాసముద్యత్ప్రభావ
మైన యాత్మప్రకాశమే నని తలంచు. 84
తే. పరగ దనచేత దెలియంగ బడిన యట్టి
తనరు నజ్ఞానకార్యముల్ దాను గాను
దానితో నాకు సంబంధమైన లేదు
యని విచారించు వాఁడు పావనుఁడు ఘనుఁడు. 85
వ. అని యానందమయకోశవిచారక్రమంబు తేటపడం బలికి
శ్రీ గురుం డి ట్లనియె. 86
క. పొందుగ నన్నమయాద్యా
నందమయాంతంబుకోశ నామము లైదుం
డెందమున వాని వివరణ
మం దగశోధింపవలయు మునినుతచరితా. 82
వ. కావున నీపంచకోశస్వరూపంబులు లెస్సఁగా విచారించి
యీకోశంబులలో తానే యదియునుం గా ననియు వీని
తో నాకు సంబంధంబు లేదీకోశంబులకు వెలుపలను లోప
లను నిండి నిస్సంగంబై నిర్వికారంబై కూటస్థంబై మనో

వాగాదివిషయంబులకు సాక్షిచైతన్యప్రకాశరూపం బైన ప్రత్యగాత్మను నే ననియు విచారించుచున్న శుద్ధజీవునికి సర్వాధిష్ఠానపరిపూర్ణబ్రహ్మంబునం దైక్యంబున మోక్షసాక్షాత్కారంబు లభించు నని వేదశాస్త్రపురాణేతిహాసంబులు చెప్పుచుండు గావున నిందుల సంశయంబు లే దని చెప్పి నీవు సద్వివేకసంపన్నుండ వై సావధానంబున నీపంచకోశంబులును వేర్వేర పరిశోధనంబు గావించిన సంశయంబులును విచ్ఛిన్నంబులై మోక్షంబు కరతలామలకంబై సిద్ధించు నని శ్రీగురుం డి ట్లనియె. 88

సీ. ఈపంచకోశంబు లెవ్వరైన సువివేక
        శాలులై సదసద్విచారు లగుచు
నిత్యంబు శోధించి నీతివాక్యక్రియా
        నిపుణులై సుజ్ఞాననిష్ఠతోడ
వేర్వేర నొండొంటి విడిచి నిర్మలపర
        బ్రహ్మసాక్షాత్కారభావుఁ డగుచు
తన్మయంబున నొంటి తలపులు మరపులు
        లేని నిశ్చలసమాధానముననుు

తే. నిత్యమై నిర్వికారమై నిష్కళంక
మై నిరంజనమై సత్య మై వెలుంగు
నతని వర్ణింపఁ బ్రహ్మరుద్రాదులకును
వశము గా దని పలికె నిర్వాహకముగ. 89

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారక్రమమను గురుశిష్యసంవాదమున పంచకోశవివరణమను ఏకాదశప్రకరణము.

---

—◎ ఆ శ్వా సాం త ము. ◎—

శా. సత్యజ్ఞానవిహారసూరిజనహృత్సంచారభాస్వత్కళా
నిత్యానందలసచ్ఛరీర త్రిజగన్నేష ప్రభాపూరస
త్కృత్యాకృత్యవిదూరకల్మషరజశ్శ్రేణీవిధూతక్రియా
ప్రత్యగ్బ్రహ్మవిచారభవ్యగుణపారావారయోగీశ్వరా! 88

క. అత్రిమునిపుత్ర సత్యప
విత్రకలుషచయలతాలవిత్ర మునీంద్ర
స్తోత్రభవజైత్ర సజ్జన
పాత్రజగద్బ్రహ్మసూత్ర భవ్యచరిత్రా! 18

మణిగణనికరవృత్తము:—
భువనజ మునినుతచరణా
కవినుత శుభకర కలిభయహరణా
అవహిత సుగుణసదమితవితరణా
శివమయ శివగిరి శిఖరవిహరణా! 99

గద్య. ఇది శ్రీగురుదత్తాత్రేయకృపాలబ్ధకవితావిచిత్ర శ్రీ
వత్ససగోత్ర పవిత్ర వేగినాటివంశపారావారనిశాకళత్ర
నాగయామాత్యపుత్ర సరసగుణధుర్య కొండనార్యప్రణీ
తం బయినవివేకసింధు వనుమహాప్రబంధంబునందు తత్త్వ
సృష్టిప్రకారంబును పంచకోశవిస్తారంబును తన్మాహాత్మ్యం
బునుగలఁ జతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము.

## ద్వాదశ ప్రకరణము.



లలితయోగవిద్యా
లోలవివేకాలవాల లోకస్తుతసం
శీలా యనసూయాస
ద్బాలా సజ్జనవిధేయ దత్తాత్రేయా! 1

తే. అవధరింపుము సకలశాస్త్రార్థతత్త్వ
వేది యైనట్టి శ్రీగురుం డాదరమున
నిజపదాంబుజసద్భక్తి నివ్వటిల్లు
నట్టి శిష్యునితో నిట్టు లానతిచ్చె. 2

శ్లో. యస్య ప్రసాదా దహమేవ తత్త్వం
బ్రహ్మైవ జానాతి నిరస్తమోహః,
త్వామేవ నిత్యం విమలాత్మరూపం
శ్రీ వాసుదేవం శిరసా నతోఽస్మి. 3

వ. శ్రీ గురుం డి ట్లనియె. 4

ఉ. ఉత్తముఁ డైనసత్పురుషుఁ డొక్కఁడు లోకమునందు
నిశ్చలా, య త్తమతి న్ననేకజననాథులయందు నభక్తినిత్యు
నై, మి త్తికకర్మము ల్విడిపి మేలిమితో సగుణంబులందులం
జిత్తము నిల్పి తత్ఫలము శ్రీహరి కర్పణసేయుచుండగన్. 5

క. పరిశుద్ధాంతఃకరణో
త్కరుఁడై యధికారియగుచు తనచిత్తమునన్
సురనరతిర్యఙ్ముఖభూ
చరజలచరగగనచరనిశాచరవితతుల్. 6

సీ. అరయంగ నివిమొదలైన బ్రహ్మాండంబు
సకలలోకంబులు సరవిఁజూడ
సతతంబు కర్మనిర్మితము లనిత్యముల్
దుఃఖరూపము లని తోడరి యెఱిఁగి
వడి జన్మమృత్యుప్రవాహరూపంబైన
సంసారభయమున జాలగుంది
వరుస నిత్యానిత్యవస్తువివేకంబు
బఱిఁగి హాముత్రార్థఫలితభోగ
తే. గతివిరక్తిశమాదిషట్కప్రవృద్ధి
యల ముముక్షుత్వమీనాలుగైనసాధ
నములతోఁగూడి కలమాత్ర మమిత భక్తి
కాన్కఁగొనివచ్చి శ్రీ గురుఁగాంచిఁ బ్రీతి. 7

వ. ఇట్లు చనుదెంచి వేదాంతశాస్త్రజ్ఞుం డై బ్రహ్మానుభవ నిష్ఠుం డై యుపశాంతనిధి యైనసద్గురుం జేరి తచ్చరణకంజంబులకు సాష్టాంగద్వాదశనమస్కారంబులు గావించి శరణుఁజొచ్చి శిష్యుం డి ట్లనియె. 8

తే. స్వామి యీఘోరమైన సంసారమందు
నలరివర్తించు నధ్యాత్మికాధిభౌతి
కాధిదైవికరూపమై నట్టిబెడిద
మైనతాపత్రయముచేత నలమటించి. 9

క. భయపడి భవదీయాంఘ్రి
ద్వయ మిదె కనుఁగొంటి నాకుఁ దగసంసారో
దయభయము బాపి సత్క్రియ
దయసేయవె యప్రయాసతం దరియింతున్. 10

క. సులభోపాయంబున నే
వెలయఁగ దరియింతు సకలవేదాంతార్థో
జ్జ్వలతాత్పర్యము నాయం
దలి కృపను ననుగ్రహించి దయసేయఁగదే. 11

వ. అని శిష్యుండు ప్రార్థించిన శ్రీగురుండు సంక్షేపమార్గం
బున నీకుం దేటపఱిచెద వినుమని యిట్లనియె. 12

క. రావోయి శిష్యరాయమ
హావాక్యము నర్థములతో నటుశోధింపన్
జీవేశ్వరులకు నైక్యం
బావహిలం జేయ జ్ఞాన మదిమోక్షమగున్. 13

వ. అట్టి జ్ఞానంబు మోక్షసాధనం బని సకలవేదాంతంబులయం
దును నిర్ణయింపంబడిన పరమార్థం బనిన శ్రీగురునకు
శిష్యుం డిట్లనియె. 14

తే. స్వామి నేను మహావాక్యసరణి నెఱుఁగ
నందుగల యర్థసువిచార మదియు నెఱుఁగ
జీవ పరమాత్ము లుండెడి భావ మెఱుఁగ
వారి యైక్యస్వభావంబు వరుస నెఱుఁగ. 15

తే. నన్ను నేనెఱుంగ నాకు నీబంధంబు
లెట్లుగలిగె నదియు నేనెఱుంగ

మోక్ష మొందువిధము మొదటికే యెఱుఁగను
యేమిసేయు వాఁడ నేది వెరవు. 16

వ. కావున మీరు దయాపరమూర్తులరై నాయందు గల
కృపచేత లెస్సగా విస్తరించి యనుగ్రహింపవలయు నని
విన్నవించిన శ్రీ గురుం డిట్లనియె. 17

క. వినవోయి శిష్యరాయా
అనుపమమగు మంచిప్రశ్నయడిగితి విది మేల్
వినిపింతు సావధానం
బున విను మని పల్కె విమలబోధాత్మకుఁ డై. 18

క. నాలుగు వేదంబులలో
జాలఁబ్రవర్తించు నుపనిషత్తులయందుక్
దేలు మహావాక్యంబులు
నాలుగు గల వవియు నెట్లన న్వివరింతున్. 19

క. మానుగ ఋగ్వేదంబున
పూని మహావాక్య మొకటి పొలుపొందును 'ప్ర
జ్ఞానం బ్రహ్మ' యటంచు సు
ధీనుత పరమార్థకోపదేశం బగుచున్. 20

క. పెనుపొంద యజుర్వేదం
బునను మహావాక్య మొకటి పొలుపొందుచు నం
దెనయ 'నహం బ్రహ్మాస్మి' ని
పనుపడ నది స్వప్రకాశ కారణ మగుచున్. 21

తే. సామవేదంబునను మహాసార మగుచు
నొక మహావాక్య ముదయించె నొప్పుగాను

వనియు 'తత్త్వమసి' యంచు నార్యజనులు
బలుకుచుందురు పరమార్థభావ మనుచు. 22

క. నయమొప్ప నథర్వణమున
నియతంబై పలుకఁబడును నిర్మలరుచిరో
దయమైన మహావాక్యము
'అయమాత్మా బ్రహ్మ' యనఁగ నతిమహిమముతోన్. 23

క. ఈనాల్గు మహావాక్య
జ్ఞానార్థము లెల్ల నీకు సవిశేషముగా
బూనియెఱిఁగింతు విను మవ
ధానంబు నశేషముఖ్యప్రధానస్ఫురణన్. 24

క. పరగు మహావాక్యార్థం
బరయఁగ దెలియుటకు మునుపదార్థజ్ఞానం
బెఱిఁగి తు నాదార్థము
వరనుత సుజ్ఞానకారణం బగు దెలియన్. 25

వ. అనిన శిష్యుం డిట్లనియె. 26

క. పరికింపఁ బదార్థం బన
పరమార్థజ్ఞాన మనఁగ బడు నీరెండుం
వెరవొప్ప నాకుఁ దెలుపుము
పరమకృపామృతకటాక్ష పరిపూర్ణుఁడ వై. 27

వ. అనిన శ్రీగురుం డిట్లనియె. 28

క. త్వం పదమని తత్పద మని
యింపున నసిపద మనంగ నీమూఁడు విచా
రింప పదంబు లటంచు వ
చింపుదు రథ్యాత్మవిదులు చెలువముగాఁగన్. 29

వ. ఇంక పదార్థం బెట్లంటేని. 30

ఆ. త్వం పదార్థమనఁగ దలఁపోయ జీవుండు
యెలమి తత్పదార్థ మీశ్వరుండు
నసిపదార్థ మనఁగ నట్టిజీవేశ్వర
భావములకు నైక్యమై వెలుంగు. 31

సీ. అసూక్షితో త్వం పదార్థభూతుం డైన
జీవస్వరూపంబు చేరి వినుము
ప్రణుతింప నంతఃకరణమును నట తద
ధిష్ఠానచైతన్య తేజమపియు
నట్టి చైతన్యంబు నందు కల్పితమైన
లింగశరీరంబు లీలతోడ
నాలింగ దేహమం దనువొంద ప్రతిఫలిం
చిన చిదాభాసుండు చెల్వముగను

తే. అట్టి పురుషుని ధర్మంబు లైనయట్టి
తనదు కించిజ్ఞతయు కర్తృతయును భోక్తృ
తయును విని యెల్ల జీవత త్త్వంబు లగును
యనుచు వివరించి మఱియు నిట్లనియె గురుఁడు. 32

సీ. అనువంద తత్పదార్థత్వభూతుం డైన
యీశ్వరరూపం బదెట్టి దనిన
తలఁపోయ మాయయు తనరు మాయాధిష్ఠి
తంబైన చైతన్యధర్మ మనఁగ
నామాయ యందుల నొనరంగ ప్రతిఫలిం
చిన చిదాభాసుండు చెలువుమిగులు

నాచిదాభాసునియందు సర్వజ్ఞత్వ
సర్వేశ్వరత్వాది సద్గుణములు
తే. నవియు నన్నియుఁగూడి నయ్యీశ్వరస్వ
రూపమై యొప్పు నసి యనునాపదార్థ
మట్టి జీవేశ్వరులకును నైక్య మగును
జీవుఁడే యాత్మ జీవుఁడె బ్రహ్మ మనుట. 33

క. అని యిట్లు శ్రీగురుప్రభుఁ
డనుగ్రహము సేయ శిష్యుఁ డతివిస్మితుఁ డై
వినవయ్య సద్గురూత్తమ
మనమున నొక శంకఁ దోఁచె మాన్పవె దానిన్. 34

క. కించిజ్ఞత్వాద్యవగుణ
సంచయములఁ గూడియున్న జడజీవునికిన్
యొంచఁగ సర్వజ్ఞత్వా
ద్యంచిత గుణుఁ డీశ్వరునకు నైక్యము గలదే. 35

వ. అనిన శ్రీగురుం డిట్లనియె. 36

సీ. వరుసనిత్యానిత్య వస్తువివేకంబు
నిస్సంశయంబుగ నీకు లేదు
గాన సంశయములు గప్పుచున్నవి నీవు
తొడరి యేకాగ్రచిత్తుఁడవు గమ్ము
తెలియ నీలో నీవు తెలుసుకొమ్మని పల్క
శిష్యుఁ డిట్లనియె విశేషభక్తి
సంశయంబులు నాకు సడలిపోవుట లేదు
గావున బోధింపు కరుణతోడ

తే. ననిన గురుఁ డిట్టులనియె రావయ్య వత్స
అడుగవలసిన సంశయం బడిగి లెస్స
శంకఁ జేసితి సంశయచ్ఛేదముగను
నమర నెఱిఁగింతు సావధానముగ వినుము. 37

వ. అని యి ట్లనియె. 38

తే. అరయ లక్ష్యార్థమనఁగ వాచ్యార్థమనఁగ
నలరు ద్వివిధంబు వాచ్యార్థ మది గ్రహింప
నెలమి లక్ష్యార్థమే లేదు యిది గ్రహింప
లేదు వాచ్యార్థ మదిగాన లీలఁ జూడు. 39

వ. వాచ్యార్థం బనాత్మయౌట లక్ష్యార్థం బంగీకరింపం
దగు వాచ్యార్థం బంగీకరించిన నెక్కుడ ప్రత్యక్ష విరుద్ధం
బయ్యెడల నెల్ల లక్ష్యార్థం బంగీకరింపం దగును. 40

తే. కాన యిట్టిమహావాక్య గతులయందు
లక్షణంబున నైక్యవిలక్షణంబు
నలర బోధింపుచున్నది యట్లు గాన
మించు లక్షణ మంగీకరింపఁదగును. 41

క. లక్షణములు వినుము జహ
ల్లక్షణయున్నవపదార్థ లలితము నజహ
ల్లక్షణముం జహదజహ
ల్లక్షణయు ననంగ లక్షణలు మూఁడొప్పున్. 42

క. విడిచిన లక్షణ యొక్కటి
విడువని లక్షణయు నొకటి వివరింపంగా
విడిచియు విడువని లక్షణ
యొడపక నొకటగును వేళ్లు నివి మూఁడు సుమీ. 43

వ. ఈమాఁటయందును జహల్లక్షణక్రమంబు వినుము. 44

శా. గంగాతీరమునందునుండి యొకఁడుం గా వేరితీరంబు జే
రంగ న్వచ్చిన తీరవాసు లతనిం రంజింపఁగా జేసి యో
సంగా యెక్కడనుండివచ్చి తనినన్ సంతోషచిత్తుండ నై
గంగాతీరమునుండి వచ్చితి ననం గౌతూహలాకీర్ణు లై. 45

క. గంగాతీరంబునఁ గల
సంగతి సువిశేషముగను సర్వము మాకున్
రంగుగ జెప్పు మటన్నను
గంగాయాం ఘోషయనుచు కడువడి వలికెన్. 46

క. ఆవచనమునకు నర్థము
గావించిన గొల్లపల్లె గంగను గలదం
చావిర్భవించె గావున
నావాక్యమునకు పదార్థ మది యె ట్లనినన్. 47

తే. వరుస గంగాపదమునకు ప్రవాహ మనెడి
యర్థ మదిగాన నాప్రవాహమున గొల్ల
పల్లె గలదన్న వాచ్యార్థభావ మదియు
రూఢి నంగీకరింప విరుద్ధ మగును. 48

వ. ఇది ప్రత్యక్షవిరుద్ధంబు గావున గంగాపదంబున కర్థం బయినప్రవాహమనుట సర్వాత్మనావిడిచి యాప్రవాహ తీరంబున గొల్లపల్లె యున్నదని యూహించుట తాత్పర్యం బగు నింక నజహల్లక్షణప్రకారంబున కుదాహరణంబుఁ జెప్పెద వినుము అని శ్రీగురుం డి ట్లనియె. 49

సీ. అదిగాన నిటు లమ్మహావాక్యమందుల
లలిఁ జెప్పఁబడు జహల్లక్షణంబుఁ
జెప్పద మనినను జెప్పఁగూడదు గాన
నది యేల జెప్పరా దనిన వినుము
తగ త్వంపదార్థభూతం బైన జీవరూ
పంబాది జీవకూటస్థపదము
పనిబూని విడిచిపెట్టిన ముముక్షువులకు
స్వస్వరూపము లేక సడలిపోవు
తే. కాన వివరింపఁ బ్రత్యక్ష ఘనవిరుద్ధ
మౌను నటుగాన నిటువంటి దై చెలంగు
తగ జహల్లక్షణయుఁ జెప్పఁ దగదటంచు
బలికి యిట్లనె గురుసార్వభౌముఁ డప్పుడు. 50

వ. ఇంక నేవాక్యంబుచేత నేలక్షణంబువలన బ్రహ్మంబు జెప్పఁ
బడుచున్న దనిన వివరించెద. 51

క. అన్నమయకోశమాదిగ
పన్నుగ విజ్ఞానమయము పర్యంతంబుగా
యున్నాలుగు కోశంబులు
చెన్నుగ పరమాత్మ యనుచు జెప్పుదు రజ్ఞుల్. 52

ఉ. వారల మాటలందులనవశ్యము కోశములుం జడంబులం
చారయ లేక సెప్పుదురు అంతియె కాని జడస్వరూపదు
ర్భారము లైనకోశములు బ్రహ్మముగాదని గానకోశముల్
ధీరత సర్వదావిడిచి తేకువఁ జూడుము నాత్మలోపలన్.

క. పరువడి నాకోశములకు
నరయ నధిష్ఠానభూత మగుచైతన్య

స్థిరమండలి తాత్పర్యము
నరుదుగ నిటువంటి దగుజహల్లక్షణయున్. 54

వ. ఇంక నజహల్లక్షణ విధంబెట్టి దనిన. 55

క. మంచాఃక్రోశంతీ యని
యంచిత వాక్యంబునకును నర్థము వెలయన్
మంచలు కూతలుఁ బెట్టిన
టంచును బలుకఁబడునట్టి యర్థముఁగొనినన్. 56

తే. మనసిజడము లైనమంచలుకూఁతలు
బెట్టుచున్న వనిన రట్టుగాదె
పరగ నవియుఁ జూడ బ్రత్యక్ష ఘనవిరు
ద్ధంబుగాదె గాన దలఁచవలదు. 57

క. మంచలు విడిచియు నయ్యెడ
మంచెలపై నున్న జనులు మఱికూఁతలు బె
ట్రంచును నజహల్లక్షణ
సంచును బ్రహ్మమును జెప్పఁ జను నూహింపన్. 58

ఈప్రకారంబున వేదంబునందు 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ'
యను వాక్యంబునం దానందమయకోశంబునం గూడియు
న్న బ్రహ్మంబునం జెప్పుచున్నది కావున సదానందాదులవిడువ
కనే యానందమయకోశంబునుం జెప్పుద మనిన. 59

క. వావిరి యీయర్థంబు మ
హావాక్య విచారమందు నంగీకారం
బావహిల జేయఁదలఁచిన
నావిధ మరయంగ గూడ దది యెట్లనినన్. 60

క. కించిజ్ఞత్వాదిగుణా
భ్యంచిత చైతన్యుఁ డై గుణాంచితుఁ డై వ
ర్తించిన జీవుని కీగుణ
సంచయరహితునకుఁ జెప్ప జనదైక్యంబున్. 61

వ. కావున గుణావశిష్టుం డైనజీవునికి గుణరహితంబయిన బ్రహ్మంబుతో నైక్యంబు చెప్పఁగూడదు కాన నజహల్లక్షణతాత్పర్యంబున నానందమయకోశంబు విడిచి సచ్చిదానందంబులు జెప్పఁదగిన వని శ్రీగురుం డింక జహదజహల్లక్షణ విధం బెఱింగించెద వినుము 'సోయం దేవదత్త' యనియెడి వాక్యం బగు నది యెట్లనిన. 62

మ. కనుగొంటి స్మనునొక్కనాఁ డితని గంగాతీరమం దిప్పుడున్
గనుగొంటి స్మనుజూచు నాతనినటన్ గావేటితీరంబునం
దెనయన్నాతఁడు దేవదత్తుఁడగుట న్నెచ్చోటవీక్షించినన్
తనరన్నీతఁడు దేవదత్తుఁడగుటన్ దాత్పర్యమూహింపఁగన్.

తే. అలరు నా దేశ మాకాల మావయస్సు
నెలమి యీదేశ మీకాల మీవయస్సు
గలయు పురుషుని వాక్యార్థగౌరవమున
రూఢి నంగీకరింప విరుద్ధమగును. 64

వ. ఎటుల విరోధం బగుచున్న దనినం జెప్పెద వినుము. 65

సీ. గంగాతటముఁ జూడ కావేటిదరిగాదు
కావేటి దరిగంగ గడ్డగాదు
ఆకాల మరయంగ నీకాల మదిగాదు
యీకాల మాకాల మెంచగాదు

ఆవయ స్సిది గాదు యీవయు స్సదిగాదు
యీవయ స్సావయ స్సెలమిగాదు
తే. కాన ప్రత్యక్ష మగువిరుద్ధంబు దలఁప
నరయ నీవాక్యమునకు వాచ్యార్థమైన
తనరు తద్దేశ కాలవ స్తోవిభావ
ములను పోఁద్రోచిలక్ష్యార్థ భావుఁడైన. 66
వ. దేవ దత్తుఁడనెడి వాచ్యార్థం బెటువలె నంగీకరింప నగు
నటువలె నీమహావాక్యంబునందు. 67
సీ. అనువొంద తత్పదంబునకు వాచ్యార్థమై
మంపిర్లు మాయ యమ్మాయయందు
ప్రతిబింబితంబు నై పరగునీశ్వరుఁడును
నతని సర్వజ్ఞత్వ మాదిధర్మ
ములు త్వంపదమునకు మొనయు వాచ్యార్థమై
తనరు నవిద్యయు దానియందు
ప్రతిబింబితుఁడు చిదాభాసుఁడు నాచిదా
భాసుని నిజధర్మపరము లయ్యె
తే. నలరు కించిజ్జ్ఞతయు మొద లైనధర్మ
ములును నన్యోన్యమును నిమ్ములగ్రహింప
తగదు ప్రత్యక్షఘనవిరుద్ధంబు గాన
వాని నంగీకరింపంగ వలవ దిచట. 68
సీ. తనరారు నీవిరుద్ధం బైనమాయయు
సర్వజ్ఞతయు మొద ల్సద్గుణములు
నలరు నవిద్యయు నందు కించిజ్జ్ఞత్వ
ముఖ్యగుణంబులు మొదలుగాను

యా రెండువిధములు నెడముగాఁ ద్రోఁచియు
లక్ష్యార్థభూత మైనట్టియాత్మ
చైతన్యమాత్రమే సరవి గ్రహించుట
దగుసచ్చిదానంద ధర్మమైన
తే. బ్రహ్మమే నీవు నీవు తద్బ్రహ్మ మనుట
యదియె జహదజహల్లక్షణాఖ్యఁ దనరు
నిటుల నాలుగు వాక్యము లీవిధమున
బ్రహ్మమును జెప్పి బోధించు భవ్యచరిత. 69

వ. అని యివ్విధంబున లక్ష్యత్రయలక్షణక్రమంబును దేటఁబ
డం గ్రమంబునం దెలిపి బ్రహ్మంబు నీవె యగుట కీయర్థం
బునందు సంశయంబు లేదిది సిద్ధంబని వివరించి నాలుగు
మహావాక్యంబుల పదపదార్థంబులు క్రమంబునం దేటపడ
వివరించెద నని యిట్లనియె. 70

తే. వరుస నిటు నాలుగగుమహావాక్యములకు
పదపదార్థంబు క్రమమున బాగుమీర
తెలియ వినిపింతు వినవయ్య తేటగాన
టంచు గురుఁ డానతిచ్చి యిట్లనియె బ్రీతి. 71

క. పంబిన 'ప్రజ్ఞానం బ్ర
హ్మం' బనువాక్యంబునకును నర్థము విను నే
మంబున జెప్పెద బ్రజ్ఞా
నం బనుపదమునకు వివరణంబు న్వినుమీ. 72

శ్లో. ఏనేక్షతే శృణోతీదం జిఘ్రతివ్యాకరోతి చ,
సాధుసాధు విజానాతి తత్త్వజ్ఞాన ముదీరితమ్. 73

క. శోభిత స్వాధిష్ఠానచి
దాభాసుం డైనపురుషునఖిలేంద్రియమా
ర్గాభివ్యక్తజ్ఞానము
ప్రాభవమున క్రమముతోడ పలుకంబడియెన్. 74

వ. అవి యెయ్యవి యనిన. 75

చ. పురుషుని శ్రోత్రమార్గమున బూని బయల్పడు మాన
సాదిస, త్కరణ సువృత్తితోఁగలసి కన్పడునట్టిది జ్ఞానవృత్తి
యా, సరణిఁ జెలంగు జ్ఞానమున షడ్రుచులుం జవిగొంచు
తద్రుచి, స్ఫురణకు జొక్కుచు న్సుఖము బొందఁగఁజేయు
ను నట్టిజ్ఞానమున్. 76

చ. పురుషుని ఘ్రాణమందులను బూని బయల్పడు నట్టి దైన
యా, కరణసువృత్తితోఁగలసి గౌరవమొందెడు నట్టిజ్ఞాన
మా, విరివగు జ్ఞానసంపదను వేడ్కసుగంధము బూతిగం
ధముఁ, వెరవున గాంచి సౌఖ్యమున వింతఁగ జేసిన యట్టి
జ్ఞానమున్. 77

క. పురుషుని వాక్కున వెలువడి
యిరవొందిన కరణవృత్తి నెనసిన యదియే
యెఱుఁగ నగునట్టి యెఱుకను
నరుడుఁగ మాటాడునట్టి యాజ్ఞానంబున్. 78

క. పురుషుని పాణీంద్రియమున
వెరవున వెలిదోఁచుకరణవృత్తినెనసియుఁ
విరివి ఘనదానదండము
లరిమురి సేయించునట్టి యాజ్ఞానంబున్. 79

క. పురుషుని పాదేంద్రియమున
నరుదుగ వెలిదోఁచుకరణమం దెనసి మనో
హరమై గమనాగమనము
లరయుచు వెలుగొందునట్టి యాజ్ఞానంబున్. 80

క. పురుషుని గుహ్యేంద్రియమున
పరువడి వెలిదోఁచుకరణ పటువృత్తిని సా
దరమున గలసి సుఖక్రియ
లరికొని సేయించునట్టి యాజ్ఞానంబున్. 81

క. పురుషుని పాయ్వింద్రియమున
విరివిగ వెలిదోఁచుకరణవృత్తి నెనసి బం
ధురముగ విసర్జన క్రియ
లరయఁగ సేయించునట్టి యాజ్ఞానంబున్. 82

క. ఇటువలె సకలేంద్రియములు
పటుగతి వెలిదోఁచుకరణభావంబున సం
ఘటితంబయి తత్తత్క్రియ
లటువలె సేయించునట్టి యాజ్ఞానంబున్. 83

వ. అది గావున. 84

సీ. తనువునందున్న యంతఃకరణమునకు
నంతఃకరణవృత్తులైనయట్టి
కలుగు సంకల్పవికల్పంబులకును ప్రా
ణములకు ప్రాణధర్మము లనంగ
జను క్షుత్పిపాసలకును సాక్షిరూపమై
తనరారు నీసమస్తప్రపంచ

మే జ్ఞానమున తాను ఎలుఁగుచునుండు నా
జ్ఞానమే ప్రజ్ఞాన మనెడువాక్య
తే. మునకు నర్థంబు నగును నిర్మల నెఱుంగ
నట్టి కరణంబు తద్వృత్తు లైనతనుహృ
షీకముల నేతివాక్యవిశేషవృత్తి
దోఁచి ప్రజ్ఞానమాత్రంబు దొడరవలయు. 85

వ. ఇట్లు ప్రజ్ఞానమాత్రంబు త్వంపదంబునకు లక్ష్యార్థం బగు నని చెప్పి బ్రహ్మమనెడి పదంబున కర్థంబు వివరించెద విను మని వెండియు శ్రీ గురుం డి ట్లనియె. 86

శ్లో. చతుర్ముఖాది దేవేషు మనుజాశ్వగజాదిషు,
చైతన్య మేకం బ్రహ్మోక్తా ప్రజ్ఞానం బ్రహ్మమవ్యయమ్. 87

మ. వరుసం బద్మభవేంద్రముఖ్యదివిజవ్రాతంబునందుం దగన్
నరతిర్యఙ్ముఖజంతుభూమిరుహనానాజంగమస్థావరో
త్కరమందు న్మణులందు సూత్రముగతిం దానందనుస్యూ
తమై, వెరు కొక్కింతయు లేకనొక్కటగుదుఁ బెంపొందు
తద్బ్రహ్మమున్. 88

వ. అట్టి యద్వితీయం బయినచైతన్యం బెయ్యది యాచైతన్యంబు బ్రహ్మం బనుపదంబునకు లక్ష్యార్థం బగు నని చెప్పి బ్రహ్మాదిపిపీలికాంతంబును పదార్థం బగుట నిది మాయాకార్యం బని పరిహరింపందగినది యని వివరించి యిది పదద్వయంబున పదార్థంబగు నింక వాచ్యార్థంబు తేటపఱిచెద నని యి ట్లనియె. 89

సీ. వినవయ్య వత్స వివేకివై యిటువలె
సర్వానుస్యూత సారమైన

చైతన్యమే బ్రహ్మమై తనర్చును నది
కారణంబునను శరీరులందు
తనర ప్రజ్ఞానమం చనెడి చైతన్యంబు
బ్రహ్మస్వరూపంబు పరగఁజూడ
చైతన్య మన్నను చేత నాత్మ యటన్న
ప్రజ్ఞానమన్నను బ్రహ్మమన్న
తే. నామభేదంబు లే కాని ప్రేమ దెలియ
వస్తు వొక్కటేఁజూడ డవశ్యమరయ
బ్రహ్మమని నిశ్చయింపుము భావమునను
అనుచు వివరించి మఱియు నిట్లనియె గురుఁడు. 90

వ. ఇది 'ప్రజ్ఞానం బ్రహ్మ' మనెడి వాక్యంబునకు నర్థంబగు నింక 'నహం బ్రహ్మాస్మి' యనెడి వాక్యంబునకు నర్థంబు వివరించెద నది యెట్టులనిన నహమనియు నస్మియనియు బ్రహ్మమనియు నీమూఁడుపదంబులయందు నహమనెడి పదంబున కర్థంబు వినుము. 91

శ్లో. పరిపూర్ణపరాత్మాఽస్మిన్ దేహో విద్యాధికారిణి,
బుద్ధిసాక్షీ తయా స్థిత్వా పునర్నహ మితీర్యతే. 92
క. అలరు 'నహం బ్రహ్మం' బను
లలితపదముచేత లక్షిత లక్షణవృత్తిన్
దెలియఁగఁ జెప్పుచు నున్నది
యలరుచు నది యెట్టు లనిన నది యెఱిఁగింతున్. 93
క. అహ మను నప్పుడు వినుని
ష్పృహమయవికారంబునాత్మ సిద్ధం బది గా

కహ మనగూడదు తత్పద
మహంకృతి భేదంబు నగుట నాత్మనరు సుమీ. 94

వ. ఇంక నహ మనుటేమి యనిన వినుము. 95

సీ. పరమాత్మభూతమై పరగు చైతన్యంబు
నందల ప్రతిబింబ మై తనర్చు
నది యహంకారంబు నందులగూడిన
నహ మహ మనితోఁచు నందునున్న
వానిరీతిని నున్నవాఁడది తాను గా
వున జడమై వాచ్యమన జెలంగు
నాయహంకారంబు నందు దోఁచిన ప్రతి
బింబము లోప్పిదోఁచి పెంపుఁ గనిన

తే. నలరు చైతన్యమాత్రమే యహ మటంచు
బలుకుచుండు పదార్థానుభావముునను
అరయ లక్ష్యార్థ మగు నిది యహమటన్న
పదమునకుఁ జూడ లక్ష్యార్థ భావమగును. 96

వ. ఇంక బ్రహ్మ యనుపదంబున కర్థంబు వినుము. 97

శ్లో. స్వతఃపూర్ణపరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః,
అస్మీత్యైక్యపరామర్శా త్తేనబ్రహ్మవదామ్యహమ్. 98

ఉ. అన్నిఁటియందు తాను పరమార్థము నాపరిపూర్ణబ్రహ్మమే
వెన్నఁగ నైతివంచు నెరవేర్పడఁగా విమర్శించి నిశ్చయిం
పన్నగునట్టి బ్రహ్మ మని పల్కుచు నున్నది గాన బుద్ధికిం
పన్నుగ సాక్షినైతి వని భావమునం దలపోసి చూడుమా.

వ. అని చెప్పి శ్రీగురుండు కరుణాతరంగితాంతరంగుం డై
శిష్యునిశిరంబున శ్రీహస్తం బునిచి పూర్ణానుగ్రహంబు
జేసిన. 100

మ. గురుపుత్రుండు మహాప్రసాదమనినం గుప్తాత్ముఁడై నిశ్చల,
స్ఫురణ న్నుత్తరశాంభవీసుఖకళాపూర్ణప్రభావుండు నై,
పరమోత్సాహము నొంది లేచి గురుసత్పాదాబ్జయుగ్మం
బుపై, శిరము న్మోవఁగ మ్రొక్కి యి ట్లనియె విస్తీర్ణాను
మోదంబునన్. 101

తే. అయ్య! నేను గృతార్థుండ నైతినిపుడు
నాత మోహాంకరణదుర్గుణప్రవృత్తు
లెల్ల దొలఁగెను దుఃఖంబు లెల్ల బాసె
పరమసుఖలాభమునుజాల బ్రబలె నాకు. 102

వ. అని విన్నవించిన శ్రీగురుం డి ట్లనియె. 103

క. నీవు కృతార్థుఁడ వైతివి
కావున నీనాల్గువాక్యగౌరవవృత్తుల్
ప్రావీణ్యంబున దెలిసియు
భావింపఁగ మోక్షసుఖము పరువడిగలుగున్. 104

క. ఎవ్వరు వ్రాసిన జదివిన
నెవ్వరు వివరించి తెలిపిరేనియు వారల్
నివ్వటిలు వారి మహిమము
లెవ్వరికిఁ గణింపఁదరమె యిమ్మహిలోనన్. 105

ఇది శ్రీమద్వివేకసింధువునందు సృష్టిక్రమమను గురుశిష్యసంవాదమున
చతుర్విధమహావాక్యవివరణమను ద్వాదశప్రకరణము.

---

## త్ర యో ద శ ప్ర క ర ణ ము.

వ. శ్రీ గురుం డి ట్లనియె. 1

క. తాదాత్మ్యత్రయవృత్తులు
సాదరమున తేటపరతు సవమలచేతో
మోదంబున వినుము సుధీ
ప్రాదుర్భావప్రసన్నపాటవమమరున్. 2

తే. అలరుచుండెడి సహజ తాదాత్మ్య మనఁగ
తనరు కర్మజతాదాత్మ్య మనఁగ భ్రాంతి
జన్యతాదాత్మ్య మనఁగ నీసరణిఁజూడ
మూఁడువిధముల తాదాత్మ్యములు చెలంగు. 3

వ. అందు సహజతాదాత్మ్యప్రకారం బెట్టి దనిన. 4

శా. కాయామేయము నైనచిత్తము నహంకారంబునందుం దిశో, దాయత్తంబున బింబితంబయిన యాబింబప్రకారం బహం, బాయాసంబును లేక రెండొకటియై యం దొప్పుచున్నందుద, ప్తాయఃపిండముబోలి యేకమగుచు న్నాచిత్తురూపంబునన్. 5

క. పంబిన యాచిత్ప్రతిబిం
బంబున గూడున్నయట్టి మహితాహంకా
రంబునకును ప్రతిబింబ మ
యంబగు తాదాత్మ్య (మది) సహజతాదాత్మ్యమగున్. 6

వ. దీనికి సహజతాదాత్మ్యం బను పే రెటువలె వచ్చెనంటేని వినుము. 7

తే. ఎలమి పుట్టినప్పు డీరెండు నేకమై
కూడిపుట్టిగాని కొమరుమిగులఁ
జంట యైనయట్టి రెంటి తాదాత్మ్యంబు
సహజ మనెడి సంజ్ఞ బరఁగుచుండు. 8

వ. ఇంక కర్మజన్యతాదాత్మ్యంబు వివరించెద. 9

క. ఈగతి చిత్ప్రతిబింబము
తోఁగూడిన చిత్తువలెనె దోఁచెడియహమున్
బాగుగ స్థూలాంగంబును
దాఁగక సందర్భ మెప్పుఁ డగునపుడోలిన్. 10

తే. ఆయహంకారమునకు స్థూలాంగయోగ
మైన తాదాత్మ్య మది తెలియంగఁజూడ
నలర కర్మజతాదాత్మ్య మనఁగ నొప్పు
ఘనవివేకులు లోపల గాంతు రెలమి. 11

వ. దీనికి కర్మజతాదాత్మ్యం బని పేరెటువలె వచ్చెనంటేని. 12

క. పదఁపడి జాగ్రద్భోగ
ప్రదమగు కర్మమునబుట్టు పటుతాదాత్మ్యం
బుదితమగు కర్మమణఁగిన
తుది తాదాత్మ్యంబునడఁగు తూకొని చూడన్. 13

తే. కాన చిత్ప్రతిబింబంబుతోనకూడి
తనరునట్టి యహంకారమునకు స్థూల
తనువుతోఁగూడు తాదాత్మ్యధర్మ మదియు
నరయ కర్మజతాదాత్మ్య మనఁగ నొప్పు. 14

తే. కర్మమునుగల్గ తాదాత్మ్య మదియుఁ గలుగు
కర్మమును లేకయుండిన గలుగ దదియు
ననుట జాగ్రత్సుషుప్త్యాదు లైనవృత్తు
లందుజూడఁగ దగును తాదాత్మ్యచొప్పు. 15

వ. కావున నీతాదాత్మ్యంబువలన స్థూలశరీరంబును చైతన్యం
బై నట్టులుండు. 16

సీ. అలభ్రాంతిజన్యతాదాత్మ్య మెట్లన్నను
వివరింతు వినవయ్య వేడ్కతోడ
నేను బ్రాహ్మణుఁడను నేను క్షత్రియుఁడను
నేను వైశ్యుఁడ శూద్రుఁ డేన నగుదు
నే బ్రహ్మచారిని నేను గృహస్థుండ
నేను వానప్రస్థుఁ డేను యతిన
టను చిత్తవృత్తులయందులోఁగూడి సా
కారమా నాయహంకారమునకు

తే. అహ మనంజను శబ్దార్థ మైనయట్టి
సాక్షితోఁగూడు తాదాత్మ్యసంజ్ఞఁ దెలియఁ
నలరు నది భ్రాంతిజన్యతాదాత్మ్య మనుచు
పలుకఁబడుచుండు సువివేక పరుల వలన. 17

వ. దీనికి భ్రాంతిజన్యతాదాత్మ్యం బని పే రెటువచ్చెనంటేని.

క. జ్ఞానంబున సర్వాధి
ష్ఠానంబగు నాత్మ నెఱుఁగజాలనికతనఁ
బూని భ్రమియించుచుండును
తానయి తద్భ్రాంతిజన్యతాదాత్మ్యంబున్. 19

వ. ఈప్రకారంబున సహజతాదాత్మ్యం బనియు కర్మజన్యతా
దాత్మ్యం బనియు భ్రాంతిజన్యతాదాత్మ్యం బనియునుం గ్ర
మంబున మూఁడువిధంబులై యుండు నీతాదాత్మ్యత్ర
యంబునకు వృత్తి యెప్పుడు కలుగునం చేని. 20

సీ. సమబుద్ధియయ్యు జిచ్ఛక్తి యహంకార
ములు నెంతపర్యంతమును వసించు
నంతపర్యంతంబు నందుల సహజతా
దాత్మ్యనివృత్తియు నరయ లేదు
దీని కెప్పుడు గల్గు దెలియనివృత్తన్న
వర్తుసవిదేహకైవల్యమునను
ఆత్యంతికనివృత్తి యగు నని వివరించి
కర్మజతాదాత్మ్యకమున కెలమి
తే. సతత మీస్థూలతనుభోగసంగతంబు
నైన కర్మంబు చేబుట్టె నదియుఁ గాన
నట్టికర్మంబు సుప్తియం దణఁగుచుండు
నపుడు కర్మజతాదాత్మ్య మణఁగిపోవు. 21

వ. ఈప్రకారంబునం గర్మజతాదాత్మ్యంబునకు ప్రతిదినంబును
నాశంబు గలుగుచుండు. 22

క. దీనికి వినాశహేతువు
గానబడుఁ సద్విదేహకైవల్యమునం
దౌనత్యంతిక నాశమ
నూనం బగుజ్ఞానమునను నార్యస్తుత్యా. 23

తే. తనరు భ్రాంతిజన్య తాదాత్మ్యమునకుని
వృత్తియెప్పు డనిన వినుము నీవు
నేను బ్రహ్మమనెడి జ్ఞానం బదెప్పుడు
గలుగుచుండు నపుడు వదలిపోవు. 24

వ. ఇట్లు తాదాత్మ్యత్రయంబునకు నివృత్తిప్రకారం బొనతిచ్చి
మఱియు ని ట్లనియె నీతాదాత్మ్యత్రయప్రకారం బెందు
నిరూపించి రనిన వినుము. 25

క. విద్యారణ్యస్వాములు
హృద్యంబుగ దెలియ బలికి దృగ్దృశ్యవివే
కోద్యద్గ్రంథంబున ప్రతి
పాద్యం బొనరిచిరి జ్ఞానభవ్యస్ఫురణన్. 26

శా. తాదాత్మ్యత్రయ మెవ్వరైనమదిలో దాని న్విచారించి త,
త్తాదాత్మ్యత్రయమైన భ్రాంతులరయం దథ్యం బహంకార
మం,దుదయం బందు నిజస్వరూపు డగు సర్వోపాధినిర్ము
క్తుడౌ, నాద్విబ్రహ్మము నైన నాకు నవి లేవంచుం దలంపం
దగున్. 27

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 28

తే. ఎక్క డేమేమి జెప్పితి మెంచిచూడ
నవియె శాస్త్రంబు లందున్న వనుచు మదిని
తెలుసుకోనదగు సువివేక ధీగరిష్ఠు
లనుచు వివరించి చెప్పె నయ్యవసరమున. 29

శ్లో. న శివేన వినాశక్తి ర్న శక్తి రహితోశివః,
అనయో రేవ తాదాత్మ్యం వహ్ని దారుకయోరివ. 30

ఇది శ్రీమద్వివేకసింధువునందు సంహారకక్రమమను గురుశిష్యసంవాదమున
తాదాత్మ్యత్రయనిరూపణమను త్రయోదశప్రకరణము.



## చతుర్దశప్రకరణము.

వ. శ్రీగురుం డిట్లనియె. 1

క. ఆదరణమున జిహ్వా
త్వాదినిరూపణము నీకు నంతయు దెలియన్
బ్రోదికొని యెఱుంగఁజెప్పెద
మోదంబున వినుము చిత్రములు వివరింపన్. 2

శ్లో. అజిహ్వాష్షండకఃపంగురంధోబధిర ఏవచ,
ముగ్ధస్య ముచ్యతే భిక్షుః షడ్భిరేవ న సంశయః. 3

క. ధీరత వినుము నజిహ్వుం
డారయ షండుండుపంగునంధుఁడు బధిరుం
డారూఢి ముగ్ధుఁ డనఁగా
వీ రార్వురుగలరు వారి విధ మెఱిఁగింతున్. 4

వ. అందు నజిహ్వుం డెట్టివాఁ డనిన వినుము. 5

క. తోడరి యజిహ్వుం డనఁగా
కడునాలుకలేనివాఁడు గాఁడు యజిహ్వుం
డెడపక నెవ్వం డనినను
తడయక వివరించి చెప్పెద న్విను మఱియున్. 6

ఉ. సారె భుజించు వేళలను షడ్రుచులందు ప్రియాప్రియంబులుం, గోరక నెద్దియేని మదిగుందక ప్రీతి భుజించుచుండగా, మీఱిన సత్యవాఙ్నియమనిష్ఠుఁడు నై మితభాషియై యధికారి యజిహ్వుఁ డందురు సుధీజనవర్యులు నిశ్చయస్థితిన్.(?) 7

క. మానుగ కర్తృత్వాద్యభి
మానంబున బొరయకుండు మహితాత్ముఁడు ని
త్యానందుండు నజిహ్వుఁడు
ధీనుత యిది తెలుసుకొనుము దృఢముగనాత్మన్. 8

క. షండుఁ డనఁగ శిశ్నము లే
కుండు నతఁడు గాఁడు షండుఁ డొప్పగ మఱి యె
వ్వం డనిన దెలియఁజెప్పెద
పండితుఁ డై నిశ్చలస్వభావుం డగుచున్. 9

ఉ. అప్పుడు బుట్టినట్టి శిశువందును జవ్వనియై మిటారియై యొప్పులకుప్పయైన వికచోత్పలలోచన యందు వార్ధికంబుప్పతిలంగ నున్న ముదియుగ్మలియందును నిర్వికారుఁడై చెప్పెడిదేమి యెందు సమచిత్తుఁడుషండుఁడుయెంచిచూడఁగన్. 10

క. వెరవున పంగు వనంగా
పరికింపఁగ పిచ్చుకుంటుగా దీ ధరలో
మఱి యెవ్వం డనినను విను
సరసత నేఁఱిగింతు నీకు సౌజన్యనిధీ. 11

చ. ముదమున భిక్షకుంజనఁగ మూత్రపురీషము లాచరింప సమ్మదమున కార్యము ల్గలుగు మార్గము యోజనమాత్ర

మేగుచుఁ, బదపడి దుర్వ్యహారముల పర్వులు బారకనుండు
వాఁడు బెం, బొదలిన పంగువై వెలయు పుణ్యుఁ డతండు
తలంచిచూడఁగన్. 12

తే. అంధుఁ డన గుడ్డివాఁడుగా దరసిచూడ
నెవ్వఁ డనినను వివరింతు నెఱిఁగికొనుము
యితరవిషయంబులను జూడ నిచ్ఛలేక
నాత్మసంధాన తత్పరుఁ డగుచు నెపుడు. 13

క. పరికింప మనసుగోరిన
మరిజూచును నాలుతాడు మ్రాకులపొడవుఁ
గుఱిగడచ చూడ డితరము
లరుదుగ నాతండ యంధుఁ డని చెప్పఁబడున్. 14

ఆ. ఎలమి బధిరుఁ డనఁగ నెవరన జెవిటివాఁ
డరయగాఁడు బధిరుఁ డాత్మఁ దెలియ
నెవ్వరనిన వినుము హితభాషలకును దు
ర్భాషలకును నొక్క పగిదినుండు. 15

క. తిట్టిన దీవించిన మది
పట్టు వదలనీక వినని పగిదిని సమతఁ
గుట్టివ్వకుండు పురుషుఁడు
నెట్టన బధిరుం డతండు నిర్మలచరితా. 16

ఆ. మొనసిముగ్ధుఁ డనఁగ మూఢుండు గా డెవ్వఁ
డనిన తెలియ వినుము యానతిత్తు
సకలవిషయములును సన్నిధానంబున
నుండెనేని యెఱుఁగకుండు వాఁడు. 17

ఆ. విషయములు జనంగ వెలయ సమర్థుఁడై
దేహబలిమిఁగలిగి మోహరించి
మొనసియున్న విషయము ద్రోచి నిద్రించు
వానిభంగి నున్నవాఁడు ముగ్ధ. 18

క. తలఁకొని యీ యాఱుగుణం
బులు గలవాఁ డరయ జ్ఞానమున కర్హుఁడు వాఁ
డలఘుపదమోక్షసౌఖ్యము
సులభోపాయమున గొనఁగ సుఖవరి యతఁడున్. 19

ఇది శ్రీమద్వివేకసింధుప్రసంగము సృష్టిక్రమమను గురుశిష్యసంవాదమున
ఆజీవ్యత్వాదినిరూపణమను చతుర్దశప్రకరణము.



## పంచదశప్రకరణము.

వ. శ్రీగురుం డిట్లనియె. 1

క. నయమొప్పఁగ బ్రతిబంధ
త్రయ మెఱిఁగించెదను వినుము దానివలన సం
శయములు విచ్ఛిన్నము లగు
రయమున సుజ్ఞానబోధ రంజిలుచుండున్. 2

వ. అది యెట్లంటేని. 3

క. భూతప్రతిబంధంబును
నాతతముగ వర్తమాన మగు ప్రతిబంధం
బాతర్వాతను వెలసిన
ఖ్యాతిప్రతిబంధమనఁగ బఱఁగుచునుండున్. 4

వ. ఈమూఁటియందును భూతప్రతిబంధప్రకారంబెఱింగించెద నాకర్ణింపుము. 5

సీ. అవనిలో నొక్క బ్రాహ్మణుఁడు కుటుంబియై
తలపోసి జీవనార్థంబుగాఁగ
యెనుము సంపాదించుకొని ప్రత్యహంబును
ప్రత్తిగింజలు మంచిపచ్చికసవు
గొనితెచ్చి మేపుచు తనివారజిక్కనై
పులిసి కుండలలోన బూరటిలిన
కడుగు బోసియు లెస్స కాపాడి యది పిండు
పాలును పెరుగును బచ్చివెన్న

తే. నెయ్యి మజ్జిగ మొదలుగా నేర్పుతోడ
నమ్మి యాద్రవ్యమున ధాన్యమరసి తెచ్చి
తాను బిడ్డలు పెండ్లాము తగినబలగ
ములు భుజింపఁగ సంసారమున వసించి. 6

చ. ఇటువలె గొంతకాలము మతెందుకునచ్చికమింత లేక సం
కటపడకన్న వస్త్రములు గల్గి సుఖింపుచు నున్నయంత దు
ర్ఘటమగు క్షామముం దొడరి కర్మపరంపర దీరి యందరుం
దటతటవోయిన న్నొకఁడు దానిలిచె న్బహుదుఃఖభాజియై.

మ. జనసన్మాన్యము నైనయట్టిఘనసంసారంబు నిక్కంబటం
చును జిత్తంబున నమ్మియుంటి నిపుడియుంజూడంగ స్వప్నంబురీ
తిని మాయంబయి పోయె నిట్టిదె కదా దీని న్విచారింప ఛీ!
యనుచుం రోసివిరక్తుఁడై గురునిడాయం జేరి సద్భక్తితోన్.

క. గురుసేవఁ జేసి సద్గురు
కరుణ న్వేదాంతసూత్ర ఘనబోధకళా

పరిణతుని జేసి యొకనా
డరుదుగ శ్రీగురుఁడు శిష్యు నడిగెం బ్రీతిన్. 9

తే. అన్న యిన్నాళ్లనుండి నీవధికభక్తి
చెలఁగి శ్రవణాదు లాచరించితివి గాన
నొనర కృతకృత్యుఁడవు నైతివో తలంప
కొదవలున్నవొ చెప్పుమా కొదుక యిపుడు. 10

వ. అని యడిగిన బ్రాహ్మణుం డిట్లనియె. 11

శా. అయ్యా యేమియు గాన బూర్వమున నేనత్యంతసంసారినై
'ముర్యోముయ్యో' యటంచు నొక్క యెనుము న్మోదం
బుతోఁ సాకితిఁ,అయ్యెన్నమ్మృతమయ్యెనాడె యిపుడు న్నా
యెన్ము సాక్షాత్కృతం, బై యొప్పారెడి బోధయందుల
నిధి ధ్యానంబునందుం దగన్. 12

వ. అని యథార్థంబుగా బలికిన శ్రీగురుం డిది భ్రాతప్రతిబం
ధం బని విచారించి తత్ప్రతిబంధంబుఁ బోఁగొట్టందలంచి
యాయెనుమునందలి స్నేహంబు ననుసరించి తత్త్వం బుప
దేశంబు సేయందలంచి యిట్లనియె. 13

క. రావయ్య శిష్య నీకును
సావయవముగాఁగ నెనుము సాక్షాత్కారం
బై వర్తిలుచున్నది గద
వావిరి నది పరిహరింపవలయుం జుమ్మీ. 14

వ. అది యెట్టు లనిన. 15

తే. అస్తిభాతిప్రియం బన నలరుచున్న
నామరూపంబు లనుజాల ప్రేమఁగలసి

తో డరిపంచావయవములతోడఁ గూడి
యున్న యెనుమును భావింపుచున్న నీవు. 16

వ. ఆనామరూపావయవంబులం ద్రోచి వైచి చిన్మాత్రంబునే నని చింతించుకొమ్మని యుపదేశించినం దత్క్రమంబునం జింతింపుచున్న గొంతకాలంబున కానామరూపావయవంబులు తోచక శుద్ధచిన్మాత్రం బై సచ్చిదానందస్వరూపంబగు నాత్మసాక్షాత్కారం బై కృతకృత్యుం డయ్యె నని చెప్పి యిదిభూతప్రతిబంధప్రకారం బింక వర్తమానప్రతిబంధం బెట్టిదనిన విషయాసక్తిలక్షణం బనియు, ప్రజ్ఞానమాంద్యం బనియు, కుతర్కం బనియు, విపర్యాసదురాగ్రహం బనియు, నాలుగువిధంబులయి యుండు నని యెట్టులనిన. 17

సీ. విషయంబునందు భావింప నత్యాసక్తి
లలివిషయాసక్తి లక్షణంబు
బోధించు నర్థంబు బుద్ధిలో నిలువని
యదియె ప్రజ్ఞాన మాంద్యం బనంగ
గురుఁడు సెప్పినబోధకును పెడర్థముసేయ
నది కుతర్కం బగు నరసిచూడ
దేహాత్మబుద్ధితో దివిరిబోధించుట
యది విపరీతదురాగ్రహంబు

తే. యిట్టి నాలుగు విధముల నెనసివర్త
మానమైనట్టి ప్రతిబంధ మహిమ యొప్పు
దీనికిని వృత్తి యెటువలె దెలుపుమనిన
పూని యెఱిగింతు వినవయ్య పుణ్యచరిత 18

క. దమ మనఁగా నుపరతియన
శమమనఁగ దితిక్షయనఁగ శ్రద్ధసమాధా
నములను నీయాఱింటను
గ్రమమున విషయానుసక్తి గదలును వత్సా! 19

క. విరివిగ సద్గురుముఖమున
సరసగతి న్విని యదియె చలపట్టిమదిన్
మఱియొకమాఱు వచించిన
నఱిముఱి ప్రజ్ఞానమాంద్య మదిచెడి పోవున్. 20

క. మననము చేత కుతర్కం
బనునది చెడిపోవు వినుము మఱియు నిధిధ్యా
సనమున విపరీతంబున
బెనగుదురాగ్రహముపోవు పెంపెదలివడిన్. 21

వ. కావున నీప్రకారంబున వర్తమానప్రతిబంధంబునకు నా
శంబు గలుగుటంజేసి ముముక్షుండగు వాఁడు తానె
యాత్మస్వరూపం బని బుద్ధియందు విచారించుచుండు
నదియ వర్తమానప్రతిబంధం బని చెప్పి యింక భావిప్రతి
బంధప్రకారంబు వివరించెద విను మని శ్రీగురుం డి
ట్లనియె. 22

క. పరులకు హింసాకర్మం
బరుదెంచిన సమయమునను నాత్మజ్ఞునకున్
బొరసిన యారూఢదయా
నిరుపమరూపంబు ప్రేమ నెఱిఁబుట్టించున్. 23

వ. అది యొకానొకకాలంబున నొకానొకనికిం గాని సర్వత్ర
లే దని చెప్పి యి ట్లనియె. 24

సీ. మోక్షార్థియగువాఁడు మొదయు నీయాసక్తి
పరగఁభాతిప్రతిబంధ మనుచు
నెఱుఁగఁగ నిస్సంగి నేను కర్తను నన్ను
నేమి సేయఁగ జాలు నెరినియిప్పుఁ
డని దాని సడ్డసేయక నుండెనేనియు
నది కొన్ని జన్మంబు లతని కిచ్చు
నది యెటువలె నని యనిన దయాశక్తి
రూపమై ప్రతిబంధరూపమునను

తే. వాసుదేవుని యవతార వైభవములు
భరతునకు మూఁడు జన్మము లప్రాప్తమగుట
మఱియు కొందఱు నిటువలె మలసిరనుచు
శ్రుతిపురాణాదులందును జూడఁబడియె. 25

ఉ. కాన ముముక్షువైన బుధగణ్యుఁడు యీప్రతిబంధకార్య
ము, ల్మానుగ లెస్సఁగా దెలిసి మాఁటికి తన్నవియంటకుం
డ విజ్ఞానబలంబునం గడకు చయ్యన ద్రోయక దాని
నంటినఁ, మానవు జన్మకర్మములు మాధవునంతటివాని
కేనియున్. 26

క. నయమున నీప్రతిబంధ
త్రయమందుల లేశమైన తగులకయున్నఁ
భయరహితుఁ డైన మోక్షము
రయమున నీజన్మమందె రహిఁగాంచు జుమీ. 27

క. చిత్రంబుగ నీ ప్రతిబం
ధత్రయమున లేశమైన దగిలినయేనిం
బాత్రము చెడిమానవుఁడు న
పాత్రుండై మోక్షమంద బడఁడు నిజముగన్. 28

మ. అని యిబ్భంగి గురుండు శిష్యునకు నిత్యానందసంధాయ
కం, బనవద్యంబును నైనబోధ నిగమాంతానూనసద్యు
క్తులన్, వినుపించె న్వినుతద్విశేషమహిమా విఖ్యాతచే
తోవివేక నిరూఢిం బరతత్త్వలాభగరిమన్ గాంచెన్
సుఖించెన్ రహిన్. 29

సీ. ఈమహాగ్రంథంబు నెవరైన గడముట్ట
వివరించి చూచియు విస్మయమున
ననయంబు దాపత్రయాభీలసంసార
భవభయంబులఁబాసి పరమమైన
నిత్యనిర్మలసత్య నిరుపమానందమై
తనరారు బ్రహ్మసంధాను లగుచు
పరమసౌఖ్యంబును బాటించుచుండుదు
రిందుకు సంశయం బింతలేదు
తే. అట్టి వారలఁ జూచి బ్రహ్మాదిసురలు
వినుతు లొనరింతు రాత్మసంవేద్యు లనుచు
గాన నీకథమోక్షైకకారణంబు
పరమసుఖలాభహేతుసంప్రాప్త మగుట. 30

క. కావున వివేకసింధువు
నై వెలసిన యీప్రబంధ మతిభక్తినిసం

భావించి తెలిసి రేనియు
జీవన్ముక్తులయిధాత్రి జెలఁగుదు రెపుడున్. 31

క. అనుచు ముకుందమునీంద్రుఁడు
ఘనముగ లోకోపకారకార్యార్థం బై
తెనుగించెను వేదాంతము
ననుపమ సువివేకసింధు వనుపేరఁ దగన్. 32

క. ఈకథ జదివిన వ్రాసిన
ప్రాకటముగ వినిన ముక్తిపరులై యాయు
శ్శ్రీకరులై సుఖమొందుదు
రాకల్పాంతమును నిర్మలాత్మకు లగుచున్. 33

ఇది శ్రీమద్వివేకసింధుప్రనందు సృష్టిక్రమమను గురుశిష్యసంవాదమున
ప్రతిబంధత్రయనిరూపణమను పంచదశప్రకరణము.

---

శా. విక్షేపప్రముఖోపసర్గవిలుళద్విజ్ఞానసమ్యక్సుధా
ప్రేక్షోద్యద్ఘనభక్తిసంగ్రహమనోధీయుక్తసద్భక్తస
త్పేక్షాగ్రస్ఫుటసుప్రకాశ త్రిజగత్ప్రేంఖద్దృశశ్శ్రీకళా
సాక్షాద్బ్రహ్మమయస్వరూపకృతనిష్ఠానిత్యసత్యవ్రతా. 34

క. మంగళ శుభకలితవియ
ద్గంగాతటినీప్రభూతకారణచరణో
త్తుంగ మహిమానుషంగా
రంగద్విమలాంతరంగ రాగవిభంగా. 35

కవిరాజవిరాజితము:—

జగదభికారణ జన్మనికారణ సంసృతితారణ సత్యరతా
నిగమవిచక్షణ నీరదుహేక్షణ నిత్యవిలక్షణ నీతియుతా

త్రిగుణవిభంజన ధీగుణరంజన దీనజనావన దివ్యహితా
అగణితఖేలన ఆశ్రితపాలన ఆగమలోచన అత్రిసుతా 36

గద్య. ఇది శ్రీగురుదత్తాత్రేయకృపాలబ్ధకవితావిచిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర వేగినాటివంశపయఃపారావారనిశాకళత్ర నాగయామాత్యపుత్ర సరసగుణధుర్య కొండనార్యప్రణీతం బయినవివేకసింధు వనుమహాప్రబంధంబునందు చతుర్విధమహావాక్యవివరణంబును తాదాత్మ్యత్రయనిరూపణంబును అజిహ్వాత్వాదిషడ్విధవృత్తినిరూపణవిస్తారంబును ప్రతిబంధత్రయనిరూపణంబునుఁ గల సర్వంబును బంచమాశ్వాసము.

శ్రీ వివేకసింధువు సమాప్తము.





చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1930.